# జీవనస్రవంతి



# జీవనస్రవంతి

"లత"

ఆదర్శ గ్రంథమండలి,
విజయవాడ.

# అంకితం

రచనలోనే కాకుండా జీవితంలోకూడా
కామాలూ, ఫుల్‌స్టాపులూ అవసరంఅనిచెప్పి
నా చేత ఒప్పించిన మిత్రుడు

**మల్లాది నరసింహశాస్త్రికి**

# "లత" నవలలు

| | |
|---|---|
| ఎడారి పువ్వులు | రు 4-00 |
| నీలినీడలు | 2-00 |
| మిగిలిందేమిటి? | 1-75 |
| మోహన్ బంశీ | 3-00 |

# జీవన స్రవంతి

అవిచ్ఛిన్నంగా ప్రవహించిపోతున్న జీవనస్రవంతిలో ఒక బిందువు ఇంకిపోతుంటే మరో బిందువు వికసిస్తుంది. ఇది విచిత్రమైన సృష్టిరహస్యం. కాకులు కూస్తున్నాయి, కరణాలింట్లో పాపడు కెవ్వుమన్నాడు. అప్పుడే విడిపోతున్న మంచు తెరలతోపాటు అటో ఇటో అని భయపడుతున్న బంధువర్గంమనసులుకూడా సంతోషంతో విచ్చుకుంటున్నాయ్యి. పాపడు గుక్కపట్టి ఏడుస్తున్నాడు...

"ఇంత పెద్దపిల్లడు కనుకనే నా బిడ్డ యమయాతన పడ్డది" అంటూ పిల్లవాడిఅమ్మమ్మ మెటికలువిరిచింది. తరతరాలుగా ఆ ఇంట్లో చిన్నపిల్లడు పుట్టలేదు.

"చాల్లేవమ్మా, నీ మాటలూ నువ్వూను. ఇదేం అల్లాటప్పా వంశమనుకున్నావేమిటి? మా కరణాలింట్లో చిన్నపిల్లడు ఇంతమటుకు పుట్టలేదు. మా బుల్లిబాబు పెద్ద దొర అవుతాడు చూడు." అన్నది మంత్రసాని.

నిజమే. పిల్లడు చాలా అందంగా వున్నాడు. పెద్ద కళ్లూ చిన్ననోరూ చిక్కనిజుట్టూ ఉన్న ఆ పిల్లవాడి అందంతో పురిటిగది వెలిగిపోతున్నది. పదహారేళ్ళ ఆ బాలింతరాలి కింకా స్పృహరాలేదు. ఆ పిల్ల కిది రెండవకాన్పు. మొదట ఆడపిల్ల - ఆ పిల్ల అమ్మదగ్గిరకి పోతానని మారాం చేస్తుంటే, మీసకట్టన్నా సరిగా రాని పద్ధెనిమిదిసంవత్సరాల వాళ్ళనాన్న విసుగుతో ఓదారుస్తున్నాడు. ఆ పిల్లతో అవస్థ

పడుతున్న అతనిగతి ఆలకించేందుకు అక్కడెవరూ లేరు. ఆ ఇంట్లో ఉండే అశేషజనమూ పురిటిగదిదగ్గరే ఉన్నారు.

క్రిష్ణయ్యగారుమాత్రం కొడుకుపడుతున్న అవస్థ చూస్తూనే ఉన్నారు. కాని అంతవరకూ కోడలు నెప్పులుపడుతుంటే ఏమవుతుందో అనేభయంతో ఉండటంచేత పట్టించుకోలేదు. పురిటిగదిలో పసిపాపగొంతు వినిపించగానే అది మగవాడిగొంతు అని ఆయన తెలుసుకోగలిగారు. అపరిమితమైన సంతోషంతో కొడుకుదగ్గరకొచ్చి—

"నాయనా, మనవంశం తరించిందోయ్, అభిమన్యుడిలాటి మగబిడ్డ పుట్టాడు..." అని మళ్ళీ తనమాటలో తనకే ఏదో అపశృతి గోచరించటంవలన, ఆపదుద్ధారకశ్లోకం చదువుతూ మనుమరాల్ని చంకనేసుకుని చక్కాపోయా రాయన.

తనతండ్రి అన్నమాటలకి ఆ నూనూగుమీసాలమీద గర్వం తలయెత్తగా, తన పసిహృదయంలో పితృప్రేమ నిండారగా సగర్వంగా సూర్యోదయంవైపు చూశాడు. ఇంతలో అతనితల్లి కడియాలూ, అందెలూ గలగలమనగా మొగంలో హుందాతనం రాజసాన్ని, వున్నతవంశగౌరవాన్ని తెలుపుతుంటే రాణీలాగా నడచివచ్చి కొడుకువీపుమీద చెయ్యివేసి, కొంచెం దూరంలో ఉన్న భర్తవైపు శృంగారంగా ఒకచూపు చూసి, "మనం చేసినపూజలకి ఫలితంగా బంగారుతండ్రిని కన్నది కోడలు" అన్నది.

అదివిన్న ముసలాయన చిలిపిగా చూస్తూ "నువ్వూ కన్నావుగా పిల్లా, బంగారుతండ్రుల్ని ఇద్దర్ని" అన్నాడు. ఇంతలో పక్కబస్తీలో చదువుకొంటున్న చిన్నకొడుకు,

రాత్రి ఇంటికిరానందుకు అన్నగారు ఎక్కడ కోప్పడుతాడో అనేభయంతో అరుగుపక్కనుంచి జారుకొంటూ, తల్లీ, తండ్రి అన్న ముగ్గురూ నిలబడటం గమనించి, అన్నగారికోపం సంగతి మర్చిపోయి ప్రశ్నార్థకంగా తల్లివంక చూశాడు. తల్లి అతనినిచూసి నవ్వుతూ "రావోయ్ - కొడుకుపుట్టాడు" అన్నది.

తల్లిమాట ఇంకా పూర్తికాకుండానే ఒక్కగంతులో ఒదినగారి పురిటిగదిదగ్గరికి పరిగెత్తాడు. అప్పుడే స్పృహ వచ్చిన రాజ్యలక్ష్మి తన మరదిహడావిడి చూసి, చిరునవ్వు నవ్వి మంత్రసానివంక చూసి,

"రత్తీ, చినబాబుకు కొడుకుని చూపించవే" అనిరత్తికి చెప్పి, నీరసంగా మరదివంక చూస్తూ "చిన్నబాబూ, రాత్రి ఎక్కడికెళ్ళావోయ్" అన్నది. చిన్నబాబు ఆ ప్రశ్నకి సమాధానం ఏంచెప్పాలో ఆలోచించుకోకమునుపే తల్లి వచ్చింది. కోడలుఅడిగిన ప్రశ్న ఆమె విననేవింది. "మరదిగారిఅజ తరవాత కనుక్కుందువుగాని, కాసేపు నిద్రపో. రాత్రినుంచీ యమయాతనపడ్డావు" అని కోడల్ని కసిరి, చిన్నకొడుకువంక చూస్తూ "ఏమోయ్, ఎలాఉన్నాడు కొడుకు?" అని అడిగింది.

"ఒదినగారిప్రశ్నకి జవాబియ్యవలసినభారాన్ని తన మీాదనించి తీసేసినందుకు తల్లిని మనసులోనే అభినందించుకొని "బంగారుతండ్రిలా ఉన్నాడమ్మా" అని తల్లికి జవాబు చెప్పి, 'ఒదినా! అన్నంపెడతావా?' అని గన తెలివితక్కువకి

నాలుక కరుచుకుని నవ్వుకుంటూ, ఆవతలకి పోయినాడు అతను. రాజ్యలక్ష్మికూడా నీరసంగా నవ్వి అత్తగారితో

"రాత్రి వెండిగిన్నెలో పెరుగు తోడుబెట్టాను మరిది కోసం. మర్చిపోయేరు, అది అతనికి వేయండి" అని ఒత్తిగిలి పడుకుంది.

మంత్రిసాని చేతుల్లో మెరిసిపోతున్న మనవడిని తృప్తిగా చూసి, "నీళ్ళుపోసేటప్పుడు జాగ్రత్తేవే రత్తీ" అని మంత్రసానిని మరోమాటు హెచ్చరించి, కడియాలచప్పుడుతో కదిలివెళ్ళింది రామమ్మగారు.

అక్కడే కూర్చున్న రాజ్యలక్ష్మితల్లి వెంకాయమ్మ గారికి ఈ రాజసాలూ, ఈ మర్యాదలూ, ఇలా పురిటిగది లోకి రావటాలూ, ఆ మాటలతీరూ – అంతా ఆశ్చర్యంగా వెగటుగా ఉంది. ఇదివరకు ఆవిడ వీళ్ళఇంటికి రాలేదు. తొలి చూలుపురిటికి రాజ్యలక్ష్మి పుట్టింటికే వెళ్ళింది. ఇప్పుడైనా అక్కడికే పంపమన్నది తను. ఒక్కపురిటికే అది లాయకీ గాని, తడవతడవా పంపటం మర్యాద కాదు, మీరే వచ్చి ఆ చెంబెడునీళ్ళూ పోసివెళ్ళండి – అని వియ్యపురాలు ఉత్తరం వ్రాయటంవలన తనే రావాల్సివచ్చింది... వచ్చింది కాని-

వీరిమర్యాదలూ, కొడుకుల్నికూడా ఏమోయ్ అనటం, ముఖ్యంగా వియ్యపురాలు రామమ్మగారి రాచఠీవి, వియ్యంకుడు ఇన్నేళ్ళువచ్చినాకూడా భార్యతో శృంగారంగా మాట్లాడటం, భార్యని పేరుపెట్టిపిలవడం, ఇవన్నీ ఇట్లాఉండగా – తనకూతురు రాజ్యలక్ష్మికూడా వాళ్ళల్లో కలిసిపోయి, చిన్నరాణీలా దర్జాచూపించటం చాలా విచిత్రంగాఉంది

ఆవిడకి. రాజ్యలక్ష్మి తండ్రి ఈ సంబంధం చూసినప్పుడు వాళ్లు గొప్పవాళ్ళంటే, కాబోలు అనుకుంది గాని, ఇంత జమీం దారీ వ్యవహార మనుకోలేదు. ఇంతమంది నౌకర్లేమిటి? ఇంతంత గర్వాలేమిటి? అబ్బే! ఇలాఅయితే తట్టలో కాపురం బుట్టలోకి రావటానికి ఆట్టే కాలం పట్టదు అనుకుం దావిడ.

ఆవిడ అలా ఆశ్చర్యపడుతూ ఉండగానే, చాకలి సింగడు వచ్చి "వియ్యపురాలుగోరూ, తానం చేస్తారేమో అడగమంటుండారు పెద్దమ్మగారు" అని, "చిన్నమ్మగోరూ చిన్నమ్మగోరూ" అంటూ రాజ్యలక్ష్మిని పిలవటం ప్రారంభించాడు. వెంకాయమ్మగారికి వాడి ఘోరణ చూస్తుంటే ఒళ్ళు మండిపోయింది.

"ఏమిట్రా! ఆ గావుకేకలు? పిల్ల నిద్రపోతుంటే" అన్నది.

"మీకు తెలవదులేండి అమ్మగోరూ – చిన్నమ్మ గోరు నిదరపోతే ఒక్క-క్షణం గడవదు" అంటూ మళ్ళీ రెండు కేకలు పెట్టాడు వాడు. రాజ్యలక్ష్మి కళ్ళు తెరచి చూసి "ఏం కావాలిరా?" అని అడిగింది. పురిటిగదిలో కూర్చున్న ఈవిడగారు ఏం కావాలంటే ఏమిస్తుందో అర్థం కాలేదు వెంకాయమ్మగారికి. ఆవిడ నిన్న పొద్దునే వచ్చిందామె మరి. సింగడు ఆవిడవంక చూశావా మన తడాఖా! అమ్మగారు లేచింది అన్నట్లు గర్వంగా చూసి,

"చిన్నబాబుగోరు జీతంకట్టాలంట, పెద్దబాబుగోరు బందరెళ్ళి ఎయ్యో తేవాలంట. ముసలిదొరగోరికి అరిజంటుగా అరవయ్యైదు రూపాయిలు కావాలంట" అని వాడు

చెప్పంకుపోతుంటే, అరవయివెండిరూపాయిలు అనేసరికి ఆవులించేసింది వెంకాయమ్మగారు. రాజ్యలక్ష్మి వాడివంక విచిత్రంగా చూస్తూ "అరవయ్యివెండిరూపాయిలు ఎందుకురా మామగారికి? ఏంచేస్తారుట?" అని అడిగింది.

"కరణాలింట్లో మగదొరలు పుడితే, పేదోల్లకి అల్లకి రూపాయిలు పంచిపెడతారుగా" అన్నాడు గర్వంగా.

ఈమాట విని రాజ్యలక్ష్మి ఆశ్చర్యపోయిందికాని, వెంకాయమ్మగారు బిగుసుకుపోయి అంతలోనే తేరుకుని తట్టలోకాపురం బుట్టలోకిరానటానికి ఆట్టేకాలంపట్టదు అనుకుంది మళ్ళీ ఒకసారి. "అలా నుంచుంటావేరా, చప్పునపోయి అత్తగార్ని పిలుచుకురాక" అన్నది రాజ్యలక్ష్మి. ఆవిడ వచ్చి కోడలిదగ్గర తాళంచెవులు తీసుకుని, సింగడికి డబ్బిచ్చి మళ్ళీ తాళంచెవులు కోడలికిచ్చి వెళ్ళింది.

ఆ వెధవ ఇంతడబ్బు కావాలని వస్తే, నిజమా కాదా అని కూడా ఆలోచించకుండా కనీసం మొగవాళ్ళనయినా అడగకుండా నమ్మి అంతడబ్బూ ఇచ్చిన ఆ అత్తాకోడళ్ళ వాలకం వెంకాయమ్మగారికి సుతరామూ నచ్చలేదు. నచ్చక చేసేదీ ఏమీలేదు కనుక, కొంగు దులుపుకుని స్నానానికి వెళ్ళింది ఆవిడ.

అంతవరకూ ఎవరోఒకరు ఉండటంవలన సిగ్గుపడి ఊరుకున్న రాజ్యలక్ష్మి బిడ్డని గాఢంగా హృదయానికి హత్తుకొని నా బాబు బంగారుతండ్రి అనుకుంది.

ఏ కరణాలింట్లో బాబులు పుడితే వెండిరూపాయలు పంచిపెడతారని, సింగడు వెంకాయమ్మగార్ని ఆశ్చర్యంలో

ముంచిపోయినాడో, ఆ కరణాలు మామూలుగా కరిణీకం మాత్రమే చేసేవాళ్ళు కారు.

కృష్ణా గుంటూరుజిల్లాలు నైజాంనవాబుకింద ఉండగా, వీరు సేనాధిపతులుగానూ సర్వాధికార్లుగానూ ఉండేవాళ్ళు ఆ యా పరగణాలకి. ఇప్పుడు అవన్నీ లేకపోయినా "రావు" బిరుదాలూ రాజసాలూ మాత్రం పోలేదు. ఈ వంశంలో రక్తంపంచుకునిపుట్టిన ఏ ప్రాణికయినా రాజసం, హుందాతనం దానంతటికదే సంక్రమించే వారసత్వం. అదీ కాక, ఈ వంశంలోపుట్టిన ఆడపిల్లా మగపిల్లవాడూకూడా ఆరడుగులకి తక్కువఉండరు. అందానికీ ఐశ్వర్యానికీకూడా ఈ కరణాలు పేరుబడ్డారు. వారు కరణాలనేది పేరుకు మాత్రమే కాని, నిజానికి వారు జమీందార్లు. క్రిష్ణయ్యగారికి ముగ్గురుకూతుళ్ళూ, ఇద్దరుకొడుకులూ ఉన్నారు. ముగ్గురుఆడపిల్లలకీ పెళ్ళిళ్ళు అయినాయి. అల్లుళ్ళు - ఒకాయన ప్లీడరు, మరోఆయన పోలీస్ ఇనస్పెక్టరు, ఇంకో ఆయన పెద్ద భూస్వామి. పెద్దకుమారుడు ప్రసాదరావుకి పిల్ల అందమైనదీ, సంసారాన్నినడపగలిగిన తెలివితేటలు కలదీ కావాలని పట్టుపట్టి, తమకంటె కొంచెం పేదఇంటిపిల్లయినా రాజ్యలక్ష్మిని తెచ్చి చేశారు క్రిష్ణయ్యగారు.

పదమూడవసంవత్సరంలో కాపురానికివచ్చిన రాజ్యలక్ష్మి మామగారికోర్కె-ప్రకారం ఇల్లుదిద్దుకోవటమేకాకుండా సంతానవతికూడా అయింది. తొలుచూలు - పూర్ణ - ఆడపిల్ల. ఆ పిల్లఅందం భూలోకజనదుర్లభం. మనుమరాల్ని చూసి, దీని కింత అందమేమిటి! ఇది మంచికి కాలేదు అను

కునేవారు క్రిష్ణయ్యగారు. ఇప్పుడు కళ్ళు తెరిచి జీవనస్రవంతిలో కలిసిన ఈ బిడ్డ మగపిల్లవాడు. భవిష్యత్తులో అతడెంత గొప్పవాడవుతాడో ఆలోచించుకుంటున్న ఆ కుటుంబానికి అతనిభవిష్యత్తే ఆనాడు తెలిసిఉంటే... సరే, పోనీండి అది.

క్రిష్ణయ్యగారి రెండో కొడుకు పేరు నరహరిరావు. ప్రిసాదరావుకీ ఇతనికీ మధ్య ఒక ఆడపిల్ల ఉన్నది. నరహరి రావువయస్సు పదహారుఉంటుంది. బందరులో చదువుకుంటు న్నాడు. ఇంటిల్లిపాదికీ ఇతడంటే చాలా ప్రేమ. ముఖ్యంగా ఒదినగారికి మరీనూ. తనమరిది తనఈడువాడే అయినా, ఆమె కంటికి పసివాడుగా కనిపిస్తాడు. అప్పుడప్పుడు రామమ్మగారు నవ్వుతూ "పసివాడేమిటి? ఆడపిల్లఅయితే నీకుమల్లేనే ఇద్దరు పిల్లలతల్లి అయేవాడు" అని కోడల్ని చిన్నకొడుకునీ వేళాకోళం చేస్తూఉండేది.

రామమ్మగారు ఆకాలంలోనే బాగా చదువుకున్నదని ప్రఖ్యాతిపొందింది. ఆవిడమాటల్లో గాంభీర్యంతోపాటు సునిశితమైన హాస్యంకూడా ఉంటుంది. కాని ఆవిడఅంతర్యంలో యీ వంశం చూపించే మిథ్యాగౌరవాల ఆడంబరంమీద అంతులేని అసహ్యంఉందని ఆ పరాత్పరుడికికూడా తెలియదు.

నరహరిరావుకికూడా మొన్ననే ఒక పెళ్ళిసంబంధం వచ్చింది. ఆ పెళ్ళికూతురు ఈ ఇంటికోడలుగా వస్తున్నందుకు రామమ్మగారూ రాజ్యలక్ష్మికూడా ఆ అమ్మాయి దురదృష్టానికి రహస్యంగా నిట్టూర్చారన్నసంగతి ఎవరికీ తెలియదు.

పైకి కనిపిస్తున్న ఈ సుఖశాంతులకి పునాదిగా ఎంత అశాంతి గూడుకట్టుకునిఉందో, ఆ స్త్రీలిద్దరికీ తెలుసు కాని, ఆసంగతి ఎవరికీ తెలియకుండా జాగ్రత్తపడ్డారు.

తమ వంశాన్నిగురించి ఘనంగా భావించే వీళ్ళు మిగతా నియోగుల్ని కొద్దిగా చులకనచేయుట లేకపోలేదు. వీళ్ళ ఆడపడుచులు అత్తవారింటికెడితే మిగతా కోడళ్ళకన్న వీళ్ళకి గౌరవంఇస్తారు. ఎవరో మహారాణి తప్పిజారి తమ ఇంటికి కోడలుగా వచ్చిందన్నట్లు ఉంటుంది వారి ప్రవర్తన. అసలు వీళ్ళ ఇంటికి పిల్లనివ్వటం వీళ్ళపిల్లని చేసుకోటం ఎంతో అదృష్టంగా భావించేవాళ్ళు మిగతా కరణాలు.

కృష్ణయ్యగారి ముగ్గురుకూతుళ్ళకీకూడా ఇదే గర్వం. గొప్పఇంట్లో పుట్టామనీ, డబ్బుగలఇళ్ళల్లోకి వెళ్ళామనీ వారికి అహంకూడా ఉన్నది. సౌందర్యంతో సంపదలతో తులతూగిపోతున్న వాళ్ళకి రాజ్యలక్ష్మినిచూస్తే అంతర్గతంగా తృణీకారభావం.

ఒకసారి తన పెద్దాడబిడ్డకొడుకుని ఉయ్యాలదగ్గరికి వెళ్ళి 'ఛీ ఛీ' అని పలకరించింది రాజ్యలక్ష్మి "దేనికైనా రక్తంలోంచి రావాలమ్మా మర్యాదలూ" అని ఈసడించింది అక్కడేఉన్న పెద్దాడబిడ్డ. బిక్కమొగంతో నిల్చున్న కోడల్ని చూసేసరికి రామమ్మగారికి కడుపుతరుక్కుపోయింది. కాని, గొప్పవంశంలో పుట్టాననే అహంకారంగల కూతుర్ని ఏమనటానికీ ఆవిడకు అధికారంలేదు. మరి ఆవిడా పరాయి దేనాయె. రామమ్మగారు లోపల లోపల ఆ ఆడంబరాన్ని శపిస్తే, రాజ్యలక్ష్మి తన్నపిల్లల్ని అలా చేయకూడదని శపథం

పట్టింది. ఈ ఇంట్లోకి వచ్చినందుకు సంతోషంగా ఉన్నట్లు నటిస్తూ, అంతర్గతంగా ఆ వంశాన్ని ద్వేషిస్తున్న ఆ అత్తా కోడళ్ళిద్దరూ నిశ్శబ్దంగా అక్కడనించి వెళ్ళిపోయినారు.

తనపిల్లల్ని మామూలుమనుష్యులుగా తయారుచేయాలనీ ఈ వంశగౌరవంతాలూకు గర్వంమధ్య వాళ్ళు హృదయంలేనివాళ్ళుగా తయారుకాకూడదనీ రాజ్యలక్ష్మి నిశ్శబ్దంగా చేసిన ప్రతిన ఆ అంతర్యామికితప్ప ఇంకెవరికీ తెలియదు. దానికితగ్గట్టే పూర్ణ ప్రవర్తిస్తున్నది. మేనత్తలెవరూ ఆ పిల్లని దగ్గరకి తీయరు. దానికేమన్నా కావాల్సి వస్తే పినతండ్రి నరహరిరావుని అడిగేది.

వీళ్ళంతా కాకుండా ఆ కుటుంబంలో కృష్ణయ్యగారి విధవఅప్పగారు వైదేహమ్మగారు ఉండేది. పెళ్ళయిన ఆరు నెల్లకే తిరిగి పుట్టింటికివచ్చిన ఈవిడని చూస్తే, తమ్ముడి భార్య రామమ్మగారికీ, మేనల్లుడిభార్య రాజ్యలక్ష్మికీకూడా సింహస్వప్నం. పూర్ణకి ఆవిడనిచూస్తే ప్రైప్రాణం పైనే పోయేది.

ఇలాటి కత్తులబోనుమధ్య కాపురంచేస్తూ ఇనపపెట్టె తాళంచెవులబాధ్యతకూడా పైనవేసుకుంది రాజ్యలక్ష్మి. ఆడబిడ్డలూ, వైదేహమ్మగారూ ఏమన్నా అన్నప్పుడు మాత్రం ఈ దిక్కుమాలినగర్వాన్ని తనపిల్లలన్నా పాడుచేస్తే బాగుండుననుకునేది. ఏదిఏమయినా రాజ్యలక్ష్మిఅంటే పాలేళ్ళకీ, పనివాళ్ళకీ చెప్పరాని ప్రేమ. మామగారికి అభిమానం. భర్తకి అనురాగం. కాని వీరందరిమధ్యా ఒకళ్ళనొకళ్ళు

అర్థంచేసుకున్నవాళ్ళు అత్తా కోడళ్ళే. ఆడబిడ్డ వైదేహమ్మ గారిచేత ఇప్పటికీ పోరుపడుతూనేఉంది రామమ్మగారు.

పరిస్థితులిలాఉండగా రాజ్యలక్ష్మి ప్రసాదరావుల కడుపున ఇదివరకు ఈ వంశంలో ఎవరూ పుట్టనంతఅందంతో ఆరునెలలపిల్లవాడికుండే బలంతో కొడుకు పుట్టాడు. వాడిని చూడగానే, రాజ్యలక్ష్మిమనసులో ఏవో చిత్రమయిన ఊహాలువచ్చినయ్. అపండితురాలైన ఆమె తనకోరిక ఏదో ఫలించినప్పటి తృప్తిని పొందగలిగింది. తనకొడుకుని యథార్థ మానవుడిగా చేయాలని అనుకుంది. అది అసురసంధ్య. అదే అసురసంధ్యలో ప్రసాదరావు పాలేరూ తన ప్రాణస్నేహితుడూ అయిన వెంకడితో 'అబ్బాయిని వంశగౌరవంనిలబెట్టే వాడినిగా చేస్తానురా' అన్నాడు.

తల్లితండ్రులు ఏకకాలంలో పట్టిన ఈ పరస్పరవిరుద్ధమైన ప్రతిజ్ఞలమధ్య తనభవిష్యత్ ఏమవుతుందో తెలియని ఆ పాపాయి నిశ్చింతగా నిద్రపోతున్నాడు.

అవిరామంగా ప్రవహించిపోతున్న ఈ జీవనస్రవంతిలో తను ఏమయేదీ, ఆ చిన్న నీటిబిందువుకి అప్పట్లో తెలియదు. పదకొండవరోజున బారసాలచేసి, రాజా రామశర్మ అని పేరుపెట్టారు. రాజారాముడికి ఉగ్గుపొయ్యాలంటే రామమ్మగారు కాళ్ళూ, రాజ్యలక్ష్మి చేతులూ పట్టుకుంటే వైదేహమ్మగారు చావగొట్టి తాగించేది. అయినా వాడు కాళ్ళూ చేతులూ గిలగిలాకొట్టుకుంటే ముగ్గురాడవాళ్ళూ మూడుమూలలకి పోయేవాళ్ళు. వైదేహమ్మగారికి వాడి

అందాన్నీ బలాన్నీ చూస్తే వివగింపుకలిగేది. "రాజ్యలక్ష్మి! రాక్షసివెధవను కన్నావే" అని వాణ్ణి ఒకటివేసేది ఆవిడ.

రామమ్మగారికీ రాజ్యలక్ష్మికీకూడా ఆవిడమాటలకి మనసు చివుక్కుమనేది. కాని, నోరెత్తే ఆస్కారం లేదామె ఎవరికీ తెలియకుండా ఇంత ఉప్పుతీసిపోసేవాళ్ళు.

జీవితాన్ని కాలమే జయిస్తుం దెప్పుడూను కాని అప్పుడప్పుడు తననిజయించే జీవితం ఏ మనిషికయినా లభిం చిందన్నప్పుడు ఆ జీవితంతో కొన్నాళ్ళు చెలగాటమాడి చివ రకి ఓడించటమనేది కాలస్వభావం.

ఇప్పుడా కాలంలో అయిదుసంవత్సరాలు గతించిసై. రాజా అయిదేండ్లవాడయినాడు. రాజ్యలక్ష్మికి మళ్ళీ కాన్పు రాకపోవటంవలన ఈ అయిదేళ్ళనుంచీ తల్లిపాలు సమృద్ధిగా త్రాగటంమూలంగా వా డతిబలంగా ఉన్నాడు. చేసే అల్ల రికి మితంకూడా లేదు.

తల్లిపాలతోపాటు అంతర్గతమైన ఆ మెడొూహలుకూడా తాగటంవల్లనో ఏమో, అయిదేళ్ళ రాజాకి అమితమైన తెలివితేటలతోపాటు తిరుగుబాటుతనంకూడా వచ్చింది. ఎక్కువగా అల్లరిచేసినప్పుడు తండ్రి కొప్పడటంచేత తండ్రి అంటే అపరిమితమైన భయం ఏర్పడింది వాడికి.

వాడి చిన్నగుండెలో తల్లిఅంటే అభిమానంతోపాటు, తండ్రిఅంటే అసహ్యంకూడా ఏర్పడిందని రాజ్యలక్ష్మి గ్రహించేకనుక ఉంటే, తనుచేసిన పొరపాటుకి ఎంతగానో పశ్చాత్తాపపడేది. కాని వా డెన్నడూ ఆ అసహ్యాన్ని స్పష్టంగా వెలిబుచ్చలేదు. రాజాఇష్టాఇష్టాలు చాలా గాఢ

మైనవి. నాయనమ్మ రామమ్మగారంటే యెంత అభిమానమో వైదేహమ్మగారంటే అంత అసహ్యం.

ఆవిడంటే పూర్ణ భయపడుతుందిగాని, రాజాకి ఏమాత్రం భయంలేదు. ఆవిడ వాడిని అసహ్యించుకోటానికి ఇదో కారణం. ఏదిఏమయినా వైదేహమ్మగారి రోగంకుదర్చటానికి భగవంతుడు వీడినంటూ ఒకడిని సృష్టించినందుకు రామమ్మగారు ఆ భగవంతుడిని అభినందించనిక్షణం అంటూ లేదు. ప్రతీకారంచేయటంలో వాడిఊహలు అత్యద్భుతం. వైదేహమ్మగారికి ఆచారం ఎక్కువ. తనకోసం ఆవిడ ప్రత్యేకం ఊరగాయపెట్టుకు దాచుకునేది.

ఎప్పుడో కాని, మూత తీయకపోవటంవలన ఆ ఊరగాయ ఘుమఘుమలాడుతూ ఉండేది. ఒక దురదృష్టక్షణాన ఆ ఊరగాయలతాలూకు సువాసనావీచికలు రాజానాసాపుటాలకి సోకినయ్. తనకికూడా అది వేయమని, నాయనమ్మని అడిగాడు. ఆవిడ నోరునొక్కుకుని "అమ్మమ్మ చంపేస్తుందిరా నాయనా! ఇంకెప్పుడూ అలా అడక్కు" అన్నది.

తనుచేసిన భయంకరమైనతప్పు ఏమిటో! అమ్మమ్మ తనని ఎందుకు చంపేస్తుందో వాడికి అర్థంకాలేదు. "ఎందుకని" అని నాయనమ్మని ప్రశ్నించాడు. అత్తగారికీ కొడుక్కీ వైదేహమ్మగారి ఊరగాయలమీద ఇంతవరకూ జరుగుతున్న చర్చంతా కూరతరుగుతున్న రాజ్యలక్ష్మి వింటూనేఉన్నది. కొడుకుఅడిగిన "ఎందుకని?" అన్నప్రశ్నకి అత్తగారు చిక్కులో పడటం చూసి ఇక తను కల్పించుకోపోతే లాభంలేదనుకుని "మైలపడిపోతాయి నాన్నా. అందుకు" అన్నది. ఆ సమా

ధానం వాడికి సరిగా అర్థంకాలేదు. అయినా తనతల్లి చెప్పింది కనుక, మాట్లాడకుండా వెళ్ళిపోయినాడు. అత్తా కోడళ్ళిద్దరూ ఒక నిట్టూర్పువిడిచి, ఎవరిపనుల్లో వాళ్ళుపడ్డారు.

ఆ మర్నాడుఉదయం కొంపమునిగిపోయినట్లు పరుగెత్తుకుంటూ వచ్చి "మైలపడటంఅంటే ఏమిటి? నాయనమ్మా" అని రాజా ప్రశ్నించేసరికి, తనని రక్షించటానికి ఆ చుట్టుపట్ల రాజ్యలక్ష్మి ఉందేమోనని ఇటూ అటూ చూసింది రామమ్మ గారు. ఆ చుట్టుపట్ల ఎవరూ లేకపోయేసరికి ఇక తప్పదన్నట్లు మనుమడిదాడికి తలఒగ్గిందామె. వాడు ఊరుకోలేదు.

"నిన్నే నాయనమ్మా! మైలపడటంఅంటే ఏమిటి?" అన్నాడు. వాడివాలకం చూసేసరికి ఆవిడకి ముద్దువచ్చి "ముందొక ముద్దుపెట్టరా నాన్నా" అన్నది.

"ముద్దుమాట తరువాత చూద్దాంలే. ముందు నాకు చెప్పు, మైలంటే ఏమిటి?"

"మడిలేకుండాఉండటాన్నే మైల అంటారు"

"మడి అంటే?"

రామమ్మగారికి దిక్కుతోచలేదు. కాసేపు నీళ్లునమిలి,

"అమ్మమ్మ ఊరగాయజాడీలురా" అని అర్థంలేని జవాబుఇచ్చింది.

"అలాఅయితే అవి మైలపడతాయందే నిన్న అమ్మ. ఎలా మైలపడతాయి!"

"గుడ్డపీలికలూ అవీ తగిలితే మైలపడతాయిలేరా! నీకెందు కివన్నీ. అదుగో తాతయ్య ఒస్తున్నారు" అని మను

మడి ప్రశ్నపరంపరలనించి తనని రక్షించటానికి వస్తున్న శ్రీమన్నారాయణమూర్తిలాగా చూసింది భర్తని.

"ఏం పిల్లా! ఏమిటి మనవడితో చర్చిస్తున్నావు?" అన్నాడు కృష్ణయ్యగారు విలాసంగా చూస్తూ. తాతయ్య వచ్చేశాక తనఉనికిని నాయనమ్మ గుర్తించదని వాడికి అనుభవమేగనుక, అక్కడినుంచి పరుగందుకొని ఉత్తరపువేపు వసారాలో తేలాడు. వాడిమనసులో మైలపడితే ఊరగాయ చేదుగా అవుతుందేమో చూడాలనేఊహ మెదిలింది.

అంతేకాదు, నిన్న వెంకడికొడుకుతో ఆడుకుందామని పోతుంటే "మైలబడతావేమిట్రా గాడిదా" అన్నది వైదేహమ్మగారు. అసలీ మైలఅంటే ఏమిటి? తనుతాకితే ఊరగాయలు ఎలా మైలబడతాయో! వాడుతాకితే తను అలా మైలబడతాడు కాబోలు! మరి తనుకూడా చేదుఅవుతాడా? ముందు ఊరగాయలు చేదెక్కుతాయేమో పరీక్షించాలనిపించింది వాడికి. పాలదాలిలో పడుకుని సుఖంగా నిద్రపోతున్న పిల్లి పిల్లని నిద్రలేపాడు. అది వాడిమాటల్ని అర్థంచేసుకుంటుంది. దానితో ఏదో చెప్పాడు. అర్థంఅయినట్లుగా అది మ్యావ్ మంది. ఒక గుడ్డపీలిక తెచ్చి దానిమెడలో కట్టి వదిలాడు. ఎక్కడయితేనేంలే అని వైదేహమ్మగారి ఊరగాయలజాడీ మీదికి ఎక్కి హాయిగా విశ్రమించింది ఆ పిల్లిపిల్ల.

కొన్నినిమిషాలతర్వాత వైదేహమ్మగారి గంభీరకంఠం షడ్జమంలో ధ్వనించటం ప్రారంభమయ్యేసరికి ఇంటిల్లిపాదీ హడిలిపోయినారు. ఈ అకాల భూకంపానికి కారణం ఒక

చిన్న పిల్లిపిల్లా, దానితాలూకు యజమానీ అనేవిషయం అందరికీ అర్థంకావటానికి అరగంటపైన పట్టింది.

అత్తాకోడళ్ళిద్దరూ కొంగులు నోట్లోదోపుకుని అక్కడి నుంచి వెళ్ళిపోయినారు, ఆ పిల్లిపిల్లనీ దానియజమానినీ అభినందించుకుంటూ. కిష్టయ్యగారూ ప్రసాదరావూకూడా నవ్వుకుని కచేరీసావిట్లోకి పోయినారు. వైదేహమ్మగారు తన భరతనాట్యంలాటిది ఎన్నడూచూడని ఆ పిల్లిపిల్లభయంతో బిక్కచచ్చిపోయి ఊరగాయలజాడీలకీ గోడకీ మధ్య దూరి ప్రాణరక్షణ చేసుకుంది.

మరునాడు అదే ఊరగాయ చద్దెన్నంలో వేసుకుని తింటున్న రాజాకి దానిరుచి ఏమీ మారినట్లు కనిపించలేదు. వాడి చిన్నమనసులో మొదటిసారిగా మడి మైలలన్నా పెద్దవాళ్ళమాటలన్నా నమ్మకంపోయింది. సాయంత్రం బాబాయి ఇంకా సొంతం ఇంట్లోకిరాకమునుపే మడికీ మైలకీ ఏమీ భేదం లేదనే అపూర్వవిషయాన్ని అభినయపూర్వకంగా వర్ణించి చెపుతున్న కొడుకునిచూసి తృప్తిగా నవ్వుకుంది రాజ్యలక్ష్మి.

"ఏమమ్మా వదినా, వీడికి అక్షరాలు దిద్దబెడుతున్నావా?" అని ఒదినగార్ని ప్రశ్నించాడు నరహరిరావు.

"వాడినే అడుగు" అన్నది ఆమె.

"ఏరా, అక్షరాలు యెంతమటుకు ఒచ్చాయి!" అన్న పినతండ్రిమాటలకు "అన్నీ ఒచ్చేశాయి బాబాయ్" అన్న వాడి సమాధానానికి రాజ్యలక్ష్మి నరహరిరావుకూడా ఉలిక్కిపడ్డారు. వాడికి అక్షరాభ్యాసంచేసి వారంకాలేదు. ఈ వారం

నుంచీ అక్షరాలు దిద్దినట్లుకూడా ఎక్కడా కనిపించలేదు.
"అయితే, ఏవీ వ్రాసి చూపించు" అన్నాడు నరహరిరావు.

వాడు పరుగెత్తుకెళ్ళి పలకతీసుకొచ్చి అక్షరాలన్నీ వ్రాశాడు. అవిచూసి నరహరిరావు చాలా ఆశ్చర్యంతో "ఏరా, నీకివన్నీ ఎవరు వ్రాసిచ్చారు?" అని ప్రశ్నించాడు.

"నాయనమ్మ" అని గర్వంగా జవాబుచెప్పాడు వాడు. రాజ్యలక్ష్మికి వాడి తెలివి తేటలు చూసి భయంవేస్తే, నరహరి రావుకి ఆనందంకలిగింది.

"సరే, ఇక నువ్వుపోయి ఆడుకోరా బాబూ" అని కొడుకుని పంపివేసింది రాజ్యలక్ష్మి. ఒదిన తనతో ఏదో మాట్లాడాలనుకుంటోందన్నసంగతి అప్పటికే గ్రహించిన నరహరి ప్రశ్నార్థకంగా ఒదినగారివంక చూశాడు.

"నరహరీ !"

"ఏం ఒదినా?"

రాజ్యలక్ష్మి కొంచెంసేపు మాట్లాడలేదు. తరువాత

"ఈఇంటికి నేను కాపురానికివచ్చి తొమ్మిదివళ్లయింది. పదమూడువళ్లవయసులో మీఇంటికి వచ్చాను. మనిద్దరం ఒకే వయసువాళ్ళం. కాని నాకంటికి నువ్వు పసివాడుగానే కనిపిస్తావు. ఈఇంట్లో నన్ను అర్థంచేసుకున్నవాళ్లిద్దరిలో నువ్వొకడివి".

"వదినా ..."

"ఉండు, నామాట కడ్డంరాకు. నేను చదువుకోలేదు. నువ్వు బాగా చదువుకున్నవాడివి. అయినా నువ్వు నన్ను

ఎప్పుడూ గౌరవిస్తూనేఉన్నావు. ఇప్పుడు నినొ్నకటి యాచి స్తున్నాను''

''యాచిస్తున్నావా ఒదినా!''

''అవును''

''ఆజ్ఞాపించు ఒదినా''

''ఆమాత్రం గౌరవంఉన్నందుకు చాలా సంతోషిస్తు న్నాను నరహరీ. నీకూ తెలుసనుకుంటాను పూర్ణకి పెళ్ళి చేయబోతున్నారని''

అవునన్నట్లుగా తలఊపాడు నరహరిరావు.

''మీ పెద్దక్కగారికొడుక్కిచ్చి పెళ్ళిచేయబోతున్నా రనేదికూడా నీకు తెలుసు. ఈ ఇంట్లో నన్నందరికంటె ఎక్కు వగా ఎవరైతే అవమానించారో వాళ్ళకే నా పిల్లనివ్వటం నేను సహించలేను''

''నువ్వీవిషయంలో తొందరపడుతున్నావేమో?''

''లేదు నరహరీ! మనస్ఫూర్తిగానే చెబుతున్నాను. నా కేమాత్రం ఇష్టంలేదు''

''సరే ఒదినా! అన్నయ్యతోనూ నాన్నగారితోనూ మాట్లాడతాను'' అని నరహరి లోపలికి వెళ్లాడు. రాజ్యలక్ష్మి కూడా తనపనిమీద తనెళ్ళింది

ఆరోజుసాయంత్రం ప్రసాదరావు కచ్చేరీసావిట్లో కూర్చుని జమాబందీ దగ్గరకురావటంచేత హడావిడిగా లెక్కలు సరిచూస్తున్నాడు. ఎదురుగుండా ఎవరో నిలబడినట్లు అనిపించి తలెత్తిచూస్తే నరహరిరావు. తనంటే భయపడే తమ్ముడు ఎదురుగుండా వచ్చి నిలబడటం చూసి కొద్దిగా

ఆశ్చర్యపోయినాడు ప్రసాదరావు. కాలిగోటనవేలు నేలకి రాస్తూ, భయంభయంగా "నీతో ఒకమాట చెప్పాలి అన్నయ్యా" అన్నాడు నరహరి.

"ఏమిట్మాట? డబ్బుకావాలా?" అని అడిగిన అన్నగారి ప్రశ్నకి అక్కరలేదన్నట్లు తలవూపాడు నరహరి.

"మరేమిటి? భయంలేదులే చెప్పు" అన్నాడు ప్రసాదరావు. తమ్ముడిధోరణి అతనికి చాలా చిత్రంగావుంది.

"పూర్ణని అక్కయ్యకొడుక్కి ఇవ్వటం నాకిష్టంలేదు" అన్నాడు నరహరి.

ఆశ్చర్యంతో నోటమాటరాలేదు ప్రసాదరావుకి. కొంచెంసేపయినాక "ఏం, ఎందుచేత?" అని ఎలాగో ప్రశ్నించాడు.

"అక్కయ్యచేత ఎవరు బాధలుపడ్డారో వారికి ఇది ఇష్టంలేదు"

"అంటే ఒదినగారిరాయబారిగా దయచేశారన్నమాట తమరు!"

"నువ్వు అలాఅంటే నే నేం చెప్పలేను. ఇది నాక్కూడా ఇష్టంలేదు. నిజంచెప్పాలంటే, పైకి చెప్పకపోయినా, అమ్మకీ ఇష్టంఉండదు. ఏటొచ్చీ నాన్నకీ నీకూ మాత్రం ఇది ఇష్టం"

"అయితే, ఇప్పుడు న న్నేంచేయమంటావు?"

"నువ్వు రేపు గుడివాడ వెళ్ళొద్దు. ఈపటికి పూర్ణ పెళ్లి చెయ్యక్కరలేదు. దానికిప్పుడు ఏడేళ్ళునిండినయ్ అంతేగా

"నువ్వు ఈవిషయంలో తొందరపడుతున్నావు తమ్ముడూ. పెద్దవాడు నాన్న ఇష్టంకాదని ఎలా పోగలం చెప్పు"

"నే నీవిషయంలో నాన్నతోకూడా మాట్లాడతాను"

"సరే" అని తలవంచుకుని వ్రాసుకోవటం ప్రారంభించాడు ప్రసాదరావు. అక్కడినించి బయలుదేరిన నరహరి సరాసరి తండ్రిగదిలోకి వెళ్ళి తల్లికూడా అక్కడే ఉండటం చూసి వెనక్కి వచ్చేశాడు.

విశాలమైన ఆ మండువాఇంట్లో దక్షిణపువేపునున్న పెద్దగది కిృష్ణయ్యగారిది. అందులో పెద్ద పూర్వకాలపు పందిరి మంచంమీద పడుకుని తాంబూలం వేసుకుంటున్నారు ఆయన. ఆకులుచీల్చి చిలకలుచుట్టి ఇస్తోంది రామమ్మగారు.

ఏభయిసంవత్సరాలునిండినా, ఆవిడలో యవ్వన ఛాయలు ఇంకా తరగలేదు. తమలపాకులుచుట్టిఇస్తున్న ఇల్లాలి చేతిని స్పృశించి, శృంగారంగా నవ్వారు కిృష్ణయ్యగారు.

ఆవిడ సిగ్గుపడింది. తిరిగి ఆమెరక్తనాళాల్లో మరొకసారి యవ్వనరక్తం తీవ్రంగా ప్రవహించింది. రామమ్మగారు బాగా చదువుకుంది. శృంగారప్రబంధాలూ రామాయణ భారతాలూకూడా ఆమెకు కంఠస్తం. కిృష్ణయ్యగారంటే ఆవిడకి ప్రాణం. మహారసికుడైన ఆ వ్యక్తితో ముప్పయిఅయిదు సంవత్సరాల్నించి కాపురంచేస్తున్నా ఎప్పటికప్పుడు ఆయన స్పర్శ నిత్యనూతనంగానే ఉంటుంది. ఆయనవలన తను ఏనాడూ కష్టపడలేదు. ఈనాటికీ ఆయన "పిల్లా" అని పిలిచే తీరులో మార్పులేదు.

"మనమరాలిపెళ్ళికి ఏం ఏర్పాట్లుచేస్తున్నావు పిల్లా?" అని అడిగా డాయన. రామమ్మగారు మాట్లాడలేదు. "పెళ్లి నీకే అయినట్లు సిగ్గుపడుతున్నావేమిటి?" అన్నారు మళ్ళీ.

"ఈ పెళ్ళి కోడలికి అంతగా ఇష్టంలేనట్లుంది"

"అదేమిటి?"

"ఆవిషయం నన్నడిగితే నాకేం తెలుస్తుంది?"

"సరేలే. ఆవిషయం తరువాత ఆలోచిద్దాం. ఆ మను చరిత్ర ఇలా అందుకో" అన్నా రాయన. పక్క-నే అల్మారాలో ఉన్న ఆ పుస్తకాన్ని భర్తకి ఇచ్చింది రామమ్మగారు. ఆయన నాలుగుపేజీలూ చదివారోలేదో వాకిట్లో మేనా ఆగింది. ఆ వచ్చింది సభారంజని.

సభారంజని వెలయాలు. ఆమెది గుడివాడ ఆరోజుల్లో గొప్పతనం వేశ్యనిఉంచుకోటం. సరిఅయిన సానిఅయితే సంసారికున్నంతగౌరవమూ ఉండేది. సభారంజని సరిఅయిన సాని. ఆమెకు కన్నెరికంపెట్టింది క్రిష్ణయ్యగారు. ఆరోజునుంచీ ఈరోజుదాకా ఆమె ఆయననీ ఆయన ఆమెనీ ప్రేమిస్తూనే ఉన్నారు. ఈవిషయం ఆ పరగణాఅంతా తెలుసు. ఈవిషయం క్రిష్ణయ్యగారిగౌరవాన్ని ఏవిధంగానూ తగ్గించలేదు సరికదా కాస్తోకూస్తో అధికంచేసిందనే చెప్పాలి. ఆయనలో ఎంత ఔన్నత్యంలేకపోతే, ఒకవేశ్య ముప్ఫయిఏళ్ళనుంచీ భార్యకంటే అధికంగా ఉంటుంది! అని లోకాభిప్రాయం.

రామమ్మగారికి ఈవిషయం తెలుసు. ఏవిధమైన అసూయా వారిద్దరికీ లేదు. ఇద్దరిదీ ఒకేవయసు. సభారంజని రసికత రామమ్మగారికి తెలుసు, రామమ్మగారి అనురాగం

సభారంజనికి తెలుసు. వారిద్దరితో తను జరిపే శృంగారక్రీడలు ఆయన దాచలేదు. మహానందస్థితిలో ఉన్నప్పుడు తనతో ఉన్నది సభారంజని అయితే, రామి ఇలాటప్పుడు ఇంకా సిగ్గు పడుతుంది అనో, రామమ్మగారుతనతో ఉంటే, సభ ఇలా ప్రవర్తిస్తుంది అనో, ఆయన అని తీరతారు. వారికి అరమరికలు లేవు. ఆయనంటే వారిద్దరికీ ప్రాణం.

సభారంజని నాట్యంలో అందెవేసినచెయ్యి. అది ఆమె నడకలోకూడా స్పష్టంగా కనిపిస్తుంది. సరాసరి గదిలో ప్రవేశించిన సభారంజని వారిద్దరికీ నమస్కారంపెట్టింది. అక్కడ కూర్చోటానికి ఆ మంచంతప్ప మరేంలేదు. క్రిష్ణయ్యగారు పక్కకిజరిగి చెయ్యిపట్టుకు కూర్చోపెట్టారు. ఆమెశరీరంమీది నించి కస్తూరివాసనలు గుబాళిస్తున్నయ్.

"అక్కయ్యగారికి నమస్కారం" అన్నది సభారంజని రామమ్మగారివంక చూస్తూ. ఆవిడ చిరునవ్వునవ్వి "వారం రోజులయింది గుడివాడవెళ్ళి. సభ ఇవ్వాళో రేపో వస్తుందని నే నంటూనేఉన్నాను" అన్నది.

"అదే వస్తుందిలే అనే ధైర్యంతో నేనూ ఊరుకున్నాను" అన్నారు క్రిష్ణయ్యగారు నవ్వుతూ. సభారంజని మూతి అదోమాదిరిగాపెట్టి కోపంఅభినయిస్తూ, "అవును, రాకేంచేస్తాను. ఆడదాన్నిగా మరి" అన్నది.

"అలా కోప్పడితే ఎలాగే? చూడు, ముసలాణ్ణి అయిపోయినాను. ఒంట్లో ఓపికపోతోందా మరి" అన్నారు క్రిష్ణయ్యగారు.

"మీ రలా మాట్లాడితే నేనొప్పుకోను"

"నువ్వు ఒప్పుకోవనే నా భయం." అని కొంటెగా నవ్వా రాయన. అందులోఅర్థం గ్రహించిన ఆ స్త్రీలిద్దరూ పక్కున నవ్వారు.

"నే కొంచెం పాలు తీసుకొస్తాను సభారంజనీ" అని లోపలికి వెళ్ళింది రామమ్మగారు. ఆవిడ గడపదాటంగానే సభారంజనిని తనగుండెలమీదికి లాక్కుని, గాఢంగా కౌగ లించుకున్నా రాయన. వృద్ధులైన ఆ స్త్రీపురుషులిద్దరూ క్షణం సేపు తమవయస్సు మర్చిపోయారు. రామమ్మగారి అడుగుల చప్పుడు విని ఇద్దరూ మామూలుగా కూర్చున్నారు.

కాని, వారిద్దరూ కొన్నిక్షణాలముందు ఏ స్థితిలో ఉన్నారో, గ్రహించలేనంత అజ్ఞానురాలుకా దామె. పాలు సభారంజనికి ఇచ్చి, నిశ్శబ్దంగా తలుపులుచేరవేసి వెళ్ళి పోయిం దావిడ. సభారంజని వచ్చిందంటే ముసిలాయనగది ప్రాంతాలకి ఎవరూ వెళ్ళరు. ఆ ఇంట్లో అందరికీ ఇది అల వాటే కాని, ఇప్పుడుమాత్రం దానికి విరుద్ధంగా జరిగింది. తలుపులు తెరుచుకుని పూర్ణ ఆ గదిలో ప్రవేశించింది. సభా రంజని ఆ పిల్లనిచూసి సిగ్గుపడి దూరంగా కూర్చుంది. అంద మైన తనకళ్ళని మరింత పెద్దవిగాచేసి, వారిద్దర్నీచూస్తున్న ఆ పిల్లనిచూసి సభారంజని చాలా ఆశ్చర్యపోయింది. కొంచెం సేపు ఎవరూ మాట్లాడలేదు. పూర్ణ అకస్మాత్తుగా అక్కడి నించి పారిపోయింది.

సభారంజని కొంచెంసేపయినాక బయటికివస్తూ, తలుపు చాటునఉన్న రాజ్యలక్ష్మిని చూసి ఆశ్చర్యపోయింది. ఆమె తనకోసమే అక్కడ నిలబడ్డదని గ్రహించింది.

"ఏమిటి? కోడలమ్మగారూ, ఇక్కడ నిలబడ్డారు?" అని అడిగింది.

రాజ్యలక్ష్మి మెల్లిగా "మరేంలేదు సభారంజనమ్మా. పూర్ణకి పెళ్ళిజరగబోతోంది. అదిజరగటం నా కిష్టంలేదు. మామగారు నువ్వుచెపితే వింటారు. కొంచం చెప్పాలి అంతే. నే నిలా అడిగినట్లుమాత్రం చెప్పకు" అనేసి అక్కడినించి వెళ్ళిపోయింది.

సభారంజని కొన్నిక్షణాలు నిర్ఘాంతపోయింది. వెంటనే తేప్పరిల్లుకొని గబగబా వెళ్ళి మేనాఎక్కింది. రాజ్యలక్ష్మి ఇదివరకు ఎప్పుడూ తనతో మాట్లాడలేదు. త నెప్పుడు ఆ ఇంటికి వెళ్ళినా, రామమ్మగారితోతప్ప మరెవరితోనూ ఆట్టే మాట్లాడదు. అన్నిటికన్న చిత్రం ఏమిటంటే, మామగారు తనుచెప్పినట్లు వింటారట. ఈ ఆలోచనకి గర్వంతోపాటు నవ్వుకూడావచ్చింది సభారంజనికి. తనయవ్వనం అయిపోయింది. ఆయనకూడా వృద్ధుడైపోయినాడు. అయినా, తనకి కన్నెరికం పెట్టిననాడు, ఆయనస్పర్శ తన కెలా అనిపించిందో, ఇప్పుడూ అలాగే అనిపిస్తోంది. ఆయనవల్ల తను కొడుకుతల్లి అయింది. వా డిప్పుడు తండ్రిప్రోత్సాహంవలన డాక్టరీ చదువుతున్నాడు. తను వేశ్య. అయితేనేం, కులస్త్రీలకి తను ఏమాత్రమూ తీసిపోలేదు. ఆ గౌరవాన్నికూడా పొందుతోంది. ఆయనకోడలు తనని సభారంజనమ్మా అని మర్యాదగా పిలిచింది. తృప్తితోనూ గర్వంతోనూ సభారంజని హృదయం నిండిపోయింది. మనసులోనే తన ఇష్టదైవం మువ్వగోపాలునికి నమస్కరించింది ఆమె.

౨

రాజ్యలక్ష్మి చేసిన ఈ ప్రయత్నంవలన పూర్ణకి మేనత్త కొడుకునిచేసుకోవటం తప్పింది కాని, అసలు పెళ్ళితప్పలేదు. నైజాంలో ఒక నియోగి జమీందారు ఏకపుత్రుడి కిచ్చి ఘనంగా పెళ్లిచేశారు క్రిష్ణయ్యగారు. మనుమరాలిపెళ్లి కళ్ళారాచూసి తన జన్మ చరితార్థమయినట్లుగా భావించా డాయన. పూర్ణ అందానికి తగిన పెళ్ళికొడుకే దొరికాడని అంతా అనుకున్నారు. రాజాకి చదువు చాలా చక్కగా వస్తోంది. వా డిప్పుడు అల్లరి ఆట్లే చేయటంలేదు. తన చదువూ తనఆటలూ తప్ప మరేంపట్టించుకోవడంలేదు. వైదేహమ్మగారి ఆవకాయ లిప్పుడు సురక్షితంగానే ఉంటున్నాయి. కాలం అయిదుఅడుగులు ముందుకుసాగింది. రాజాకి పదేళ్లు, పూర్ణకి పదమూడేళ్లు. ఆమెలో యవ్వనంతాలూకు రక్త చ్ఛాయలు అప్పుడే ప్రసరిస్తున్నాయి. ఆమెఅందాన్ని చూసి క్రిష్ణయ్యగారికి ఇప్పటికీ భయమేస్తూనేఉంది గచ్చకాయ లాడుతున్న మనమరాల్ని పరీక్ష చేస్తూ జపంచేసుకుంటున్నారు క్రిష్ణయ్యగారు. పూర్ణ తదేకదృష్టితో ఎదురుగోడవంక చూడటం చూసి, ఆయనకూడా అటే చూశారు. పూర్ణ గబ గబా లేచివెళ్ళి చీపురుతీసుకువచ్చి గోడమీద మసగలాడు తున్న బల్లుల్ని కొట్టింది. అందులో మగబల్లి వెంటనే ప్రాణం వదిలింది. ఇదిచూసి క్రిష్ణయ్యగారు 'శివశివా' అనుకున్నారు.

ఈ సంఘటన జరిగిన ఆరునెలలకే పూర్ణ భర్త క్షయ వల్ల చనిపోయినాడు. అతన్ని బ్రతికించాలని బంధువులుచేసిన ప్రయత్నాలన్నీ వ్యర్థంఅయినయ్యి. దివ్యమంగళ విగ్ర

హంతో వెలిగిపోవలసిన పూర్ణ రెవికలేకుండా గాజులూ, కుంకుమా పోగొట్టుకుని, అమంగళాకారంతో భర్తపోయిన పదమూడవరోజున శాశ్వతంగా పుట్టినింటికి చేరింది. "ఇదంతా నేను చేసిందే అత్తయ్యా, ఇదంతా నా పాపమే" అని ఘోరంగా విలపించింది రాజ్యలక్ష్మి. తనభర్త చనిపోయి నాడని తెలుసు గాని, కలగవలసినంత దుఃఖం కలగలేదు పూర్ణకి.

అది పందొమ్మిదివందల పదోసంవత్సరం. అప్పటికి తెలుగునాట బాలవితంతువులఅవస్థ చాలా దుర్భరంగా ఉన్నది. వైదేహమ్మగారు పూర్ణకి జుట్టుతీయించాలని పట్టు పట్టింది. ఇది విని రాజ్యలక్ష్మి విరుచుకుపడిపోయింది. రామమ్మ గారు ఖంగారుపడుతూ ఏడవటం మొదలుపెట్టింది. ఆ సమ యంలో రాజా వస్తాడు వచ్చాడో ఎవరూ చూడలేదు. విషయం అర్థంచేసుకొని, నిశ్శబ్దంగా వైదేహమ్మగారి మెడ పట్టుకుని అక్కయ్యకి జుట్టుతీయించమంటావా? అంటూ విప రీతమైనకోపంతో చావకొట్టటం ప్రారంభించాడు. వాడిని ఇవతలకులాగటం ఎవరికీ సాధ్యంకాలేదు. ప్రసాదరావుకూడా కొడుకుపని చూస్తూ ఊరుకున్నాడు. ఆయనకీ జుట్టుతీయటం ఇష్టంలేదు. వైదేహమ్మగారుకూడా రాజాచేతిలో చావు దెబ్బలుతినటం ఇష్టంలేక, నోరుమూసుకొని ఊరుకుంది. అదృష్టాలన్నీ నశించిన పూర్ణకి ఆవిధంగా జుట్టుమాత్రం మిగిలింది.

అల్లుడు చనిపోయినరోజునుంచీ రాజ్యలక్ష్మిముఖంలో నవ్వు అదృశ్యమైపోయింది. పదిమూడు సంవత్సరాలునిండని

పూర్ణకి ఒంటిపూట అన్నం పెడుతుంటే బాధతో ఆ మాతృహృదయం మెలిదిరిగిపోయేది. రోజురోజుకీ పూర్ణ వయసు వికసిస్తుంటే, రాజ్యలక్ష్మి దుఃఖంతో ముడుచుకుపోయేది. కాని ఏం చేస్తుంది? ఆమె హృదయంలో పూర్ణ అదృష్టాన్ని చెరిపివేసింది తనే అనే అభిప్రాయం గాఢంగా పాతుకుపోయింది. అక్కయ్యకి కడుపునిండా అన్నం పెట్టటం ఎందువల్ల తప్పో రాజాకి అర్థం అయేది కాదు. రహస్యంగా ముంజలూ అవీ తెచ్చి అక్కయ్యకి ఎవరూ చూడకుండా పెడుతుండేవాడు. అందరూ రాత్రిళ్లు సుష్టుగా భోజనం చేసి ఒక్క అక్కయ్యకే ఉపవాసముంచి ఎందుకు పెడతారో, అక్కయ్య రవిక ఎందుచేత తొడుక్కోదో వాడికి సమస్య.

ఆ ఇంట్లో సుఖమూ శాంతీ నశించిపోయినాయా అనిపిస్తోంది. క్రిష్ణయ్యగారు మనుమరాలి అందం ఏ అమంగళాన్ని తెచ్చిపెడుతుందని భయపడ్డాడో, ఆ అమంగళం రానే వచ్చింది. ఆ నెలలోనే క్రిష్ణయ్యగారు ప్రాణప్రదంగా చూసుకుంటున్న గుర్రం చనిపోయింది. వీటన్నిటిచేత ఆయనకి గుండెల్లో నొప్పి ఎక్కువయింది. ఈ రోజు మరీ జాస్తిగా ఉన్నది. ప్రసాదరావూ, నరహరిరావూ, కూతుళ్ళు ముగ్గురూ, అల్లుళ్లూ, మనుమలూ, మనుమరాళ్ళూ అంతా ఆయన చుట్టూ ఉన్నారు.

రామమ్మగారు ఏం జరగబోతోందో తెలియని అయోమయస్థితిలో భర్త పాదాల దగ్గర కూర్చుంది. ఇంతమందీ ఉన్నా, ఆయన హృదయం మరొకరికోసం తీవ్రంగా వ్యథపడుతున్నది. ఈ అంత్యసమయంలో తన జీవితంలో సంఘటనలన్నీ ఒకటొకటిగా ఆయనకు జ్ఞాపకం రావటం ప్రారంభించినయ్.

తనది పరిపూర్ణజీవితం. ఆర్థికంగా, దైహికంగా, మానసికంగా తను ఏనాడూ బాధపడలేదు. తనకి జీవితంలో రెండే కష్టాలు అనుభవానికివచ్చినయ్. పూర్ణభర్త చనిపోవటం, తను ప్రాణప్రదంగా చూసుకుంటున్న గుర్రం కాలిపోవటం. పెద్దకొడుకుని దగ్గరకు పిలిచాడు క్రిష్ణయ్యగారు. ప్రసాదరావు వెంటనే వచ్చి తండ్రిపక్కలో కూర్చున్నాడు.

"మీ అమ్మ దేవతలాంటిది. దాన్నెప్పుడూ కష్టపెట్టకు. నీ భార్య మహాయిల్లాలు. దాన్నికూడా నీ ప్రాణంలాగా చూసుకో. ఈ ఆడవాళ్ళిద్దరూ ఏనాడూ సుఖపడకపోయినా, సుఖపడినట్లు నటించి మనని సంతృప్తిపరుస్తున్నారు. నరహరీ! ఇలా రా నాయనా!" నరహరిరావు దగ్గరగా వచ్చాడు.

"నువ్వు చదువుకున్నావు. నీకు నేను చెప్పాల్సిందేమీ లేదు. నీ జీవితం ఏమార్గాన నడిస్తే సుఖంఅనుకుంటావో ఆ మార్గానే నడు".

ఆయనకు ఆయాసం అధికంగా ఉన్నది. అయినా, మాట్లాడటం మానలేదు.

"రామీ... చనిపోతానంటే ఒకటేనే బాధ – నీవు అక్కడఉండవని. నువ్వులేని స్వర్గంకూడా నాకు శూన్యమేనే పిల్లా!"

రామమ్మగారు భోరునఏడ్చింది. ఇంతలో సభారంజని లోపలికి వచ్చింది. ఆమెహృదయంలో ఏ అగ్నిపర్వతాలు బ్రద్దలవుతున్నాయో ఎవరికీ తెలియదు. ఆమె సరాసరి వచ్చి క్రిష్ణయ్యగారి కాళ్ళగట్ల నిలబడింది.

"సభా! వచ్చావా! నీకోసమే ప్రాణాలునిలుపుకున్నాను. ఏదీ నువ్వుపాడే మువ్వగోపాలపదం — మూడునాళ్ళాయెరా మువ్వగోపాలా - అని రెండురోజులు కనిపించకపోతే ఆ పదం పాడేదానివి -ఇప్పుడుకూడా ఒకసారి పాడు ... ఎందుకే అలా దూరంగా నుంచుంటావు? ఇలా రా"

సభారంజనిముఖాన దుఃఖచిహ్నలేమీ లేకపోవటం చూసి, రామమ్మగారు ఆశ్చర్యపోయింది. ఆమెమనసులో ఎంతయినా వేశ్య అనే తేలికభావంకూడా ఒకమూల మెదిలింది. సభారంజని క్రిష్ణయ్యగారి కాళ్ళగట్ల కూర్చుని, ఆయన కాళ్ళు ఒళ్ళోకితీసుకుంది.

"ఏదీ ఆ పాట ఒక్కసారి పాడవూ!"

సభారంజనిఅమృతకంఠంలోంచి 'మూడునాళ్లాయెరా మువ్వగోపాలా' అనే పాట మధురంగా ధ్వనించటం ప్రారంభించింది. ఆ అంత్యకాలంలో ఆ పాట కావాలని కోరిన క్రిష్ణయ్యగార్ని, ఆనందంగా పాడుతున్న సభారంజనినీ అందరూ ఆశ్చర్యంగా వెగటుగా చూస్తున్నారు. ఆ పాట గాలిలో తేలిపోతోంది. పాట పూర్తిచేసి సభారంజని ఆయన కాళ్ళమీద వాలిపోయింది. ఆమెశరీరం చల్లగా చల్లచల్లగా తగిలింది. క్రిష్ణయ్యగారినోట్లోంచి ఏవోమాటలు అస్పష్టంగా వినవస్తున్నయ్ — 'నీ పాదకమలసేవయు నీ పాదార్చకులతోడి నెయ్యమును నితాంతాపారభూతదయయును తాపసమందార! నాకు దయసేయగదే."

దింపండి దింపండి అన్నారందరూ. ఆయనకాళ్ళ మీద పడిఉన్న వేశ్యశరీరం తాకటానికి అందరూ జంకారు.

రామమ్మగారు లేచి సభారంజనిని ఇవతలకు తీసింది. ఆమె అప్పటికే చనిపోయింది. ఈమెనే తను ఇందాక వేశ్యఅని మనసులో అసహ్యించుకున్నది. తరతరాలుగా పవిత్రతని అంటిపెట్టుకున్న ఆమెతల సిగ్గుతో కుంగిపోయింది. మృత్యువు కూడా ఆ వేశ్యని ఆయసనించి విడదీయలేకపోయింది.

ఇంటిల్లిపాదీ గొల్లుమన్నారు. జీవనస్రవంతిలో ఇంకిపోయిన ఆ రెండు బిందువులూ రెండు ఉజ్వలదీపశిఖలుగా మారి, ఆకాశానికేసి తేలిపోవటం రామమ్మగారు చూడగలిగింది. రెండుచేతులూ ఎత్తి వాటికి నమస్కరించి విరుచుకు పడిపోయిందావిడ.

## 3

మధురమైనఊహ లెప్పుడూ చేదైన అనుభవాల్నించే వస్తాయి. పూర్ణకి వైధవ్యం తెచ్చిపెట్టినచేదుని వయస్సు పంచదారపూతవేసింది. ఆ మాధుర్యానికి అనుగుణమెంత చేదు మిగులుతుందో, అర్థంచేసుకునే తెలివి ఆ పిల్లకి లేదు. కాని రాజామాత్రం అంత చిన్నతనంలోనూ ఆ పరిస్థితి అర్థంచేసుకున్నాడు. అతనికి ఇల్లంటే వెగటుగా ఉండేది. బందరులో చదువుతున్న రాజా సెలవరోజునకూడా ఇంటికి వచ్చేవాడు కాదు. చదువుమీదకూడా అతనికి అట్టే శ్రద్ధలేదు. కాని, ఇంగ్లీషు, ఉర్దూ అమోఘంగా వచ్చును. రాజాతోపాటు కిష్టయ్యగారి రెండోకూతురుకొడుకు వెంకటరత్నంకూడా బందరులో చదువుతున్నాడు. అతను కవి. రాజామనసులో సుడిదిరుగుతున్న భావాల్ని అతను వాక్యాలలోపెట్టి రాజాకి వినిపించేవాడు. "పూర్ణమొగుడు పోతే, దానికన్న నాన్న

బాధపడి చదువు చెడగొట్టుకోటంలో అర్థంలేదురా" అనే వాడు. రాజాలో పైకిచెప్పలేనివ్యధ వెంకటరత్నంకథలకి కథా వస్తువు అయింది. వెంకటరత్నానికీ అదేవయసు. రాజా అతన్ని చాలా ప్రేమించేవాడు. వెంకటరత్నంవ్రాసిన నాటకంలో రాజా నాయకుడు. బాల్యంవీడని ఈ లేతయువకు లిద్దరూ బందరు శ్రీరామాహైస్కూలుకి హీరోలు.

రాజ్యలక్ష్మి తన ఆశలన్నీ కొడుకుమీదనే నిలుపు కున్నది. తనలోకలిగిన విప్లవాత్మకమైన తిరుగుబాటుతనానికి పూర్ణ బలిఅయిందనే ఊహ ఆమెను వదిలిపోవటంలేదు. ప్రసాద రావుగారుకూడా కొడుకునిచూసుకుని గర్వించేవాడు. కాని, ఆ గర్వాన్ని ఏవిధంగానూ పైకి చూపించేవాడుకాదు. మూడుకరిణీకాలూ, వ్యవసాయం — వీటితో సతమతమయ్యే ప్రసాదరావుగారు కొడుకుని అజకమ్మోకపోవటంతో రాజాకి ఆయనంటే ఏ భావమూలేకుండా, కేవలం నిర్లక్ష్యం, దానితో పాటు ఒక విమిశ్రమైన భయమూ మాత్రం మిగిలినయ్.

యవ్వనోదయం అయ్యాకనే మొదటిసారి రాజాకి స్త్రీ అంటే అర్థంఅయింది. బందరులో చరిత్రాత్మకమైనస్థలాల్లో చల్లరస్తా, రామన్నపేటమండు, రాఘవయ్యకిల్లీకొట్టూ ముఖ్యమైనవి. ఒక సుప్రభాతాన రాఘవయ్యకిల్లీకొట్టుదగ్గిర రాజా నిలబడిఉన్నప్పుడు, వరాలు అటు వెడుతూ రాజానిచూసి సరాసరి కిల్లీకొట్టుదగ్గిరకి వచ్చి "ఏయ్, అబ్బాయ్! కొత్తగా చేరావా స్కూల్లో?" అని అడిగింది.

రాజా చాలా గాబరాపడ్డాడు. వరాలుకి పది హేడేళ్లుంటయ్. చేతులోఉన్న పుస్తకాల్నిబట్టి చదువుకుంటోందని

తెలుస్తూనే ఉంది. చదువుకునే ఆ ఆడపిల్ల కిల్లీ కొట్టు దగ్గిర సోడా తాగుతున్న ఒక మగధీరుడిని 'అబ్బాయ్' అని సంబోధించి, 'కొత్తగా చేరావా స్కూల్లో' అని ప్రశ్నించటం ఇంతవరకూ రామా హైస్కూలు చరిత్రలో ఏనాడూ జరిగి ఉండదు.

అందుకే రాజా ఆశ్చర్యానికి అంతులేకపోయింది. తన ప్రశ్నకి జవాబు చెప్పకుండా, బిగుసుకుపోయిన ఈ కుర్రాణ్ణి వెటకారంగా ఒక చూపు చూసి, 'నాక్కూడా ఒక సోడా ఇయ్యి రాఘవయ్యా' అని హాయిగా సోడా తాగేసి, నిశ్చింతగా స్కూలు కెళ్ళిపోయింది వరాలు.

బిగుసుకుపోయి అటే చూస్తున్న రాజాని బుజం పట్టుకు ఊపి, 'వరాలంతేలెగండి బాబూ! కిల్లీ ఇమ్మంటారా?' అని రాఘవయ్య ఈ ప్రపంచంలోకి లాక్కొచ్చాడు. రాజా సోడా సొంతం తాగేసి, కిల్లీ వేసుకుంటూ "అసలీ అమ్మాయెవరు?" అని ధైర్యంచేసి రాఘవయ్యని అడిగేశాడు.

"వరాలు మాటేనా బాబూ! వెంకటనరసయ్య కూతురు. నరసయ్య పోయినాడులెండి. అప్పటినుంచీ వాళ్ళమ్మే ఉన్న కాస్త ఆస్తినీ, పిల్లల్నీ చూసుకుంటోంది. వరాలు పెద్దపిల్ల. ఇంకా నలుగురున్నారు. పిల్ల చూశారుగా, మా అందగత్తె".

"చూశానులే. కాని ఆ అమ్మాయేమిటి అంత సిగ్గు లేకుండా నడిబజారులో అలా అడిగింది?"

"దానిస్వభావం అంతే బాబూ. అందరితోనూ హాయిగా మాట్లాడుతుంది. ఆ స్వభావం చూసి ఎవడన్నా మాటంటే మట్టుకు పళ్ళురాలకొట్టేస్తుంది. మొన్న పోలీసోడిని నడివీధిలో చెంపకాయకొట్టేసింది."

"చిత్రంగానే ఉంది రాఘవయ్యా! వాళ్ళమ్మయినా ఈ పిల్లని కాస్త అదుపులో పెట్టే ప్రయత్నం చేయదూ?"

"వరాలు సంగతి మీకు తెలియదు బాబూ! అ దెవరి మాటా వినేరకం కాదు"

"రాఘవయ్యా!"

"ఏం బాబూ!"

"ఈ అమ్మాయి నన్నెందుకు పలకరించిందంటావు?"

"దాని స్వభావం అంతే బాబూ"

"అంతేనంటావా?"

"అంతకన్న ఇంకేముంది బాబూ!"

ఆ సంభాషణ అంతటితో ఆగిపోయినా, రాజా మనసులో వరాలు రూపమూ ఆమె వేసిన ప్రశ్నా ముద్రపడినయ్. తరువాత నాలుగురోజులకి వరాలూ, వెంకటరత్నం రాఘవయ్య కిల్లీకొట్టు దగ్గర సోడా తాగుతూ కనిపించేసరికి రాజా ఆశ్చర్యానికి అంతులేకపోయింది. తనుకూడా మెల్లిగా అక్కడికి వెళ్ళాడు. రాజానిచూడగానే పుస్తకాలు తీసుకొని వరాలు వెళ్ళిపోయింది. వెంకటరత్నం ఆశ్చర్యపడిపోయి "అదేమిట్రా, నిన్నుచూడగానే వరాలు తుర్రుమంది?" అన్నాడు. అతని ప్రశ్నకి సమాధానం రాఘవయ్య చెప్పాడు "మొన్న అది పలకరిస్తే అయ్య జవాబు చెప్పలేదు" అని.

"దాన్ని అర్థంచేసుకోటం మహా కష్టం రాఘవయ్యా! ఏరా నువ్వెందుకు మాట్లాడలేదు?"

"వదిలేశావులేవోయ్, ఏమిటి దానితో మాట్లాడేది?" అని విసుక్కున్నాడు రాజా. కాని వరాలు అంత తృణీకారంగా

వెళ్ళిపోవటం అతనికేం నచ్చలేదు. దీనికింత పొగరా! అని పించింది. తరువాత నాలుగురోజులు ఏమీ జరగలేదు.

అయిదవరోజు అసురసంధ్యవేళ బుట్టయ్యపేటసందుల్లో ఒక నిర్జనమైనగొందిలో అనుకోకుండా రాజా వరాలుకి ఎదు రయేసరికి ఇద్దరూకూడా నిర్ఘాంతపోయినారు. కొన్నిక్షణాలు ఇద్దరూ మాట్లాడలేదు. ఒక్కతే ఈ నిర్జనమైనసందులోకి ఎందుకువచ్చిందో రాజాకి తెలియలేదు. ఎందుకురావాలని కోపంకూడా వచ్చింది.

"ఒక్కదానివీ ఈ సందుల్లోకి ఎందుకువచ్చినట్లు? పద నిన్ను ఇంటిదాకా పంపించివస్తాను" అన్నాడు రాజా.

ఆ మాటకి అదిరిపడ్డది వరాలు. తను స్త్రీననీ, ఒంట రిగా రావటానికి తను భయపడాలనీ అప్పుడే ఆ పిల్లకి తెలిసింది. అక్కడికి ధైర్యంచేసి "నా కెవరితోడూ అక్కర్లేదు" అన్నది.

"అక్కర్లేదేం? ఈ సందులో ఎవడయినా తలకాయ పగలకొడితే రోగంకుదురుతుంది?" అన్నాడుకచ్చగా అతను.

"ఆహాహా! ఏంధైర్యం అండీ, బందరువీరులకి!" అన్నది హేళనచేస్తూ వరాలు.

రాజాకి ఒళ్ళుమండింది. ఈ ఆడపిల్లకి ఇంత ధైర్యమా అనిపించింది. ఆ క్షణంలో కచ్చగా ఏదో చెయ్యాలనిపించింది. ఇటూఅటూ చూసి, ఆ పిల్లని దగ్గరకులాక్కుని గట్టిగా ముద్దు పెట్టుకుని, కౌగిలివదలకుండానే "బందరువీరులధైర్యం ఇంకొం చెం చూపించమంటావా, వదిలెయ్యమంటావా?" అన్నాడు. వరాలు పదిహేనేళ్ళవయస్సులోనూ యవ్వనంవచ్చిన ఈ మూడుసంవత్సరాల్లో ఓడించటమేతప్ప ఓడిపోవటం ఎరగదు.

ఈ క్షణంలో తనకంటె ఒకసంవత్సరంమాత్రమే పెద్దవాడైన ఈ పసివాడిచేతుల్లో తను ఓడిపోయింది.

కాని, ఆమెమనసులో ఓడిపోయినా తనే గెలవాలనే పట్టుదల ప్రవేశించింది. వెంటనే అతన్ని ఇంకా గట్టిగా ముద్దుపెట్టేసుకుని, అక్కడినించి పారిపోయింది.

చెంపకాయకొడుతుందనుకొన్న స్త్రీదగ్గరనుంచి అనుకోకుండా అంగీకారం ఎదురయితే, మొగవాడికి మతిపోతుంది. అది అదృష్టమో దురదృష్టమో తేల్చుకోలేని అయోమయంలో పడతాడు. ప్రస్తుతం రాజా అదేపని చేశాడు.

అరగంటసేపు అయోమయస్థితిలోఉండి, ఆ తరువాత మెల్లిగా గదికొచ్చేసరికి వెంకటరత్నం లేకపోవటంఅనేది పూర్వజన్మలోచేసుకున్న పుణ్యానికి ఫలితం అని సంతోషించి ఆదమరిచి నిద్రపోయినాడు రాజా.

ఆతరువాత పదిరోజులు వరాలు స్కూలుకి రాలేదు. పదకొండోరోజున చీరకట్టుకుని వచ్చింది. పరికిణీకట్టుకున్న వరాలుకన్న చీరకట్టుకున్నవరాలు పెద్దదిలాగా ఉన్నది. రాజా తొడమీద ఒక్కచరుపు చరిచి "ఒరేయ్, వరాల్లో ఏదో మార్పులేదూ?" అన్నాడు వెంకటరత్నం. రాజా వరాలువంక ధైర్యంచేసి ఒక్కచూపుచూసేశాడు. సరిగ్గా అదేసమయానికి వరాలుకూడా తలయెత్తి చూడటం జరిగింది. ఆ నాలుగు కళ్ళల్లో దాక్కొన్న రహస్యం వెంకటరత్నానికి సగం అర్థం అయింది.

"వరాల్లో ఏదో మార్పుందిరా" అన్నాడు. రాజా జవాబుచెప్పలేదు. ప్రకృతి ఒక్కసారిగ యవ్వనాన్ని అతని

లోకి పంపుచేసింది. అతనిలో రెండేఊహలు. తను పురుషుడు. తనకి స్త్రీ అవసరం. ఆ స్త్రీ వరాలే ఎందుకుకాకూడదు?

రాజామౌనం వెంకటరత్నానికి యెంతమాత్రమూ బోధపడలేదు. "ఏమిటిరా బాబూ, ఆ ఆలోచన?" అని మరో సారి ప్రశ్నించాడు.

"ఏంలేదురా, ఇంటికిపోవాలనిపిస్తున్నది".

"ఎందుకూ?"

"నువ్వు రచయితవుగదా, నిజం చెప్పరా. చెంపకాయ కొడుతుందనుకొన్న ఆడపిల్ల ముద్దుపెట్టుకుంటే దానిఅర్థం ఏమిటి?"

"అర్థానికేముంది, స్పష్టంగా తెలుస్తూనేఉంది."

"ఏమిటి తెలుస్తున్నది?"

"అది నిన్ను ప్రేమించేస్తున్నది."

"అప్పుడు నే నేంచెయ్యాలి?"

"ఏడుస్తూ కూచోవాలి. అది సరేగాని, ఇంతకూ ఎవర్రా ఆ భామామణి?"

"ఒరే వెంకటరత్నం!"

"ఓయ్"

"నీవు రచయితనని అఘోరిస్తూఉంటావుగదా, స్త్రీ అంటే ఏమిటి?"

"హతోస్మి! మనిద్దరికీ ఇంకా ఇరవయ్యేఅన్నా నిండ లేదు. అప్పుడే స్త్రీఅంటే ఏమిటో ఆలోచన దేనికి?"

"కాదు, చెప్పితీరాల్సి."

"సరే అయితే. నువ్వెప్పుడయినా రామాయణంలో శూర్పణఖగురించి విన్నావా?"

"విన్నాను"

"స్వర్గంలో ఊర్వశినిగురించి చదివావా?"

"చదివాను"

"మద్రాసు జూలో ఒక ఆడసింహం ఉంది. దాన్ని చూశావా?"

"చూశాను"

"శ్మశానంలో ఒంటరిగా నుంచుని, ఆ చీకటినీ, చితుల్నీ పరిశీలించావా?"

"పరిశీలిస్తాను"

"ధగధగా మెరిసే కత్తిని చూశావా?"

"చూశాను"

"ఆడత్రాచుబుస విన్నావా?"

"విన్నాను"

"సూదంటురాయిని?"

"అదీను"

"ఇవన్నీకలిసి భాండీలో ఉడకబెట్టి ఆ ముద్దతో నువ్వు ప్రేమిస్తున్నస్త్రీని తయారుచేశాడు బ్రహ్మదేవుడు."

"అద్భుతంగాఉంది వర్ణన. ఇంతకూ నేను ప్రేమిస్తున్న స్త్రీ ఎవరంటావు?"

"వరాలు"

వెంకటరత్నం ఇచ్చిన సమాధానంతో రాజాకి తలతిరిగి పోయింది. తను వరాల్ని ప్రేమిస్తున్నాడా? ఆపిల్ల నిర్భయాన్ని, నిర్లజ్జతనీ చూసి తను అసహ్యించుకుంటున్నాడు.

"నోరుముయ్యి" అని వెంకటరత్నాన్ని కసిరి, క్లాసులోంచి పారిపోయినాడు రాజా.

"విడిలీవిడలని మందారమొగ్గలలాటి ఆమె పెదవుల స్పర్శ అతనికి జ్ఞాపకం వచ్చింది. ఆ పెదవులలో విషం ఉండటానికి యెంతమటుకు అవకాశం ఉందో అతను ఆలోచించలేక పోయినాడు. అంతేకాకుండా, ఆమె అంటే తనకి ఉన్న కుతూహలాన్ని అసహ్యం అనుకుంటున్నాడుగాని, ప్రేమ అని గ్రహించే వయసూ అనుభవమూ అతనికి లేవు.

జీవితమార్గంలో కనిపిస్తున్న ప్రతీమైలురాయి దగ్గరా అదే గమ్యస్థానం అనుకొని, ఆగిపోయి కొంతకాలం గడిచిన తరువాత అది తను చేరవలసిన చోటు కాదని తెలుసుకుని, మళ్ళీ బయలుదేరి పోయేవాళ్ళు కొందరుంటారు. వాళ్లు ప్రతీరాయినీ గమ్యం అనుకొంటూనే జీవితయాత్ర సాగిస్తారు. చివరకి వాళ్లు గమ్యాన్ని చేరతారా? చేరరా? అన్నది అగమ్యం. అలాటి స్వభావమే గల వ్యక్తి వరాలు. ఆమె అందం చాలా విచిత్రమైనది. వెంకటరత్నం ఇచ్చిన వర్ణన చాలా సరిఅయినది. రాజాని ముద్దుపెట్టుకొన్న క్షణం నుంచీ తను స్త్రీననే భావం జాగృతమయింది ఆమెలో.

ప్రేమ ప్రణయం లాటి కొన్ని మాటలు వరాలు లాటి వాళ్ళకి అర్థంకావు. వాళ్ళకి తెలిసిందీ అనుభవించేదీ కూడా కోరికే. అది గాఢమైన ఇచ్ఛ. సామాన్యంగా ఇలాటివాళ్ళు

పురుషులయినా స్త్రీలయినా లోకదృష్టిలో వ్యభిచారులుగా పరిగణింపబడతారు.

అయితే వచ్చినచిక్కేమిటంటే, పురుషుడికన్న స్త్రీకి ఇలాంటిపేరు నష్టాన్ని కలిగిస్తుంది. ఆ విషయం తెలుసుకునే వయసూ అనుభవమూ కూడా వరాలుకి లేవు. ప్రతివాళ్ళతోనూ సరదాగా మాట్లాడుతూ కులాసాగా గంతులేసే ఆ అల్లరిపిల్ల తన జీవితమార్గంలో మొదటిమైలురాయిని చేరుకుంది. ఆ విషయం గ్రహించినవాడు వెంకటరత్నం.

రాజా చాలా అందగాడు. అతనిఅందం చూసినప్పుడు ఏ వ్యక్తిఅయినా ఆకర్షణపొందకతప్పదు. స్త్రీపురుషభేదం లేకుండా అందరినీ ఆకర్షించే తన మేనమామకొడుకు అందానికి వరాలులాంటి ఆడపిల్లలు భ్రమించటంలో అట్టే ఆశ్చర్యం లేదుగాని, ఏం ప్రమాదంజరుగుతుందోనని మాత్రం అతను భయపడుతున్నాడు.

అయిదారురోజుల్లోనే అతను భయపడినంతపనీ జరిగింది. చిలకలపూడిప్రాంతంలో రాజా, వరాలూ కనిపించారని ఎవరో అనుకుంటుంటే విన్నాడు. ఆ రాత్రి రాజా ఇంటికి రాగానే అడిగాడు. రాజా మాట్లాడలేదు.

"మాట్లాడవేంరా?"

"ఏం మాట్లాడమంటావు?"

"నువ్వూ, వరాలూ చిలకలపూడిపర్రలలో ఎందుకు విహరిస్తున్నట్లు?"

"విహరించాలనిపించింది కనుక."

"విహరించాలనిపిస్తే విహరించేయుటమేనన్నమాట!"

"అవునూ. మంచినీళ్ళు తాగాలనిపిస్తే తాగటం లేదూ!"

"కాని గ్లాసుసంగతి కొంచెం ఆలోచించాలిగదా"

"ఆ గ్లాసుని సొంతంచేసుకోవాలని అనుకున్నప్పుడు ఆ ఆలోచన"

"అంటే తాగి ఒదిలేస్తావన్నమాట!"

"అసలు తాగాలనికూడా అనుకోటంలేదు"

"మరి ఈ తిరుగుడెందుకు?"

"నువ్వూ నేనూ కలిసి తిరగటంలేదూ!"

"అబ్బాయి, ఒకవిషయం చెపుతా విను. నువ్వూ నేనూ మొగవాళ్ళం. ఒకళ్ళభుజాలమీద మరొకళ్ళం చేతులు వేసుకుని ఊరంతా ఊరేగినా, ఊళ్లోనూ మనలోనూకూడా ఏవిధమైన మార్పూ ఉండదు. కాని, స్త్రీపురుషులు ఆవిధంగా ఉండలేరు. అందుకే స్త్రీపురుషులు స్త్రీపురుషులుగానే ఉంటారుగాని, స్నేహితులుగా ఉండగలగటం దాదాపు అసంభవం అనే చెప్పాలి" అన్నాడు వెంకటరత్నం.

"అలాఉండటం సాధ్యమేనని నేను రుజావుచేయదల్చుకొన్నాను"

"ఏడిశావ్"

"చూస్తూఉండు"

"ఇంతకూ అసలుగొడవ ఏమిటో చెప్పరా అంటే!"

"చెప్పటానికేముంది! నిన్న చిలకలపూడివెళ్ళినమాట నిజమే"

"మరి నిన్నటిదాకా అసహ్యించుకున్నావుగా!"

"త్రాచుపాముని చూస్తే అసహ్యంతోపాటు ఆకర్షణ కూడా కలుగుతుంది''

"అంతమాత్రాన అది విషపుజంతువు కాకుండా పోదు"

"నాలాంటివాడికి విషంకూడా వైరలా కనిపిస్తుంది"

"ఇంతకూ నీ ఉద్దేశ్యంఏమిటో చెప్పు"

"ఉద్దేశ్యానికేముంది? వరాలు చాలా విచిత్రమైన పిల్ల. అందుకే ఆమెఅంటే నాకు ఆకర్షణ.''

"ప్రమాదమేమో!"

"నువ్వొక్కడో వైదేహమ్మబామ్మలాగా తయారయినావేమిటిరా? ఎప్పుడో జలుబుచేస్తుందని ఇప్పటినుంచే మిరియాలకషాయం కాచి ఉంచుకుంది ఆవిడ''

"కాని ..."

"భేష్, నీవు రచయితవి. మనిషిమనోభావాల్ని నువ్వు చదవటం నేర్చుకోవాలి. విచిత్రమైన వ్యక్తిత్వమూ, విపరీతమైన మనస్తత్వమూ ఉన్న వ్యక్తులు నీకు ఆశ్చర్యాన్ని కలిగించకూడదు. ఆకర్షణ కలిగించాలి. అంతకన్న నేను చెప్పేదిలేదు'' అని ఒత్తిగిలిపడుకున్నాడు రాజా.

వాళ్ళిద్దరూ ఉంటున్న ఆ గది మేడమీద ఉన్నది. దొడ్లో ఉన్న బాదంచెట్టుమధ్యనుంచి చంద్రకిరణాలు కిటికీలోకి ప్రవేశించి రాజా మొగంచుట్టూ ఒక కాంతిపరివేషాన్ని కల్పించినయి. ఆ సౌందర్యానికి ముగ్ధుడైపోయిన వెంకటరత్నం చాలాసేపటివరకూ నిద్రపోలేదు. రాజాశరీరంలో నుంచి బాల్యం ఇంకా పూర్తిగా తొలిగిపోలేదు. యువ్వనం

ఇంకా సరిగా ప్రవేశించీ ప్రవేశించకపూర్వమే తన ప్రభావాన్ని చూపెడుతోంది.

వరాలుని నిజంగా రాజా అసహ్యించుకుంటున్నాడా? లేక అసహ్యించుకున్నట్లు నటిస్తున్నాడా? ఆమెమీద ఏహ్యభావం ఉన్నా ఆమెవేపే అతనిహృదయం హాహాకారాలుచేస్తూ పరుగుపెడుతున్నదెందుకు? ఇది ఎంత ఆశ్చర్యకరమైనవిషయం! ఇంత అసహ్యమూ విద్వేషమూ ఉన్నచోట ఈ సద్భావమూ కాంక్షా ఉండటం మరో చిత్రం. భగవంతుడా! నువ్వు సృష్టించిన విచిత్రపదార్థాలలో అన్నిటికన్న చిత్రమైనది మానవుడి అంతర్యం, అనుకుని ఒత్తిగిలిపడుకున్నాడు రచయిత వెంకటరత్నం.

అప్పుడే తెలిరేకలు విచ్చుకుంటున్నాయ్. వెంకటరత్నానికి మెలకువవచ్చింది. ఆ అర్థచైతన్యస్థితిలో స్త్రీపురుష కంఠాలు వినిపించటంతో పడుకుని వినసాగాడు. వరాలు తెగించేసి తమగదికే వస్తుందని వెంకటరత్నం కలలోకూడా ఊహించలేదు. సర్వేంద్రియశక్తులూ శ్రవణేంద్రియంలోకి కేంద్రీకరించి వాళ్ళమాటలు వినసాగాడు అతను. అతను మెలకువతోనే ఉన్నాడనీ, తమమాటలు వింటున్నాడనీ రాజా గ్రహించాడు. కాని ఆ ప్రాతఃకాలంలో మంచుబిందువులతో తడిసిన గులాబీపూవులాంటి వరాలుమొగం అతనిలో ఆశ్చర్యంతోపాటు అంతర్యంలో అవ్యక్తమైన వాంఛనికూడా రేగగొడుతున్నది. అతనికి ఏమీ మాట్లాడాలనిపించటంలేదు. ఆమెమొగంకేసి చూస్తూ నిలబడిపోయాడు.

"మా అమ్మని పామ్రు బస్సెక్కించి ఇలా వస్తూ దారే కదాఅని వచ్చాను. ఏమిటలా చూస్తున్నారు? నా మొగాన కోతులాడుతున్నయ్యా?" అన్నది కోపంగా వరాలు.

"కొంచెం గొంతు దింపు. మా వెంకటరత్నానికి నువ్వంటే పడదు"

"ఆయన్ని నే నేంచేశాను పడకపోవటానికి?"

"వాడినేమన్నాచేస్తే పడేదే! ఆ చేసేది నన్ను చేస్తు న్నావుకనుకనే వాడికి పడటంలేదు" అన్నాడు రాజా.

ముసుగులో వెంకటరత్నం ఒక్కమారు కదిలిపోయి, ఆత్మపరీక్ష చేసుకోటం ప్రారంభించాడు. వరాలు రాజానంక ఆశ్చర్యంగా చూస్తూ 'అదేమిటి' అన్నది.

"అదం తేలే!... వరాలూ!"

"ఊఁ!"

"నువ్వింత అందంగాఉన్నావు. ఇలా మొగాళ్ళగదికి ఒంటరిగా వచ్చావు, ప్రమాదం ఉందేమోఅనికూడా అనుకో కుండాను. నువ్వు చాలా తమాషాపిల్లవు కదూ?"

"మొగాళ్ళగదీ! ఇక్కడికి రానటానికి నే నెందుకు భయపడాలి?" అన్నది వరాలు ఆశ్చర్యంతో కళ్లుపెద్దవి చేసి. ఆ ప్రశ్నకి రాజాతోపాటు ముసుగులో ఉన్న వెంకట రత్నంకూడా బిగుసుకుపోయినాడు. ఈ పిల్లకి ఈ ప్రపంచంలో కొన్ని ప్రమాదాలున్నాయనీ, వాటికి భయపడాలనీకూడా తెలి యదు. అసలు భయంఅనేది ఆమెనిఘంటువులో లేదు. తన సాహసానికి ప్రతిగా వచ్చే ప్రమాదాన్నికూడా అతి మామూ లుగా ఆమె స్వీకరిస్తుంది.

"ఇప్పుడు నేను నిన్నేదయినా చేస్తే ఏం చేస్తావు?" అన్నాడు రాజా. సమాధానంకోసం చెవులురిక్కించి వినసాగాడు వెంకటరత్నం. ఏమాత్రం ఆలోచించకుండా వెంటనే సమాధానం ఇచ్చేసింది వరాలు. "మరి నే నేదయినా చేస్తే నువ్వేంచేస్తావు?"

వెంకటరత్నానికి దాదాపు మూర్ఛవచ్చేసింది. రాజా కొన్నిక్షణాలు నిర్ఘాంతపోయి తరువాత తెప్పరిల్లి పకపక నవ్వుతూ "శెభాష్! మా వెంకటరత్నంలాంటి రచయితకూడా ఈ కోణంలోంచి ఏనాడూ ఆలోచించిఉండడు" అన్నాడు.

ఎందు కింత నవ్వుతున్నాడో వరాలుకి అర్థంకాలేదు. కొద్దిగా కోపంకూడావచ్చింది. "ఏమిటా నవ్వు?" అని గట్టిగా అడిగేసింది. ఆ పిల్లమాటలూ ఆ స్వభావమూ వెంకటరత్నానికి తమాషాగాఉన్నయ్. ముసుగుతీసేయాలన్నకోరిక అణచుకున్నాడు.

రాజా వరాలువంక విచిత్రంగాచూస్తూ "వరాలూ!" అని పిలిచాడు. ఆ స్వరంలోని అస్వాభావికత వెంకటరత్నానికి అర్థంఅయింది.

"వరాలూ! ఇంతమటుకు పురుషుడు తననేంచేస్తాడో అని అనుక్షణమూ భయపడుతూ మంచీ చెడూకూడా వాడి నెత్తినే వేస్తున్నారు ఆడవాళ్ళు. ఆ చేసినతప్పులోగాని ఒప్పులోగాని నాకూ బాధ్యత ఉన్నది. నా అవస్థేదో నేనే పడతాను అనే స్త్రీ ఇంతమటుకు ఎక్కడా కనిపించలేదు. ఒక వేళ అలాటిస్త్రీ ఎక్కడయినాఉందని ఏ నవలారచయితో ఒక కథవ్రాసినాగాని, నేను నమ్మేవాడినికాదు. కాని నిన్నిప్పుడు

ప్రత్యక్షంగా చూస్తున్నాను. నమ్మకుండా ఉండటం అసం భవం" అన్నాడు రాజా.

తనలో ఏం ప్రత్యేకత ఉన్నదో వరాలుకి అర్థం కాలేదు. ఆమెలోని ప్రత్యేకత లోకానికి కనిపిస్తుందిగాని, ఆమె కది సహజంగానే ఉంటుంది. ఆకాశంలో ఎగురుతున్న రాజహంస మనకి ఆశ్చర్యాన్నే కలిగించవచ్చును. కాని అది రాజహంస. దాని గొప్పతనంగాని సౌందర్యంగాని దానికి మామూలుగానే ఉంటుంది. మరో రాజహంసకీ అది మామూలుగానే ఉంటుంది. వరాలు ప్రత్యేకత రాజాకి చిత్రమైన ఆకర్షణ కలిగించినా, ఆశ్చర్యాన్ని ఎక్కువగా కలిగించలేదు. అతను కూడా కొంత ఆశ్చర్యపోయినమాట నిజమేగాని, వెంకట రత్నం పడ్డ అవస్థలో పడలేదు.

"సరే, నన్ను గురించి తరువాత పొగడొచ్చునుగాని. సాయంత్రం ప్రోగ్రామేమిటి? మా ఇంటికి రాకూడదూ?" అన్నది వరాలు.

"తప్పకుండా వస్తాను కాని, న న్నేమీ చెయ్యకు" అన్నాడు నవ్వుతూ రాజా. వరాలు మూతిబిగించి రాజాని ఒక చిన్న చెంపదెబ్బ వేసి వెళ్ళిపోయింది. ఆ స్పర్శతో రాజాహృదయానికి రతీదేవి పచ్చలహారతి ఇచ్చింది.

వెంకటరత్నం ఒక్కతడవ ముసుగుతన్నేసి అమాంతం లేచి కూర్చున్నాడు. స్త్రీలవిషయంలో తన ఉద్దేశ్యాన్ని మార్చుకునేసమయం ఆసన్నమైనది అతనికి. ఇంతవరకూ అతనిమనసులో స్త్రీలంటే జాలి కరుణా మొదలైనభావాలు ఉండేవి. వాళ్ళు అబలలు కనుక, వారంటే దయగా ఉండా

లనుకునేవాడు కాని, ఇవ్వాళ అతని ఉద్దేశ్యాలన్నీ ఠాప్పున పేలి పోయి ఊరుకున్నాయి. మగవాడిని తలెత్తనీయని స్త్రీలు కూడా అక్కడక్కడ కనిపిస్తారు. వాళ్ళముందు పురుషుడు అవనత వదనుడై పోతాడు. అలాంటి స్త్రీయే వరాలు ... ఆమె ప్రత్యేకతని ఆరాధించటానికి అతని కేవిధమైన అభ్యంతరమూ లేదు. అయితే ఈ విషకన్య మహాకర్షణలోంచి తన మేనమామకొడుకుని తప్పించాలి. రాజాని తనెంతగా ప్రేమిస్తున్నాడంటే, రాజా ఆడపిల్లయితే తను తప్పక పెళ్ళిచేసుకుని ఉండేవాడు. అమాంతం ముసుగు తన్నేసి లేచికూర్చున్న వెంకటరత్నాన్ని చూసి బిగ్గరగా నవ్వటం ప్రారంభించాడు రాజా. కొంచెం సేపయినాక నవ్వాపుకుని "నన్నేంచేయమంటావు చెప్పు?" అన్నాడు.

కిటికీలోంచి నీరెండ రాజా మొగం మీద పడి, ఆ దివ్య సౌందర్యానికి మరింత కాంతినిస్తోంది. నిర్ఘాంతపోయిన వెంకటరత్నం ఆ అందాన్ని సహృదయుడైన కళాకారుడుగా పరిశీలించటం ప్రారంభించాడు. మగవాడికి ఏడి కింత అందం దేవు డెందుకు ప్రసాదించినట్లు? అనుకున్నాడు. తన కేసి అదే పనిగా చూస్తున్న వెంకటరత్నాన్ని చూసి, రాజా ఆట్టే ఆశ్చర్యపోలేదు. తన అందాన్ని వెంకటరత్నం కళ్ళతో తాగేస్తాడన్న సంగతి అలవాటే.

"ఒరేయ్ మగవాడివి నువ్వే నన్నిలా చూస్తావుగదా, వరాలు చూట్టంలో ఆశ్చర్యం ఏముంది?" అన్నాడు రాజా. వెంకటరత్నం అప్పటికి తెప్పరిల్లుకొని "నేను చూస్తానుగాని, ఏదీ చెయ్యలేను మగవాడిని కనుక. కాని వరాలు స్త్రీ. ఇంచు

మించు నీఅంత అందగత్తె అదికూడా. మంచో చెడో చెపు తున్నాను వినబ్బాయ్. దాంతో ఆక్కడ దూరంపోవటం అంత శ్రేయస్కరంగాదు" అన్నాడు.

"అయితే నన్నేంచేయమంటావు?"

"సాయంత్రం వాళ్ళింటికి వెళ్ళకు"

"సరే కాని, ఒక్కమాట."

"ఏమిటి?"

"తరువాత ఏంజరిగినా, బాధ్యత నీదే. అదిమాత్రం గుర్తుంచుకోవాలి నువ్వు"

"ఏం జరుగుతుంది?"

"ఏంజరుగుతుందో నాకూ తెలియదు. కాని ఏదో జరుగుతుంది. రేపు ఎందుకురాలేదని వరాలు అడిగితే మా వెంకటరత్నం వద్దన్నాడని చెపుతాను"

"చెప్పు, నాకేం భయంలేదు"

"అలాఅయితే సరే" అన్నాడు రాజా. వెంకటరత్నా నికి, చాలా ఆనందంవేసింది. రాజా ఇంకా తనవాడే. అన్యా క్రాంతుడు కాలేదు. ఆ ఊహ అతని కెంతో తృప్తినిచ్చింది. "రాజా, నువ్వు స్త్రీ వెందుకుకాలేదురా?" అన్నాడు.

వెంకటరత్నం ఆ ప్రశ్న అడిగేసరికి రాజాకి పూర్ణ జ్ఞాపకంవచ్చింది. అతనిమొహాన నీడలా విషాదం ఆవరించింది రాజామనసులో మెదలిన భావాన్ని అర్థంచేసుకొన్న వెంకట రత్నం నిట్టూర్చి లేచిపోయినాడు.

స్త్రీగా పుట్టి అక్కయ్య ఏం అనుభవించింది? అదికూడా తనంత అందంగానే ఉంటుంది. కాని ఏంప్రయోజనం? రాజా

మనసులో ఒకఊహ తళుక్కుమంది. అవును, అంతే అయి ఉంటుంది. ఇన్నాళ్ళూ తను గ్రహించలేదు. స్నానసంగీనం పూర్తిచేసిన వెంకటరత్నం గదిలోకొచ్చి, ఇంకా అలాగే కూర్చున్న రాజాని చూసి, ఆశ్చర్యపోయినాడు. ప్రశ్నార్థకంగా అతని మొగం చూశాడు.

"వెంకటరత్నం!"

"ఏమిటోయ్?" అన్నాడు తలదువ్వుకుంటూ వెంకటరత్నం.

"నేనంటే నీ కింత ప్రేమ ఎందుకు?"

"అర్థంలేని ప్రశ్న"

"కాదు. అర్థంఉన్నప్రశ్నే. నీవు నాలో ఎవరినో చూస్తున్నావు, అవునా?"

వెంకటరత్నం ఉలిక్కిపడ్డాడు. చేతిలోంచిజారిన దువ్వెనని తిరిగి తీసుకుని నిశ్శబ్దంగా తలదువ్వుకోసాగాడు.

"నువ్వు జవాబుఇవ్వకపోవటంతో నే నా కర్థమయింది. నేను ఊహించింది నిజమేనా!"

వెంకటరత్నం మాట్లాడలేదు.

"మానవులహృదయాలు చాలా చిత్రమైనవిరా బావా! క్షమించు; ఈ విషయం ని న్నిక ప్రశ్నించను" అని లేచిపోయినాడు రాజా.

ఈ ప్రాణబంధువుదగ్గిర త నేమీ దాచాలని ఎప్పుడూ అనుకోలేదు ... కాని ...

రాజా తిరిగివచ్చేదాకా వెంకటరత్నం అలాగే నిలబడి ఉన్నాడు.

## 3

సంపూర్ణ యవ్వనవతి అయిన పూర్ణకి తనపరిస్థితి అర్థం అయింది. తను భర్తృవిహీన. ఎన్నో నిషేధాలతోనూ కట్టుదిట్టాలతోనూ తను జీవితం గడుపుకోవాలి. రాజ్యలక్ష్మికి కూతురుపరిస్థితి తెలుసును. ఆ పిల్లకి మామూలుగా అవసరాలు తీరటం కావాలి. ఈ కుటుంబంలో అనూచానంగావస్తున్న ఆచారాల్ని తల్లకిందులుచేయాలని తను తలపెట్టిన ఈ కార్యక్రమానికి మొదటిబలి పూర్ణ.

రెండోప్రయత్నానికి అవకాశమూ లేదు. ఆశయమూ లేదు. తనింక అలసిపోయింది. తన మరది నరహరి ప్లీడరీ పాసయి, గుంటూరులో ప్రాక్టీసుచేయటానికి వెళ్ళాడు. దానికి కారణం అది అతని అత్తవారిల్లు. ఆడపడుచులంతా, ఎవరిళ్ళల్లోవారున్నారు. పూజ్యులయిన మామగారు ఇకలేరు. అత్తగారు మంచంపట్టింది. ఒరిగిపోతున్న మహావృక్షంలాటి ఆ సంసారంలో నైదేహమ్మగారుమాత్రం చాలా గట్టిపూడ. ఆవిడ యథాప్రకారంగానే ఉంది. తనభర్త ప్రసాదరావుగారికి కరిణీకాలూ వాటితో ఏవిధంగానూ తీరదు. పోతే అంత పెద్ద ఇంటిలోనూ తనూ పూర్ణా మిగిలారు. రాజా శెలవులకికూడా సరిగా ఇంటికి రావటంలేదు. పాలేళ్ళు వెళ్ళిపోయినాక బావురుమనే ఆ ఇంట్లో పూర్ణ ఒకవేపూ రాజ్యలక్ష్మి మరొకవేపూ నిద్రపోతారు. తల్లీ కూతురూ యాంత్రికంగా ఎవరిపనులు వారు చేసుకుంటారు. మాట్లాడుకోనేందుకు వారి కాట్టే విషయాలులేవు. ఆ ఇంట్లో డబ్బుకి తక్కువలేదు. హోదాకీ తక్కువలేదు. కాని ఎవరికీ సుఖంలేదు.

ఏ దేవతశాపంచేతనో అలా తయారయిన ఆ ఇంట్లో కాస్తోకూస్తో చైతన్యస్రవంతి ప్రవహించేది ఒక్క పూర్ణలోనే అని చెప్పొచ్చును. ఆ అమ్మాయికి ఆకలివేసినప్పుడు ఏదో ఒక ఆహారం తినటం కావాలి. అది షడ్రసోపేతమైన భోజనమో లేకపోతే ఎంగిలికూడో ఆమెకి అక్కరలేదు. ఏదోఒక తిండి. ఆకలి తీరాలి. అంతే. ఆమె ఈ స్వభావాన్ని ఒక్క రాజ్యలక్ష్మితప్ప మరెవరూ గ్రహించలేరు. కొద్దిగా రాజా గ్రహించిఉండవచ్చును. ప్రస్తుతం ఈ సౌందర్యవతి బాల్య ప్రభాతంనుంచి యవ్వనమధ్యాహ్నం చేరుకుంది. శృంగార లోకంనుంచి ప్రవాసిఅయిన ఈ సుందరనారి ప్రగాఢ ప్రణయానికి వంచితురాలై సర్వశ్రేష్ఠమని ప్రపంచం భావిస్తున్న సౌశీల్యానికి గడ్డిపరకఅంత విలువఇవ్వటంకూడా మానివేసింది.

ఈ విషయాన్ని మొదట గ్రహించినవాడు వెంకటరత్నం. అదెలా జరిగిందంటే, ఒక ఆదివారంనాడు రాజా వెంకటరత్నం బందరునించి ఇంటికి వచ్చారు. ఆ రోజు మధ్యాహ్నం వెంకటరత్నానికి ఏదో పనిఉండి ఉత్తరపువేపునసావిడిలోకి వెళ్ళాడు. అక్కడ స్తంభాన్నానుకుని దేన్నో దీక్షగా చూస్తున్నది పూర్ణ. ఆమెచూసే ఆ చిత్రం ఏమిటాఅని అతనూ అటు చూశాడు. అక్కడ రెండుఉడతలు ఆడుకుంటున్నాయ్. వెంకటరత్నం అదిచూసి చాలా విచారపడ్డాడు. పక్కకుతిరిగి వెంకటరత్నాన్నిచూసిన పూర్ణ ఆతరువాత స్థిమితంగా ఆ దృశ్యాన్ని చూడలేకపోయింది. చూడాలనేకోరికనూ అణుచుకోలేకపోయింది. ప్రత్యక్షంగా ఆనందానుభూతిపొందటానికి

అర్హతలేని తన కిది అనధికారప్రియత్నమనీ, తను చాటుగా దొంగలా ఉండటమే మేలనీ అనుకుంది.

తన ఈ దొంగతనాన్ని వెంకటరత్నం పసికట్టాడు. తనకన్నా వెంకటరత్నం చిన్నవాడు. అతనికి తను భయపడాల్సిన అవసరం అట్టే లేదనుకుంది పూర్ణ. ఇంట్లో అందరూ నిద్రపోతున్నారు. వాతావరణం నిశ్శబ్దంగాఉంది.

"వెంకటరత్నం!"

"ఏం ఒదినా?"

పూర్ణ మొగంమీద ఆషాఢమేఘంలాటి విషాదం ఆవరించింది. ఆమొగంతో అట్టే పరిచయంలేనివాళ్ళు ఆవిషయం గ్రహించలేరు. కాని వెంకటరత్నం అది గ్రహించాడు.

"వెంకటరత్నం! నాబోటిది అలాచూడటం మంచిది కాదుగదూ?"

"నువ్వుఅనేమాట నా కర్థంకాలేదు వదినా! కొన్ని కొన్నిదృశ్యాలు మనం చూడకుండాఉండాలని యెంతప్రయత్నించినా చూడకుండాఉండ లేం"

"కాని ఏదో తప్పుచేస్తున్నా ననిపిస్తున్నది నాకు"

"ఫరవాలేదు. నువ్వూ మనిషివే"

"అందుకే పొరపాటుచేశాను. ఆ పొరపాటునించి నన్ను నేను రక్షించుకోటం అసంభవం"

నిశ్శబ్దంగా ఇంగ్లీషునవలల్లో దేవకన్యలా తిరుగుతుండే పూర్ణమనసులో కొన్ని ఊహాలేవో ఉన్నాయనీ, ఆమెకూడా ఇంత చక్కగా మాట్లాడగలదనీ ఇదివరకు వెంకటరత్నానికి తెలియదు. ఆమె ఏదో పొరపాటుచేసి, ఆ పొరపాటుచేశానని

ఇతర్ల దగ్గిర ఒప్పుకునేందుకు సిద్ధపడిందంటే, అట్టే చదువు సంధ్యలులేని ఆమెకు, అది జన్మాంతరసంస్కారమే అన వచ్చును. నువ్వుచేసిన పొరపాటు ఏమిటని వెంకటరత్నం అడగలేదు. కొంచెంసేపు నిశ్శబ్దంగా గడిచిపోయింది. ఆ నిశ్శ బ్దాన్ని భంగపరుస్తూ పూర్ణ

"ను వ్వెప్పుడూ ఇలాటిదృశ్యాలని చూడాలని అనుకో లేదా?" అని అడిగింది. అనుకోకుండావచ్చిన ప్రశ్నకి అతను అదిరిపడ్డాడు. సంప్రదాయపు ఇనుపగోడలమధ్య పెరిగి వితం తువు అయి సర్వసుఖాలకీ వంచితురాలైన పూర్ణ ఇంత సాహ సంతో ఇలాటిప్రశ్న అడుగుతుందని అనుకోలేదు. అతను కొంచెంసేపు ఏవిధమైన సమాధానమూ ఇవ్వలేదు. తరువాత "అది మగవాడికి ఎబ్బెట్టు అనిపించదు" అన్నాడు.

"అవును. ఈ దేశంలో స్త్రీ చేసుకున్నంతపాపం పురు షుడు చేసుకోలేదు" అన్నది పూర్ణ.

"నీకు మగవాళ్ళమీద ద్వేషంలేదుగద?"

"ద్వేషంలేదుగాని, అసూయఉన్నది. సరే పోనీ, ఇప్పు డేం వ్రాస్తున్నావు?"

"ఏమీ వ్రాయటంలేదు"

"ఏమీ వ్రాయటంలేదా! ఎందుకని? నువ్వు వ్రాసిం దంతా అచ్చుఅవుతూనేఉందిగా"

"ఆలోచిస్తున్నాను"

"ఏమిటి ఆలోచిస్తున్నావు?"

వెంకటరత్నానికి అబద్ధం చెప్పాలనిపించింది. ఆ అని పించటమే కొంపకు తిప్పలు తెచ్చిపెట్టింది.

"ఇవ్వాళ నీదగ్గర ఏమైనా నేర్చుకొందామని వచ్చాను"

పూర్ణకి నవ్వువచ్చింది. ఇందాక తనుచూసినదృశ్యం ఇతనికి తను లోకువయ్యేట్లు చేసిందేమోఅని ఆమె అనుమానించింది. అసలే చంచలురాలైన ఆమెమనసులో కొంటెతనం కదిలింది. వెంటనే ఆలోచనలేకుండా "నాదగ్గర ఏం నేర్చుకుంటావు? ప్రేమా?" అన్నది.

వెంకటరత్నం అదిరిపోయినాడు. ఇప్పుడిక వెనక్కితీయటం అతనికీ ఇష్టంలేదు.

"అవసరమైతే అదీ నేర్చుకుందామనేఉంది" అన్నాడు.

పూర్ణ కోపంనటిస్తూ "బాగుంది; ప్రేమనిగురించి నువ్వు నాదగ్గర ఏదైనా నేర్చుకోటానికి లోకం ఒప్పుకోదు" అన్నది.

ఆమె కోపంనటిస్తున్నదనీ, నిజంగా కోపంకాదనీ గ్రహించిన వెంకటరత్నం తనుకూడా నాటకమాడుతూ "అయితే, నేను వెళ్ళిపోతున్నాను" అన్నాడు.

పూర్ణ గభాలున అతనిచేయిపట్టుకుని నవ్వుతూ "అలా పారిపోవటం దేనికి ? యథార్థం కావాలని చెప్పరాదూ ?" అనేసింది.

వెంకటరత్నానికి శరీరం అంతా పులకరించిపోయింది "నేను నేర్చుకోటానికి వస్తే, ఇదేంపని" అన్నాడు పూర్ణ చెయ్యి వదిలేసి.

"అయితే ఏం నేర్చుకోటానికి వచ్చావు?" అన్నది.

"నువ్వు చెపుతూఉండు, నేను కథవ్రాస్తాను" అన్నాడు వెంకటరత్నం.

"ఆ కథ నా కథ అవ్వుతుందిగా మరి"

"అయితేనేం. అది నా కథకూడా అవుతుంది"

పూర్ణ పకపకానవ్వి "దీనికోసమేఅయితే, నీవు మరో గురువుని వెతుక్కోవటం మంచిది. ఆకలితో అఘోరిస్తున్న వ్యక్తిని కడుపునిండిన అదృష్టవంతుడి అనుభవం ఎలా ఉంటుందో చెప్పమంటే, వాడేం చెపుతాడు?" అన్నది.

కొంచెంసేపు వెంకటరత్నం మాట్లాడలేదు. తరువాత మెల్లిగా "ఆకలితోనూ ఆకలితీరటంతోనూ నాకూ అనుభవం లేదు నిజమే. కాని నేను ఆకలితీరాలని కోరుతున్నాననే చెప్పాలి" అన్నాడు.

పూర్ణ జవాబేమీ చెప్పలేదు. వెంకటరత్నం కొంచెం సేపు అయినాక "ఒకసంగతి వటనా! యవ్వనవంతుడైన మనిషికి సౌందర్యదాహం జాస్తిగాఉంటుంది" అన్నాడు. పూర్ణ విచిత్రంగా అతనివంక చూస్తూ "సౌందర్యదాహమా? అంటే?" అన్నది.

ఆ ప్రశ్నలోఉండే అంతర్గతమైన ఊహ ఏమిటో వెంకటరత్నానికి అర్థంకాలేదు. "సౌందర్యదాహం అంటే నీలాంటి అందగత్తెని అదేపనిగా చూడాలనిపించటం"అన్నాడు.

"చూడాలనిమాత్రమే అనిపిస్తుందా!" అన్నది పూర్ణ.

"నీ ప్రశ్నలోఉన్న అసంభవం నీ కర్థంకాలేదా?" అన్నాడు వెంకటరత్నం. పూర్ణ నిట్టూర్చి "అర్థంఅయింది. సౌందర్యదాహమే లేకపోతే, కాళిదాసు శకుంతల వ్రాసే వాడుకాడేమో! అందుకనే అసలు స్త్రీరూపంతాలూకు పటిష్టత తెలుసుకోవాలనుకుంటున్నాను. ప్రేమ అనేపదార్థం కేవలం రూపాన్నే అంటుకుని దేనికి ఉంటుందోకూడా నాకర్థం

కావటంలేదు. నీవు రచయితవు. నాకీ సంగతి అర్థంఅయేట్లు చెప్పాలి" అన్నది. వెంకటరత్నం మాట్లాడలేదు. అతని మొగంమీద ఔదాసీన్యం చూసి, పూర్ణ "అలాటి పెద్దసంగతులు నా స్థితిలోఉన్నవాళ్ళు తెలుసుకోవాలనుకోటం తప్పు అయితే క్షమించు" అన్నది. వెంకటరత్నం చిత్రంగా ఆమె వంక చూస్తూ, "స్త్రీసౌందర్యం పిపాసకలిగించేమాట నిజమే. కాని ఎండమావిలాటి నీ సౌందర్యం అలాటిపిపాసను చల్లార్చే అవకాశంలేదు" అన్నాడు.

"ఇప్పుడు నే నడిగేది నాసంగతికాదు, లోకంసంగతి" అన్నది పూర్ణ.

"అయితే విను. సౌందర్యంఅన్నది అంతర్యంలో ప్రతిఫలించే ఒక విచిత్రమైన ప్రతిబింబం. అది సత్యంకాదు. అందుకని అసత్యంకూడా కాదు. కాని యుగయుగాలుగా దాని సత్యాసత్యాల్ని విమర్శిస్తూనే బ్రతుకుతున్నాడు మానవుడు".

"అంటే నా కర్థంకాలేదు"

"మానవుడు రూపంకన్న రూపంకోసం ప్రయత్నించటంలోనే ఆనందాన్ని అనుభవిస్తాడని నా ఉద్దేశ్యం".

"అంటే రూపంతాలూకు యథార్థాన్ని ఇంతవరకూ మనిషి అనుభవించలేదంటావు, అంతేనా?" అన్నది పూర్ణ.

"అంతే. సంతానంకోసం స్త్రీ శరీరం తన్నుతాను సంతరించుకొన్నప్పుడు సౌందర్యంపొందుతుంది. సంతానార్థం కాని బాల్యంలోనూ వృద్ధాప్యంలోనూ ఆ అందం ఉండదు. దీన్నిబట్టి చూస్తుంటే, సృష్టికోసం తయారయిన సౌందర్యమే

స్త్రీ రూపం. నవలల్లోనూ కావ్యాలలోనూ ఎక్కువభాగం యవ్వనాన్నే వర్ణిస్తారు" అన్నాడు వెంకటరత్నం.

పూర్ణ మాట్లాడకుండా వెంకటరత్నానికేసి చూడటం ప్రారంభించింది.

"అంతే వదినా. స్త్రీకే కాదు మగవాడికీ అంతే. సృష్టి చెయ్యాలనేవాంఛనే రచయితలు ప్రేమ అంటారు"అన్నాడు.

"అంతేనా, ఇంకేమీ లేదా?" అని ఆతృతగా ప్రశ్నించింది పూర్ణ.

"అందులో సందేహించాల్సింది ఏంలేదని నా ఉద్దేశ్యం. ఈ ప్రపంచంలో ఎటువేపు తలతిప్పినా కనిపించే కథే ఇది. సృష్టియొక్క రహస్యాన్ని భగవంతుడికే వదులు. ఒకసారి తలఎత్తి అటు చూడు. చిక్కడుగింజలదగ్గరనుంచి చక్రవర్తిదాకా తన కొక కొత్తరూపంకోసమే తహతహలాడతారు. ఏవిధంగా తనలో మార్పువస్తుంది? ఏమిచేస్తే తనకి ఔన్నత్యం ప్రాప్తిస్తుంది? అనే ఆరాటమే సృష్టికి మూలం. అందుకే స్త్రీపురుషులు ఎదటివాళ్ళల్లో అలాంటిదేదో చూసినప్పుడు వాళ్ళనిపొందాలన్నవాంఛని అణచుకోలేరు. ఆ ఎదటివారు సౌందర్యవంతులయితే ఆ వాంఛకే రంగులువేసి ప్రేమఅని ఎదటివారికి నివేదనచేస్తారు. ఇంతకన్న జరిగిందీ లేదు, జరుగుతున్నదీలేదు, జరుగబోయేదీలేదు" అన్నాడు వెంకటరత్నం.

"బాగుంది. పశువాంఛకీ పవిత్రప్రేమకీ భేదంలేదూ? భలేవాడివి" అన్నది పూర్ణ. వెంకటరత్నం పకపకా నవ్వుతూ

"అంతేనమ్మా. ఆ పశువాంఛకే మంచి చీరకట్టి, నగలుపెడితే పవిత్రప్రేమకింద మారిపోతుంది" అన్నాడు.

"నేను నీ మాటల్ని సరిగా అర్థంచేసుకోలేకపోయినా, పశువాంఛనే పవిత్రప్రేమంటే బాధగాఉంది" అన్నది పూర్ణ.

"నీకు బాధగాఉన్నంతమాత్రాన అది నిజంకాకుండాపోదు. మనిషి తల్లినీ, అక్కనీ, స్నేహితుల్నీ ప్రేమిస్తాడు. వాంఛాశూన్యమైన ఆ ప్రేమ నిశ్చలసరోవరంలాటిది. యవ్వనంలో వాంఛతోపాటు కలిగే ప్రేమే సృష్టికి సూత్రం. దీన్ని నువ్వు అంగీకరించకపోయినంతమాత్రంచేత మునిగిపోయిందేమీలేదు" అన్నాడు వెంకటరత్నం.

"మరయితే ప్రపంచంలో పవిత్రప్రేమ కపటప్రేమ అంటారు; అవేమిటి?" అని మరోప్రశ్న వేసింది పూర్ణ.

"నీ వాదం అర్థంలేనిది ఒదినా. ఈ దిక్కుమాలిన ప్రపంచంలో, అవి రెండూ ఉన్నాయి. మరి దానికి ఏంచేస్తాం? బందరులో ఈమధ్య ఒకస్టూడెంట్ మేడమీదనుంచి పడ్డాడు. ఎందుకు పడ్డావురా అని అడిగితే భూమ్యాకర్షణవల్ల అని జవాబుచెప్పాడు. అలాఉంది నీ ప్రశ్న"

"ఎలా ప్రశ్నించాలో నాకు తెలియదు"

"చెడుఅంటే అసహ్యాన్నీ, మంచిఅంటే పూజ్యభావాన్నీ కలిగిఉండాలని మనందరికీ తెలుసు. కాని ఏది మంచో, ఏది చెడో తెలుసుకోగలిగినజ్ఞానం మన కింతవరకు రాలేదు."

"చెడు పాపం, మంచి పుణ్యం. అది తెలుసుకోటానికి పెద్ద కష్టం ఏముంది?"

"అక్కడే పొరపాటుపడుతున్నావు వదినా. ఇది మంచీ ఇది చెడూ అని ఇంతవరకు ఎవ్వరూ గ్యారంటీఇవ్వలేదు "

"అందుకని?"

"అందుకనీ, అప్పుడే తీర్పుఇవ్వటం అంత మంచిది కాదు. మరిక నేను వెళ్ళాలి"

"ఉండు, ఒక్కమాట చెప్పి పో. ధర్మసమ్మతమైన స్త్రీపురుష సంబంధం గొప్పదా? హృదయసంబంధి అయిన ప్రేమ గొప్పదా?"

"వదినా!"

"ఏం?"

"అసలు నీకీ సందేహం ఎందుకువచ్చింది?"

"ఊరికే తెలుసుకోవాలనుకుంటున్నాను"

"కాదు, ఏదోఉంది. అది నాకు చెప్పతగినదేఅయితే, చెప్పు. నేను నీ మేనత్తకొడుకునిమాత్రమే కాదు, స్నేహితుడినికూడా" అన్నాడు వెంకటరత్నం. పూర్ణ చాలాసేపు మాట్లాడలేదు. తరువాత "నువ్వు వెళ్ళు, ఆ సంగతి మరో సారి చెప్తాను" అన్నది. వెంకటరత్నం వెళ్ళిపోయినాడు.

ఈ సంభాషణ జరిగినతరువాత పూర్ణఅంటే వెంకట రత్నానికి ఒకవిధమైన ఆకర్షణ ఏర్పడింది. తనకన్న ఆమె కొంచెం పెద్దది. పైగా వితంతువు. ఏవిధంగానూ ఆమెను తను పొందలేడు. ఆ సంగతి తెలిసికూడా ఆతనిమనసు ఆమె వేపే పరుగుపెడుతూ ఉండేది. ఈ సంభాషణజరిగిన మరునాడే బందరురావటంవలన మళ్ళీ పూర్ణని కలవలేదు. ఒకవిధంగా రాజాఅంటే తన కింత ప్రేమఉండటానికి పూర్ణపోలికలు అతి

నిలో ఉండటమే కారణం కాదుగదా అనే ఆలోచన తనకు ఇదివరకే వచ్చింది. ఈ విషయాన్నే రాజా గ్రహించేశాడు కూడా. వరాలు బారినుంచి మేనమామకొడుకుని రక్షించాలని అనుకోవటానికి కొంతకారణంకూడా ఇదే. అలభ్య ప్రేమ అగ్నిలాటిదని అతనికి అనుభవంలోకివచ్చింది. ఆ అగ్నిలో రాజాకూడా పడటం అతనికి ఇష్టంలేదు.

రాజాని చిలకలపూడి వెళ్లవద్దన్నరోజు గడిచిపోయింది. ఇద్దరూ సినిమాకి వెళ్ళారు. ఆ మరునాడు మధ్యాహ్నం తుపానులాగా వరాలు ఆగదిలో ప్రవేశించింది. ఇంకా సొంతం లోపలికిరాకుండానే "ఏమండీ వెంకటరత్నంగారూ, నిన్న రాజాని చిలకలపూడి రాకుండా చేశానని మురిసిపోకండి. అంత నూత్రించేత అయేదేం లేదు" అన్నది.

"అయేదేంలేనప్పుడు తమ రింత వేగంగా యుద్ధానికి ఎందుకొచ్చినట్లో శెలవిస్తారా?" అన్నాడు వెంకటరత్నం.

"ఆ విషయమే తమరికి నివేదించిపోదామని వచ్చాను. రాజా ఇప్పుడు మాఇంట్లోనే ఉన్నాడు. ఈ రాత్రికి రాడు కూడా. బజారుకివెళ్లివస్తానని అతనితో చెప్పి మీకు నా కృతజ్ఞతాభివందనాలు చెప్పుకుపోదామని ఇటు వచ్చాను. వస్తా!" అని ఎలా వచ్చిందో అలా వెళ్ళిపోయింది వరాలు. వెంకటరత్నం తేరుకోటానికి సరిగ్గా అరగంటపట్టింది. ఏమి టీ పిల్ల వాలకం అని తెల్లబోయినాడు.

ఈ అమ్మాయి రాజాని ప్రేమిస్తున్నది ... ప్రేమ ... ఆ మాట అనకతప్పదు మరి ... సరే, బాగానేఉంది. మధ్యలో తనెందుకు దెప్పిపోవటం? ఒకవేళ ఈ పిల్ల తను అనుకున్నంత

దుర్మార్గాలు కాకపోవచ్చును. ఇప్పుడు తను ఓడిపోయినాడు కనుక, ఆ పిల్ల మంచిదేఅని సరిపెట్టుకోటానికి చూడటంలేదు గద. ఇక ఆలోచించబుద్ధిపుట్టలేదు వెంకటరత్నానికి. మొదలకుండా పడుకుని నిద్రపోయినాడు.

వరాలు చెప్పినట్లే మరునాడుఉదయానే రాజా గదికి వచ్చేశాడు. పక్కమీద కూర్చుని రాజాని పరిశీలించటం ప్రారంభించాడు వెంకటరత్నం.

రాజా చాలా అందగాడన్నవిషయం ఈరోజే తను మొదటిసారి కనిపెట్టినట్లనిపించింది. కొద్దిగా నలిగిన అతని సౌందర్యం తనకి మరింత ఆకర్షణీయంగాఉన్నది. రాజా వెంకటరత్నానికేసి చూసి "నువ్వూ, వరాలూ మీ మీ ప్రభావాల్ని నానెత్తిన రుద్దటమేనా? లేకపోతే నేనూ మనిషినే నని ఆత్మఅనేది నాకూ ఉన్నదని గుర్తించటమంటూఉందా?" అన్నాడు. వెంకటరత్నం కొన్నిక్షణాలు నిశ్శబ్దంగాఉండి "నిజంచెప్పాలంటే, నీ ప్రభావం మామీద ఎక్కువగాఉంది" అన్నాడు.

"ఎందుచేత?"

"నీలో సౌందర్యంతోపాటు మరో చిత్రమైన ఆకర్షణ ఉంది"

"రచయితగా మాట్లాడుతున్నావా? బావగా మాట్లాడుతున్నావా?"

"కాసేపు రచయితగానే మాట్లాడతాను ఒక వ్యక్తిపైన మనప్రభావాన్ని ఎప్పుడైతే రుద్దాలనిచూస్తామో, అంతకుముందే ఆ వ్యక్తికి మన ఆత్మ అర్పణమయిఉంటుంది"

"ఉండవచ్చును. కాని, అది నా కిష్టంలేదు. నువ్వు వ్రాసిన నాటకం జీవనస్రవంతిలో కేశవులుకోసం ఒకపాత్ర వ్రాశావు. సరిగ్గా నాటకంరోజున వాడికి జ్వరంవచ్చింది. అప్పు డా వేషం నాచేత వేయించావు గుర్తుందా?"

"అయితేనేం?"

"అప్పుడుకూడా నీ ప్రతిభానానికి లొంగిపోయి, నా కోసం వ్రాయని పాత్ర వేశాను. అప్పటినుంచీ ఇప్పటివరకూ నువ్వు నాచేత అదేపనిచేయిస్తున్నావు" అన్నాడు రాజా. వెంకటరత్నం కొంచెంసేపు మాట్లాడలేదు. తరువాత "ఆకర్షణనించి తప్పించుకోవాలంటే ఒకటేమార్గంరా నాయనా! అది దానికి లొంగిఊరుకోవటం. హృదయం చాలా చిత్రమైనది. ఏదయితే నిషేధమో దానికోసమే వెంపర్లాడుతుంది. నీవు మగవాడివి. నేనూ మగవాడినే. కాని మనిద్దరికీ ఒక ముఖ్యవిషయంలో భేదండున్నది. నీవు స్త్రీని ప్రేమిస్తున్నావు. నేను పురుషుడిని ప్రేమిస్తున్నాను." అన్నాడు.

"కాదు. నువ్వు ప్రేమించినస్త్రీని ఆ పురుషుడిలో చూస్తున్నావు."

"నీకు సమాధానం చెప్పాలనేఉంది. కాని, ఇప్పుడు కాదు. అసలువిషయం చెప్పనీ మరి. నేను కళాజీవిని. రచయితగాని, నటుడుగాని, గాయకుడుగాని, తనలోని ప్రతి భావానికీ ప్రతి రాగానికీ, ప్రతి వేదనకూ రూపాన్ని కల్పించగలిగితే ప్రపంచం ఒక సుందరనందనం అవుతుందని నా ఉద్దేశ్యం."

"ఉద్దేశ్యం బాగానేఉంది. కాని ఆ కళాకారుడు ఆ ఉద్దేశ్యాలని అమల్లోపెట్టేటప్పుడు నాలాటి అమాయకుల్ని ఒకళ్ళిద్దర్ని బలిపెట్టటమే అన్యాయంగాఉంది"

"రాజా!"

ఏమిటి?"

"నువ్విప్పుడు చక్కగా ఆలోచించటంకూడా నేర్చుకున్నావు. ఇక నీ ప్రభావాన్నే మామీద వెయ్యవచ్చును. కాని నే చెప్పేది విను. నువ్వు నన్ను అపార్థంచేసుకోకుండా ఉండాలంటే కొన్నివిషయాలు నీకు విడమర్చి చెప్పాలి."

"చెప్పు"

"రచనతో సరిసమానంగాఉండే మరోకళ సంగీతం. నిజం చెప్పాలంటే, సంగీతానికి భాష అక్కర్లే ఉండదు. రచన అలాకాదు. రూపరహితమైన విచిత్రాలనెన్నో దృశ్యాలకింద మార్చి, నీ కళ్ళముందు నిలబెడుతుంది. రచనకంటే నిజమైన కళ మరోటిలేదు. ఆ రచన నాలో కొద్దిగా ఉందని నీకు తెలుసు"

"నీవు గొప్పరచయితవి"

"ఆ సంగతి నువ్వే ఒప్పుకున్నావు కనుక, ఇక నీ అందం నా రచనమీద ఎలాటిప్రభావాన్ని చూపిందో నాకూ నీకూ కూడా తెలుసు"

"వరాలుకూడా గొప్పనటి"

"అవును. నిత్యజీవితంలో ఎంత బహిరంగప్రకృతో స్టేజిమీద అంత నటి. ఆ విషయం నాకూతెలుసు. సౌందర్యాన్నిచూసి కళాకారుడు యెంత సరదాపడతాడో, కళా

కారుడినిచూసి సౌందర్యం అంత ముచ్చటపడుతుంది. జీవితం లోని మహారహస్యాలలో ఇది ఒకటి''

"ఇంతకూ నువ్వు చెప్పేదేమిటో చెప్పలేదు''

"ఏంచెప్పాలో నాకూ తెలియటంలేదు. ఒకవారం రోజులు శెలవుపెట్టి ఇంటికి పోదాం''

"సరే... బలమైన ఇద్దరుమనుషులు తమఇష్టాఇష్టాల్ని నామీద రుద్దుతున్నారు. మీ ఇద్దర్లో ఎవరుగెలుస్తారో చూడా లని నాకూ ఉంది... రేపు వెడదాం''

"ఈవిషయం వరాలుకి చెప్పొద్దు''

"ఇప్పుడు నాఅంతటనేను చెప్పను. అడిగితేమాత్రం నిజం చెప్పేస్తాను''

"సరే, కానీ''

"ఊరికివెళ్ళటం నాకు మంచిది, నీకు చెడ్డది అప్పుడు నాచేత నీవు చెప్పించుకుంటావు... అంతేకాదు, అందులో నాకేదో ఆనందంకూడా ఉంది''అని వెళ్ళిపోయినాడు రాజా. వెంకటరత్నం నిర్ఘాంతపోయినాడు.

౪

సౌందర్యంకంటె అద్భుతమైనవస్తువు ఇంకోటిలేదు. అన్ని చిత్రాలలోకీ చిత్రమైనది అందం. అలాటి సౌందర్య వంతులైన ముగ్గురువ్యక్తులమధ్య తను ఇరుక్కున్నాడు. ఒకటి: పూర్ణ. ఆమె చంచల చితంతువు; పొందరానిది. రెండు: రాజా... అతను మగవాడు. నిజంచెప్పాలంటే, అతనిలో పూర్ణ కనిపిస్తుంది. అందుకే తనకి వాడంటే మహా ఇష్టం. మూడు:

వరాలు; అందరికంటే చిత్రమైనవ్యక్తి ఈ పిల్ల. అన్నివిధాలా తనతో పోటీచేస్తుంది చాలా చిత్రమైన పాత్రను భగవంతుడు రచించి నటించమని వరాలు కిచ్చాడు. పాత్రపోషణలో ఆమె లోటు ఏమీలేదు. వరాలు తనకి ఇచ్చేతృప్తి మిగతాఇద్దరూ ఇవ్వలేదు. సరిసమానమైన వీరునితో యుద్ధంచేస్తున్నంత ఆనందంగా ఉంటుంది తనకు...అయితే, వరాలూ, తనూ కూడా రాజాని ప్రేమిస్తున్నారు. "ఈ ఆటలో గెలుపెవరిదో తేలకుండానే తాడు తెగిపోయింది." అన్నమాటలు రాజా అంటుండగా విని వెంకటరత్నం ఉలిక్కిపడ్డాడు.

చెరువుగట్టున తాడుతో ఆడుతున్న బృందానికి రాజా లీడరు. అటు ఇద్దరూ, ఇటు ఇద్దరూ లాగుతున్నారు. ఎవరు గెలిచింది తేలకుండానే తాడు తెగిపోయింది. లాగేవాళ్ళు వెనక్కి విసురుకుపడ్డారు. అందరికీ దెబ్బలుతగిలాయి.

"ఏరా, ఏమిటి ఆలోచిస్తున్నావు? పోదాం పద" అన్న రాజామాటలకి ఈ లోకంలోపడ్డాడు వెంకటరత్నం. ఇద్దరూ మెల్లిగా నడకప్రారంభించారు. ఆ కనుచీకటిలో ఎవరో జవ్వని చెరువునుంచి నీళ్ళు తెస్తున్నది కాబోలు. మట్టెలచప్పుడు మత్తుగా వినిపిస్తోంది...బందరునుంచి వచ్చి ఇంకా రెండు రోజులయినా కాకమునుపే, వెంకటరత్నానికి ఎందుకో విసుగనిపించింది. ఆలోచనలోపడి కొంతదూరం పోయినాకగాని, రాజా తనపక్క నడవటంలేదనేవిషయం గమనించలేదు తను. అప్పుడు వెనక్కితిరిగి చూశాడు తను.

ఆ అసురసంధ్యాసమయంలోకూడా ఆ దృశ్యం అతనికి స్పష్టంగా కనిపించింది. రాజా వచ్చి వెంకటరత్నాన్ని కలుసు

కున్నాడు. ఇద్దరూ మళ్ళీ నడకప్రారంభించారు. కొంచెం సేపయినాక ఇక ఉండబట్టలేక "మళ్ళీ ఈ కొత్తఅధ్యాయం ఎప్పుడు ప్రారంభించావు?" అని అడిగాడు వెంకటరత్నం.

"నిన్నటినుంచి" అని చాలా తాపీగా సమాధానం ఇచ్చాడు రాజా.

"ఎవరు?"

"నాకు తెలియదు"

"నేను చెపుతాను"

"చెప్పు"

"కాంభోట్లుగారి మూడవపెళ్లి భార్య"

"శుభం"

ఇక ఆతరువాత ఏవిధమైనసంభాషణా జరుగలేదు. ఇంటికి వెళ్ళేసరికి పెట్రోమాక్స్‌లైట్ వెలిగించి, సావిట్లో తగిలిస్తున్నాడు సింగడు. వాడికీ ఇదివరకంతటి ఓపికలేదు. అయినా, ఏదో ఒకపని చేయటం వాడు మానడు. దక్షిణపు వేపుగదిలో రామమ్మగారు పడుకునుంది. భర్తపోయినాక ఆవిడ ఆ గదివదలి, ఇవతలకే రావటంలేదు. అథవా ఎప్పుడైనా వచ్చినా, వెంటనే వెళ్ళి ఆ మంచంమీద పడుకుని ఇంటికప్పు కేసి చూస్తూ కాలంగడుపుతుంది. ఆవిడ కంటికెదుట ఎప్పుడూ సభారంజనే కనిపిస్తుంది. తను ఉత్తమవంశంలో జన్మించిన స్త్రీ. భర్తనితప్ప మరోవ్యక్తిని కన్నెత్తిచూడని మహా ఇల్లాలు. అయినా, భర్తపోయినతరువాత తను బ్రతికే ఉన్నది. సభారంజని వేశ్య. తనభర్తని ప్రేమించింది. ఆయన ఇంకొంచెం సేపటికి చనిపోతాడనగా తనే ముందు ప్రాణం ఒది

లింది. ఈ ప్రపంచంలో ప్రేమ గొప్పదా? పవిత్రత గొప్పదా? ఈ ప్రశ్న ఆ వృద్ధురాల్ని అనుక్షణం వేధించటం మానలేదు. చిన్నకొడుకు నరహరి అత్తారింట్లో ఉన్నాడు. అయినా వాడి తల్లి తను కాదు, రాజ్యలక్ష్మి. పెద్దకొడుకు ప్రసాదరావు ఒక విచిత్రవ్యక్తి. వాడిగోల వాడిది. ఇక కోడలు రాజ్యలక్ష్మి అన్నివిధాలా తనలాటిదేగాని. తనంత చదువుకున్నది కాదు. అందుచేత కొన్ని తెలివితక్కువలు చేస్తుంది. ఇంకోసంగతి ఏమిటంటే, ఆ ఇంట్లో అడుగుపెట్టిన కోడళ్ళు కొన్ని తెలివి తక్కువలు చేసితీరాల్సిన పరిస్థితిని ఆ ఇంటివాతావారణమే కలిపిస్తుంది.

మనుమలిద్దరూ వచ్చినచప్పుడు విని "నాయనా! వెంకటరత్నం" అని పిలిచింది రామమ్మగారు. ఇద్దరూ వెళ్ళి ఆవిడకు చెరోవైపుగా కూర్చున్నారు. వెంకటరత్నానికి అమ్మమ్మ అంటే అపరిమితమైన అభిమానం. దానికి కారణం ఆవిడ బాగా పండితురాలుకావటం. అత్యంత ఆధునికులు అనుకుంటున్నవారిలోకూడా ఆవిడకున్నంత సంస్కారం ఎవ రికీ ఉండదు. ఆ సంగతి వెంకటరత్నానికి తెలుసు.

"ఏం అమ్మమ్మా, 'దేనికి పిలిచావు?" అని అడిగాడు.

"ఏంలేదు నాయనా, కాసేపు కూర్చునిపోతారని" అన్నది రామమ్మగారు. రాజా బుంగమూతిపెట్టి

"పో నాయనమ్మా, నీతో నేను మాట్లాడను. నువ్వు నన్ను పిలవలేదుగా. నీకు వాడంటేనే ప్రేమ" అన్నాడు.

వార్ధక్యం ఇల్లుకట్టిన ఆవిడముఖంమీద చిరునవ్వు ఒకటి పూరిగుడిసెలో పెట్రోమాక్స్ లైట్‌లా జిగేలుమంది. రాజా వీపుమీద చెయ్యివేసి "మా నాయన చిక్కాడు" అన్నది.

"ఈమధ్య కొంత రీసెర్చిచేస్తున్నాడులే" అని ఆవిడకి జవాబుచెప్పి, రాజావంక చూసి కొంటెగా నవ్వాడు వెంకటరత్నం. రామమ్మగారు అదిగ్రహించి ప్రశ్నార్థకంగా రాజా మొహంవంక చూసింది.

"ఏంలేదు నాయనమ్మా, వాడూ రీసెర్చి చేస్తున్నాడు కాని, నాఅంత చెయ్యటంలేదు. అందుకని వాడు బాగానే ఉన్నాడు. నేనే చిక్కాను" అని జవాబుచెప్తూ, ఓరగా వెంకటరత్నంవంక చూశాడు రాజా.

వీళ్ళిద్దరూ అర్థయుక్తంగా మాట్లాడుతున్నారనీ, అందులో ఏదో ఉన్నదనీ తెలుసుకోలేనంత అజ్ఞానురాలు కాదావిడ. అయినా వాళ్ళని అడగలేదు. వాళ్ళది యవ్వనం. వాళ్ళు జీవించే మహత్తరసమయం ఇదే. యవ్వనం ఎంతో కాలం ఉండదు. అతి మామూలుగాఉండే గడ్డిపూలుకూడా తిరిగి వికసిస్తాయి. అందమైన సూర్యోదయం మళ్ళీమళ్ళీ అవుతూ నేఉంటుంది. కాని యౌవనంమాత్రం ఒకసారి ముడుచుకు పోయిన తరువాత తిరిగి వికసించదు. రానురాను అన్నీ నశిస్తాయి. ఈ ఆకర్షణ ఈ అందం అన్నీ పోతాయి. యవ్వనంలోని ఆనందాలతాలూకు నీడలు వార్ధక్యంలో మనల్ని భయపెడతాయి. మిగిలేదీ ఉండదు, రామమ్మగారికళ్ళల్లో నీరుతిరిగింది.

ఇంతలోకే నాయనమ్మకి జావతీసుకుని ఆగదిలో ప్రవేశించింది పూర్ణ. అదిచూసి వెంకటరత్నం లేచిపోయినాడు. దానికి కారణం గ్రహించినవాళ్ళు పూర్ణ, రాజా మాత్రమే కాదు, మహోన్నతురాలైన ఆ వృద్ధురాలుకూడాను.

ఆ కనుచీకటిలో ఉత్తరపువేపువసారాలో ఒంటరిగా నిల్చుని, ఆలోచిస్తున్న వెంకటరత్నందగ్గరికి రాజా వెళ్ళి భుజంమీద చెయ్యివేసి "పద భోజనంచేద్దాం" అన్నాడు.

"రాజా!"

"ఏమిటి?"

"ఒక చిన్న గరికపోచ ప్రాణంపోసుకోవాలన్నా భూమి ప్రసవవేదనపడుతుంది. ఒక చక్కనిభావం బయటికిరావాలంటే రచయితకూడా అంతే బాధపడతాడు."

"బాగుంది. ఇప్పుడు నీలో మొలకెత్తిన ఆ మహోత్తమభావం ఏమిటో కొంచెం నాచెవినకూడా వెయ్యి మరి"

"అలా వెక్కిరించకు. ఒకభావానికి రెక్కలుకట్టి ఆకాశంలోకి ఎగురవేయవచ్చును. ఇప్పుడు నా కేమనిపిస్తోందో తెలుసా? అమ్మమ్మలాగా పూర్ణకూడా కొన్నాళ్ళకి వృద్ధురాలై పోతుంది!"

"ఒరే అబ్బాయ్, ఎకౌంట్ లేదనుకున్నప్పుడు ప్రతివాడూ చెక్కులు భారీగా ఇచ్చేస్తాడు. చివరకి ఈ దిక్కుమాలిన ప్రపంచంలో రచయితకూడా మారనిచెక్కులలాటి అబద్ధాలు లోకంమీద రుద్ది, తాను గొప్పవాడి ననుకుంటున్నాడు."

"అంటే నా ఉద్దేశ్యం సరిగా లేదంటావా?"

"సరిగా లేదని ఎలా అంటాను? పూర్ణకూడా నాయనమ్మ లాగా ముసలిదిఅయిపోతుందన్న మహాసత్యాన్ని మీబోటి మహారచయితలు తప్ప మాబోటివాళ్ళం చచ్చినా కనిపెట్ట లేం" అన్నాడు వ్యంగ్యంగా రాజా.

"అదికాదు, ఆ విషయం తలుచుకుంటే, నాకెందుకో బాధగా ఉంది. వార్థక్యం యెంత వికృతమైనది!"

"ప్రేమ అనేవిషయం బుర్రలో దూరినప్పుడు ఇలాటి అర్థంలేని ఆలోచనలన్నీ వస్తాయి. ఒరేయ్, నేనొకటి చెపుతా విను. జీవితంలో అలసిపోయినప్పుడు ప్రేమించటం ప్రారం భించాలి. అథవా, అలా ప్రేమించినప్పుడుకూడా వివాహంతో దాన్ని అంతంచేయడం హత్యచేసినంత మహాపాపం!"

"నీవు పెళ్ళిని నమ్మవా?" అన్నాడు వెంకటరత్నం.

"నమ్మటంలేదు, నమ్మకపోవటంలేదు. అదంతా మనం బ్రతుకుతున్న సంఘానికి సంబంధించినవిషయం. మనకు సంబంధించినవిషయాలు ఇంకా వేరేఉన్నాయి."

"అంటే?"

"సృష్టిలో ఆడజాతి కేవలం విలాసార్థం ఏర్పడిందని కొందరంటారు. ఇంకా ఆవిషయంలో నాకే అభిప్రాయమూ లేదుగాని, స్త్రీమాత్రం షాంపేన్‌లాటి మత్తుపదార్థం అని తెలుసును. నైగా స్త్రీని నేను ఆరాధిస్తాను"

"అలాటప్పుడు స్త్రీలేకుండా ఎలా? పెళ్ళిచేసుకుని తీరాలి".

"స్త్రీలేకుండా ఎలా? అనేప్రశ్న నాకు లేదు. ఇక పెళ్లి అంటావ్? అది అమ్మకీ నాన్నగారికీ సంఘానికీ సంబంధించిన విషయం" అన్నాడు రాజా.

వెంకటరత్నం నిట్టూర్చి "నీకూ నాకూ కొన్ని అభిప్రాయాలు ఉండటం నాకిష్టమేకాని, అవి వికృతమైనవి మాత్రం కాకుండా చూసుకో" అన్నాడు.

"చివరకి ఎంత తిరుగుబాటుదారుడు అయినా, రచయితఅనేవాడు నీతిసూత్రాలు వల్లిస్తూనేఉంటాడు. అవునులే, నాలుగుకాలాలపాటు నిలవాలనుకున్నప్పుడు నిజంచెప్పేకన్న, అబద్ధంఆడటమే మంచిది" అని నాలికకొరుక్కున్నాడు రాజా. వెంకటరత్నం అయిదారునిముషాలు మాట్లాడలేదు. చివరకి తనలోతాను మాట్లాడుకుంటున్నట్లు...

"అప్పుడప్పుడు స్త్రీ పురుషుడిని సంస్కరిస్తూ ఉంటుంది. అది వాడి ఉద్దేశ్యాలకి ఒంకరటింకరముస్తులు తొడగటం" అన్నాడు. రాజా పకపక నవ్వుతూ.

"ఆ పని వరాలుచేసిందంటావు. ఆ విషయం నేను ఒప్పుకోను. వరాలుతో నా స్నేహం సుఖాంతనాటకంలో ఆఖరిఅంకంలాంటిది"

"అది విషాదాంతనాటకంలో మొదటిరంగంలా నాకు కనిపిస్తోంది" అన్నాడు వెంకటరత్నం.

"ఇప్పుడు విషయం నీది; నాదీ వరాలుదీ కాదు" అని జ్ఞాపకంచేశాడు రాజా.

"మామూలుగా బ్రతుకులోజరిగే విషాదాలు చాలా అసహ్యంగా కళా కాంతీ లేకుండాఉంటాయి. అందుకే అవి మనల్ని నాటకంలో విషాదాలలాగా ఆకర్షించలేవు. ఎంత వెదికినా, వాటికొక సమాధానమూ కనిపించదు. ఎందువల్లనో మనల్ని అవి బాధిస్తాయి. అందుకే వాటిని మనం అసహ్యించు

కుంటాం. కాని అప్పుడప్పుడు జీవితంలోకూడా కళాత్మకమైన విషాదం ఎదురవుతుంది. అప్పు డది మనలో రసజ్ఞతకి మూలం అవుతుంది. ఒక గొప్పనటుడు నటిస్తున్న నాటకాన్నిచూసి నట్లు మనని మనమే పరీక్షచేసుకుంటాం'' అన్నాడు వెంకట రత్నం.

“మరి నీతోపాటు నటించే ఆ నటి అలాటిది కాకపో వచ్చును. ఎప్పుడయితే ఆడది వచ్చి, నిన్ను ప్రపంచంలో అందరికన్న ఎక్కువగా ప్రేమిస్తున్నాను, నా సర్వస్వం నువ్వే అంటుందో, ఆ క్షణం ఆ మగవాడిజీవితంలో మహా భయం కరమైనది'' అన్నాడు రాజా.

“నువ్వుచెప్పినదానితో నేను ఏకీభవించను. కాని, ఒక విషయంమాత్రం నిజం. జీవననాటకంలో తెర ఎప్పుడుపడిందో చూసుకోకుండా ఆఖరిరంగం ఇంకా పూర్తికాలేదు అనే భ్రమలోపడి బ్రతుకుతారు'' అన్నాడు వెంకటరత్నం. రాజా పకపకా నవ్వి “నాటకాన్ని వాళ్ళఇష్టప్రకారం నడిపితే ఎలా ఉంటుంది?'' అన్నాడు.

“ప్రతి మంచినాటకం చెడ్డనాటకం అవుతుంది. ప్రతి చెడ్డనాటకం హాస్యరసంతో నిండుతుంది. హీరో ఎవరో విలన్ ఎవరో అర్థంకాదు'' అన్నాడు వెంకటరత్నం.

“స్త్రీమీద ఇంత మహత్తరమైన అభిప్రాయం ఉంచు కుని ఇందాక వాళ్ళని వెనకేసుకొచ్చావేం?'' అని ప్రశ్నిం చాడు రాజా.

“పసిపిల్లలంటేకూడా నా కిష్టమే'' అని జవాబిచ్చాడు వెంకటరత్నం.

ఇందాకటినుంచీ కిటికీనీడలో నిలబడి, వీళ్ళసంభాషణా వింటున్న పూర్ణ ఇక చాటున నిలబడలేకపోయింది. ఎదురుగా వచ్చి నిలబడిన పూర్ణని చూసి ఇద్దరూ ఉలిక్కిపడ్డారు.

"భేష్. ఇందాకటినుంచీ మా సంభాషణ వింటూనే ఉన్నావా అక్కయ్యా?" అన్నాడు రాజా.

"విన్నాను. వెంకటరత్నం! నా దొక చిన్న మనవి. అసలు బ్రతుకే ఒక పెద్దకళ. ఈ మహాకళకి మిగతా అన్నికళలూ అవయవాలు ఈ కళలో మీతోపాటు నటిస్తున్న ఆడదాన్ని మీరు ఏనాటికీ అర్థంచేసుకోలేరు. సామాన్యంగా ప్రతీ మగవాడికంటికీ స్త్రీ దేవతగానో, రాక్షసిగానో, కనిపిస్తుందిగాని, తనతోపాటు ఊపిరిపీల్చి జీవిస్తున్న తోటి ప్రాణిగా ఏనాడూ కనిపించదు. అలాగే స్త్రీకూడా. ఆమె జీవననాటకంలో హీరో ఎవరో విలన్ ఎవరో ఆమెకీ లోకానికీ కూడా తెలియకముందే ఆఖరిరంగం అయిపోయి, తెరపడిపోతుంది" అన్నది పూర్ణ.

రాజా ఆశ్చర్యపోయి "మాట్లాడేది అక్కయ్యేనా?" అన్నాడు.

"ఏం ఆశ్చర్యంగా ఉందా?" అన్నది పూర్ణ.

"ఆశ్చర్యంగానే ఉంది గాని, నువ్వు చెప్పింది నాకేం బోధపడలేదు. తెలుగునవల చదివినంత గందరగోళంగా ఉంది" అన్నాడు రాజా.

"స్త్రీలు తమ సర్వస్వాన్ని పురుషులకి అర్పిస్తారు. అదే వాళ్ళపొరపాటు" అన్నది పూర్ణ.

"వరాలులాటివాళ్ళయితే వాయిదాలపద్ధతిమీద తిరిగి ఇమ్మంటారు" అని నాలుకకరుచుకొన్నాడు రాజా. పూర్ణ ఆ విషయం గ్రహించింది కాని ఎవరని ప్రశ్నించలేదు.

"ఇప్పుడు నేను ఉన్నాను. నాహృదయం నా తమ్ము డికికూడా తెలియదు" అన్నది. ఆమెమాట పూర్తికాకుండానే రాజా అందుకుని

"ఈ దిక్కుమాలిన భారతదేశంలో స్త్రీహృదయంలో ఏముందో ఎవరికీ తెలియదు" అన్నాడు.

"వరాలులాటివాళ్ళహృదయంలో ఏముందో క్లోజ్ షాట్‌లో చూడవచ్చును. ఎటొచ్చీ మీ అక్కయ్యలాటి స్త్రీలమనసులో ఏముందో ఎవరికీ తెలియదు" అని జవా బిచ్చాడు ఒళ్ళుమండిన వెంకటరత్నం. రాజా మాట్లాడ కుండా అక్కడనుంచి వెళ్ళిపోయినాడు.

ఓ అయిదునిముషాలసేపు నిశ్శబ్దంతాలూకు అడుగుల చప్పుడుతప్ప మరోశబ్దంలేదు. తరువాత ఆ నిశ్శబ్దాన్ని భంగ పరుస్తూ "నామాటలకి నీకు కోపంవచ్చిం దనుకుంటాను; అవునా ఒదినా?" అన్నాడు వెంకటరత్నం.

"కోపం రాలేదుకాని, ఆలోచిస్తున్నాను. నిజంగా స్త్రీ జీవననాటికలో ఆఖరిరంగం ఎప్పుడయిపోయిందీ తెలు సుకోలేదా?" అన్నది పూర్ణ.

"నే నన్నమాటల్లో అర్థం వెతకాలని ప్రయత్నించ టంకాని, లేక ఆ మాటలన్నీ నేను నమ్మి అంటున్నానని భ్రమించటంగాని, ఉత్త తెలివితక్కువ. నిజంచెప్పాలంటే, ఏ మనిషీకూడా, చెప్పేవన్నీ ఇతరులకోసమే చెప్పి, తను

మామూలుగానే నడుచుకుంటూఉంటాడు. ఈకళ రచయితలో కాస్త మోతాదుకి మించిఉంటుంది" అని జవాబిచ్చాడు వెంకటరత్నం.

కొన్నిక్షణాలతరువాత వెంకటరత్నం చెయ్యి తనచేతిలోకి తీసుకుని—

"గుర్తుందా? కిందటిసారి నువ్వు ఒకమాట అన్నావు. నేను మేనత్తకొడుకునిమాత్రమే కాదు. స్నేహితుడినికూడా అని" అన్నది పూర్ణ. తల ఆడించాడు వెంకటరత్నం.

"నీవు సుందరిని పెళ్ళిచేసుకోవాలి" అన్నది పూర్ణ. వెంకటరత్నం ఆశ్చర్యపోయినాడు. కొంచెంసేపు ఆగిన తరువాత

"నే నావిషయం ఆలోచించలేదు. అయినా దేని కిప్పుడు?" అన్నాడు.

వెంకటరత్నంచేయి మరింతగట్టిగా పట్టుకుంది పూర్ణ.

"నన్ను అర్థంచేసుకో. అంతకన్న నీ కింకేమీ చెప్పలేను" అన్నది.

"అర్థంఅయింది. కాని అది చాలా ఘోరమైన విషయం"

"కావచ్చును. అయినా, నిన్ను ప్రార్థిస్తున్నాను" అన్నది పూర్ణ.

"నీ విలా మాట్లాడటం నాకేం బాగాలేదు. రెండర్థాల మాటలతో జీవితాన్ని నిర్ణయించుకోటం శుద్ధ తెలివితక్కువ. నీవు స్పష్టంగా మాట్లాడటం చాలామంచిది" అన్నాడు వెంకటరత్నం.

పూర్ణ కొంచెంసేపు మాట్లాడలేదు. తరువాత అతని చెయ్యి వదిలేసి "అలా మాట్లాడగలిగినరోజునే విషయం చెప్తాను" అని వెళ్లిపోయింది.

౫

రాజ్యలక్ష్మి వడ్డిస్తుండగా ప్రసాదరావుగారూ, రాజా, వెంకటరత్నం భోజనంచేస్తున్నారు. భోజనాలగది చాలా విశాలమైనది. ఆ ఇంట్లోనే ఒకపక్కగా కూర్చుని వైదేహమ్మగారు పిండి తింటున్నది. రాజాకి తండ్రిఅంటే భయం. ఆయనముందు ఆట్టే మాట్లాడడు. కాని వెంకటరత్నానికి మాత్రం మేనమామఅంటే గౌరవంతోపాటు చనవుకూడా ఉంది. ఆయన మౌనంలో ఎంత భావౌన్నత్యం ఉన్నదీ, ఆయన గంభీరాకృతిలో ఉన్న హృదయానికి ఎంత లాలిత్యం ఉన్నదీ వెంకటరత్నానికొక్కడికే తెలుసు. ప్రసాదరావుగారుకూడా మేనల్లుడితో మాట్లాడినట్లుకాక స్నేహితుడితో మాట్లాడినట్లు మాట్లాడతారు. మేనమామా మేనల్లుళ్ళ ఈ స్నేహం ఒక్క రాజ్యలక్ష్మికితప్ప మరెవళ్ళకీ తెలియదు. వెంకటరత్నంఅంటే ఆవిడకికూడా చాలా ప్రేమ. కాని విషయం పైకి వ్యక్తీకరించటం ఆవిడకి ఇష్టంలేదు.

"ఆవకాయ నూనెతోసహా పట్రావమ్మా అత్తయ్యా" అన్నాడు వెంకటరత్నం.

"వేడిచేస్తుందిరా. ఇన్నికూరలుంటే, ఆవకా యెందుకు!" అన్నది పిండితింటున్న వైదేహమ్మగారు.

"పోనీ, కనీసం నీ ఉప్పుడుపిండిఅయినా ఇలా నా మొహాన వెయ్యి తాతమ్మా" అని వెంకటరత్నం అన్న మాటకి అందరూ నవ్వారు.

వేడివేడిఅన్నంలో ఆవకాయ కలుపుకుంటూ విలాసంగా రాజ్యలక్ష్మివంక ఒకచూపు విసిరి "మేనల్లుడిధర్మమా అంటూ ఇవ్వాళ నాకూడా ఆవకాయ దొరికింది"అన్నారు ప్రసాదరావుగారు. అదిచూసిన వెంకటరత్నం "నీకు నాటకాలంటే ఇష్టమేనా మామయ్యా?" అని అడిగాడు.

"ఒకప్పుడు నాకు జీవితంలో అంతకంటే పెద్దకోరిక మరోటి ఉండేదికాదు. ఎందుకూ?"అన్నారు ప్రసాదరావుగారు

"ఇప్పుడు నువ్వు అత్తయ్యవంక చూశావే చూపు, అది స్టేజిమీదకనుక హీరోయిన్‌వంక చూస్తే, ఓ! బ్రహ్మాండం" అన్నాడు వెంకటరత్నం. అంతా ఒక్కసారి నవ్వారు. రాజ్యలక్ష్మికూడా నవ్వుతూ

"నేను కాపురానికి వచ్చినదగ్గరనుంచీ అలాటిచూపు ఆవకాయవేసినప్పుడల్లా చూస్తూనేఉన్నారు" అన్నది.

"చచ్చాం... అంటే నీ ఉద్దేశ్యం ఆ చూపు కేవలం ఆవకాయినేననీ, అందులో నీకు సంబంధించినది యత్కించిత్ లేదనీ! అంతేగా?" అన్నాడు వెంకటరత్నం ఆశ్చర్యపడిపోతూ.

"అంతేరా. అంత చక్కనిభావాన్ని ఆడదానిమీదకన్న ఆవకాయమీద వెలిబుచ్చటమే మహోత్తమమయిన పని" అన్నారు ప్రసాదరావుగారు.

"స్త్రీ అంటే నీకున్న గౌరవానికి ధన్యవాదాలు మామయ్యా" అని నవ్వాడు వెంకటరత్నం. ఇందాకటినుంచీ పిండి తింటూ సంభాషణవింటున్న వైదేహమ్మగారికి చిత్రెత్తుకు వచ్చింది.

"ఏడిచావు ఏడిచావని" అని కొంచు తిట్టి వెళ్ళిపోయింది ఆవిడ. వెంకటరత్నం పక్కనున్న మేనమామవైపు ఒరిగి "చూశావా మామయ్యా! తాతమ్మలో స్త్రీత్వంకూడా కదిలించేశాను" అన్నాడు. ప్రసాదరావుగారు నవ్వుతూ

"స్త్రీత్వాన్ని కదిలించటానికి అట్టె తెలివి తేటలక్కర లేదురా! దూదిపింజ చిరుగాలికే ఎగిరిపోతుంది" అన్నారు.

"మీ అబ్బాయికి నీ పోలికే వచ్చింది" అని రాజా వంక చూశాడు వెంకటరత్నం. అంతవరకూ ఒక్కమాట కూడా మాట్లాడలేదు. రాజా ఇప్పుడిక తప్పనిసరిఅయి పక్కకితిరిగి నవ్వాడు.

"అంటే" అని మరోప్రశ్న వేసిన ప్రసాదరావుగారికి సమాధానంగా

"ఏంలేదు నాన్నగారూ, మీ అభిప్రాయాలూ నా అభిప్రాయాలూ ఒకటేనని బావ అంటూఉంటాడు" అని రాజా సమాధానం చెప్పాడు.

"ఇందులో ఆశ్చర్యపడవలసిందేముంది?" అన్నారు ప్రసాదరావుగారు. మీగడ పెరుగు వడ్డిస్తున్న రాజ్యలక్ష్మి భర్తప్రశ్నకి తలెత్తిచూసి

"అందులో ఆశ్చర్యపడవలసింది ఏంలేదు నిజమే. మరి నాలాంటిభార్య వాడికీ దొరకాలిగా" అన్నది.

"అవును మామయ్యా, అత్తయ్య చెప్పింది కరెక్టే" అన్నాడు చెయ్యికడుక్కుంటూ వెంకటరత్నం.

భోజనాలయినాక, మేనమామా మేనల్లుడూ పక్క గొడ్లో పడకకుర్చీల్లో కూర్చున్నారు. ప్రసాదరావుగారు ఒక ఏలక్కాయవల్చి నోట్లోవేసుకుంటూ "మీ రచయితలు అన బడే దద్దమ్మలంతా స్త్రీలంటే పక్షపాతంఉన్నట్లు నటించటం చాలా అవసరంలాగుంది. అంతేనా?" అన్నారు.

"ఉత్త నటిస్తే చాలదు. నటిస్తున్నట్లు పైకి తెలియకుండా నటించాలి. అప్పుడే వాడు సక్సెస్ అవుతాడు" అన్నాడు వెంకటరత్నం. వీళ్ళిద్దరూ మాట్లాడుతూఉండగానే రాజ్యలక్ష్మి మరచెంబుతో మంచినీళ్ళు తెచ్చి, అక్కడపెట్టింది. అదిచూసి "మరి నే వస్తా మామయ్యా" అని లేచిపోయినాడు వెంకటరత్నం.

ఉత్తరపువేపు వసారాలో రెండుమంచాలువేసి పక్కలు వేస్తున్నది పూర్ణ. ఒకటి రాజాకి, రెండోది వెంకటరత్నానికీను "ఇదేమిటి ఒదినా, సింగడేమయినాడు? నువ్వేస్తున్నావేం?" అని ఆశ్చర్యంగా అడిగాడు అప్పుడే ప్రవేశించిన వెంకటరత్నం. పూర్ణ మాట్లాడలేదు. పుచ్చపూలతోరణాల లాగా వెన్నెలకాస్తున్నది. ఆ వెన్నెలలో ఆకాశంకేసి చూస్తుంటే విరిగినపాలకుండ జ్ఞాపకంవస్తున్నది. నిశ్శబ్దంగా ఉన్న ఆ ఉత్తరపువేపువసారాలో ఒంటిగా నిలబడ్డ ఆ యువతీ యువకులు కొంచెంసేపు ఏంమాట్లాడుకోవాలో తెలియని అయోమయస్థితిలో పడ్డారు. కొంచెంసేపయినాక "శ్యామ్ప్ర

వదినా" అన్నాడు వెంకటరత్నం. పూర్ణ రాజామంచంమీద కూర్చున్నది.

"సాధారణస్త్రీలు నా మనస్సుని ఆకర్షించలేరు. ఎందుకంటే వాళ్ళల్లో రహస్యంగాని, విచిత్రంగాని ఏమీ ఉండదు" అన్నాడు వెంకటరత్నం.

"బాగుంది" అన్నది పూర్ణ.

"ఈ ప్రపంచం అంతా చాలా వింతగా ఉంటుంది. హృదయానికీ తెలివి తేటలకీ లంగరందించటం చాలా కష్టం. ఈ రెండిటి సంయోగ వియోగా లేక్షణంలో జరుగుతాయో కూడా అర్థంకాదు. కాని అది పరిశీలించటంలోనే ఆనందం ఉంది" అన్నాడు వెంకటరత్నం. అతనికి తెలుసు తను చెప్పిన ఈ మాటలే ఆ అప్పాతమ్ముళ్ళ హృదయాల్లో ఆలోచనా శక్తిని రేకెత్తించాయని.

వాళ్ళ జీవనసౌధనిర్మాణం ఇంకా పూర్తికాకముందే ఆ సౌధప్రాంగణంలో ఒక మనోహరమయిన పూలతోట నాటాడు. ఆ పూలతోటలో మందారమొక్కలతోపాటు బ్రహ్మదండి మొక్కలుకూడా నాటటం తప్పనిసరిఅయింది. అయితే వాళ్ళిద్దరికీ ఆ బ్రహ్మదండి మొక్కలే ఎక్కువగా నచ్చటం మొదలుపెట్టినయ్.

"మాట్లాడటం ఆపేశావేం!" అన్నది పూర్ణ.

"నీకు విసుగ్గా ఉందేమోనని" అన్నాడు అతను.

"నువ్వు మాట్లాడుతుంటే సంగీతం వింటున్నట్లుంది. ఇంకేమైనా చెప్పు" అన్నది పూర్ణ.

"రచయిత ఉత్త దౌర్భాగ్యుడు వదినా. తనలోని అందాన్నంతా తనమాటల్లోకి తోడేసి, చివరకి తనకి మిగిలేదేమీ లేకుండా చేసుకుంటాడు. ప్రపంచంలో అందరికంటే ఆకర్షణీయంగా కనిపించే పనికిరాని వస్తువు ఒక్క రచయిత మాత్రమే."

"ఆవిషయం నేను ఒప్పుకోను వెంకటరత్నం. సుఖదుఃఖాల రైలుచక్రాలలోపడి నుజ్జునుజ్జు అయిపోతున్న జీవితాన్ని, దానిలో నిమగ్నమైన కాలకూటవిషాన్ని అర్థం చేసుకోవాలంటే ఒక రచయితద్వారానే అది సాధ్యం.

"నిజమేనేమో! రచయితలో యౌవనంతాలూకు ఉజ్వలరక్తిమ అతన్ని విడిచిపెట్టదు. అతని వ్యక్తిగత జీవితం ఎలా అంతమయినా లోకానికిమాత్రం అతని అనుభవాలు మందారపూలలాగా కనిపిస్తాయ్."

"లోకాన్ని తనలో ప్రతిఫలింపచేసుకొనే మహాదర్పణానికి కొన్ని మచ్చలు ఉన్నా మరేం మునిగిపోదు" అన్నది పూర్ణ.

"నా రచయితలమీద నీకున్న అభిమానానికి నేను గర్విస్తున్నాను. నీకు నిద్రవేళయిందేమో?"

"తమ్ముడింకా రాలేదు. నిద్రపోతే వాడికి తలుపు తీసేవాళ్లుండరు...... ఏం? నే నిక్కడ కూర్చోటం నీ కిష్టం లేదా?"

"నువ్వు అలా అంటే నేను ఒప్పుకోను. మనల్నిమనం భ్రమపెట్టుకోటంలో ప్రారంభమయిన ప్రేమ, ఇతర్ల

భ్రమపెట్టటంతో అంతంఅవుతుంది. అలాటప్పుడు నువ్వు ఇక్కడ కూర్చోటం నాకు పూర్తిగా ఇష్టం."

"వెంకటరత్నం!"

"ఏం వదినా?"

"అంటే ఇప్పుడు మనల్ని మనం భ్రమపెట్టుకుంటు న్నామన్నమాట; అంతేనా?"

"ఆమాట కింకా ఆలోచించాలి."

"తమ్ముడిసంగతి నీతో మాట్లాడాలి... ఇంతకూ ఆ వరా లెవరు?" అని మాట మార్చేసింది పూర్ణ. వెంకట రత్నం కొంచెంసేపు మాట్లాడలేదు. తరువాత "నీకన్న విచి త్రమైనపిల్ల" అన్నాడు.

"నేను విచిత్రమైన పిల్లనా?"

"అందంలోకూడా మీ ఇద్దరూ సమానమే ... కాని నీ అందం చల్లనిది" అన్నాడు వెంకటరత్నం.

"ఇంతకూ అసలుసంగతి ఏమిటి?"

"అసలుసంగతి కేముంది? వాళ్ళిద్దరూ స్నేహితులు."

"మీ ఇద్దరూ కారా?"

"అసూయా?"

"నా మొహానికితోడు అసూయకూడాను! ఇంతకీ అ దెలాంటి స్నేహం?"

"నీ తమ్ముడు స్నేహం ఎప్పుడూ ఒకమాదిరిగానే చేస్తాడు. ఎవరికి చేసినా, ఎలాచేసినా అది ఒకటే?"

"అంటే నా కర్థంకాలేదు".

"కాంభోట్లుగారి మూడోభార్యతో స్నేహంచేసినా దివ్యసుందరి వరాలుతో చేసినా, ఆ స్నేహానికి వాడు కోరే ఫలితం ఒక్కటే"

పూర్ణ తెల్లబోయింది. "ఆవిషయం ఈ పల్లెటూళ్ళో బయటపడిందంటే కొంపమునిగిపోతుంది. నాన్నగారి పరువు ప్రతిష్ట లేంకావాలి?" అన్నది కొంచెం ఆగి.

"పరువుప్రతిష్ట లేమీకావు. ఎక్కడివి అక్కడే ఉంటాయి. కాకపోతే ఇంకా రాలేదేమిటా అని చూస్తు న్నాను" అన్నాడు వెంకటరత్నం.

పూర్ణ మాట్లాడలేదు. ఎప్పుడో వెంకటరత్నం అన్న ఒక మాట గుర్తుకి వచ్చింది. అతనొక విచిత్రమైన సౌందర్య పరిశంస తీసుకొనివచ్చాడు. దానికి తన అందమే ఆధారమని కూడా అన్నాడు. వెనువెంటనే భయంకరమైన మరో సిద్ధాం తాన్ని ప్రతిపాదించాడు – యవ్వనం చాలా అశాశ్వతమైన దని!......అతని హెచ్చరిక ఆమెను భయపెట్టింది. అవును, అతను చెప్పింది నిజమే, తన ముఖం ముడతెలుపడుతుంది; తనకళ్ళు దించుకుపోతాయి; తన రక్తం ఇంకిపోతుంది; అచ్చ వై దేహమ్మ బామ్మలాగా తనూ అర్థంలేనిబ్రతుకు బ్రతకాలి.

ఈ ఆలోచనవచ్చేసరికి తన గుండెలమీద ఎవరో ఇనుపపాదాలతో నడచినట్లనిపించింది ఆమెకి. తన యౌవనా నికిమాత్రం సార్థక్యం ఏముంది? తలయెత్తి వెంకటరత్నం వంక చూసింది పూర్ణ. అర్ధరాత్రి కావస్తోంది. ఇంట్లో ఎక్కడివాళ్ళక్కడ నిద్రపోయినారు. నారింజచెట్టు ఆకు

ల్లోంచి చంద్రికిరణాలు వాళ్ళిద్దరిమీదా పడుతున్నాయ్. ఇద్దరి మనసుల్లోనూ అవ్యక్తమైన వేదన ఏదో ప్రారంభ మయింది.

వెంకటరత్నం చాలా సంస్కారం ఉన్నవాడు. మాట లలో ఎంత విశృంఖలంగా ఉంటాడో, చేతల్లో అంత నిగ్రహము ఉన్నవాడు. రాజా సరిగ్గా దీనికి వ్యతిరిక్తం. రాజా చేసేపనులు వెంకటరత్నం చేస్తాడని లోకం అనుకోవడానికి చాలా అవకాశం ఉంది.

"చాలా పొద్దుపోయింది. రాజా వస్తే నేను తలుపు తీస్తాను నువ్వు వెళ్ళి పడుకోరాదూ?" అన్నాడు. పూర్ణ సమాధానం చెప్పలేదు. రాజాకి తలుపుతీయటం అనేది ఒక వంకేనని వెంకటరత్నానికీ తెలుసు.

"సరేకాని సుందరిని పెళ్లిచేసుకోమని ఎందుకు అడిగావు?" అని మరోప్రశ్న వేశాడు.

"నీవు పరాయివాడివికాకుండా ఉంటావనీ"

"సుందరిభర్తనయితే పరాయివాడిని కానా?"

"కావని నేను అనుకుంటున్నాను."

"అదంతా నీ భ్రమ ఒదినా. నే నెవరిని చేసుకున్నా పరాయివాడిని అవుతాను. నిజం చెప్పాలంటే. ఎవరిని చేసుకున్నా నీకు పరాయివాడిని కాను."

"వెంకటరత్నం!"

"ఏం ఒదినా?"

"ఈ అభాగ్యురాలిమీద నీ కింత ప్రేమ ఎందుకు?"

"ప్రతిస్పందనే కారణం"

"సాహసించి ఇంకో ప్రశ్న అడుగుతాను, నన్ను క్షమిస్తావా?"

"తప్పకుండా."

"నువ్వు చెప్పిన ఆ ప్రతిస్పందన అనేది దైహికంగా ఉండదా?"

ఈ ప్రశ్న వస్తుందని వెంకటరత్నం ముందుగానే ఊహించాడు. అయినా సమాధానం చెప్పటానికి కొంత సేపు పట్టింది.

"నువ్వు చాలా సాహసురాలివి వదినా! మీ అక్కా తమ్ముళ్ళ విచిత్ర ప్రకృతులే నాకు చాలా ఇష్టం .... సరే, అదలా ఉంచు. నీ ప్రశ్న ఏమిటి? ప్రతిస్పందన అనేది దైహికంగా ఉండదా అనేకదూ?"

"అవును"

"నిజం చెప్పాలంటే ప్రతిస్పందించటం అనేగుణం దేహానికే ఎక్కువగా ఉంటుంది.... కాని, నువ్వు అడిగిన ప్రశ్నలో అర్థం అదికాదు. దాన్ని నేను గ్రహించాను. సమాధానం చెప్పటం అట్టే భావ్యంకాదని నేను అనుకుంటున్నాను"

పూర్ణ మాట్లాడలేదు.

"అంతగా నువ్వు కాదుకూడదంటే సమాధానం ఇవ్వటానికి నాకేం అభ్యంతరం లేదు."

పూర్ణ అప్పటికీ మాట్లాడలేదు.

వెంకటరత్నం వచ్చి ఆమెదగ్గరగా నిలబడ్డాడు. తల ఎత్తి ఒకసారి అతనివంక చూచి, తలవంచుకుంది పూర్ణ.

"కొన్నికొన్ని ప్రశ్నలకి సమాధానం రాకపోవడమే మంచిది. ఒకవేళ సమాధానం వచ్చినా భరించటం చాలా కష్టం."

పూర్ణ మళ్ళీ ఒకసారి అతనికళ్ళల్లోకి చూసింది.

"నాకూ సమాధానం చెప్పాలనే ఉంది. కాని అదంత మంచిపనికాదు" అని మళ్లీ వెళ్ళి మంచంమీద కూర్చు న్నాడు వెంకటరత్నం.

"ఆ విషయం మళ్లీ నిన్ను అడగనులే" అన్నది పూర్ణ.

"నువ్వు అడక్కపోయినంతమాత్రంచేత నాకు అర్థం కాలేదనుకోకు. నే నేనాడో అర్థంచేసుకొన్నాను.... కాని ఒదినా, మనంజీవిస్తున్న సంఘం పరిస్థితులు వేరు."

"ఆ విషయం నాకూ తెలుసు. ఇక ఈ విషయంలో నే నేమీ మాటాడను."

"సరే, పొద్దుపోయింది. వెళ్లి పడుకో. రాజా వచ్చే సరికి ఏ తెల్లవారుఝామో అవుతుంది" అన్నాడు వెంకట రత్నం.

పూర్ణ నిశ్శబ్దంగా లేచి వెళ్ళిపోయింది. సప్తర్షులు వెలుగుతున్న ఆకాశం ఆ యువతీయువకుల్ని చూసి తనలో తను నవ్వుకుంది.

"తెల్లవార్లూ ఆలోచిస్తూనేఉన్నాడు వెంకటరత్నం. తను ఆమెకన్న చాలా గొప్పవాడనే ఉద్దేశ్యంతో ఆమె ఇష్ట పడుతోందో మరేకారణంచేత ఆమె తనంటే ఇష్టపడుతోందో

అతనికి అర్థంకాలేదు. ఆమెకన్న తను చిన్నవాడు. ఈ ఆలోచనలమధ్య అతనికి మరో చిత్రమైన ఆలోచనవచ్చింది.

వయస్సుఅనేది చాలా చిత్రమైనది. ఎవరినో ఒకరిని కాంక్షించాలనే అది అనుకుంటుంది. ఆ చుట్టుపక్కల ఎవరుంటే వారినే తన ఆటవస్తువుగా ఎన్నుకునేందుకుకూడా వయస్సు సాహసిస్తుంది. ఒకవేళ అలా జరుగలేదుకదా? వెంకటరత్నానికి నవ్వువచ్చింది. ఇకముందు పూర్ణతో ఆట్టే చర్చించకూడదని నిర్ణయించుకున్నాడు. అలా తను ఉండగలడా?

ఒక ఉద్వేగాన్నించి శాంతిపొందటానికి కాలంఅవసరం అన్నమాట శుద్ధ తెలివితక్కువమాట. మనస్సుమీద స్వాధీనం ఉన్నవాడికి ఒక్కరోజు చాలు. మనస్సు తన స్వాధీనంలో ఉన్నవ్యక్తి ఒక కొత్త మాధుర్యాన్ని యెంత తొందరగా అనుభవించగలడో అలాగే ఒక పాతఅనుభవాన్ని సులువుగా మర్చిపోగలడు. ఏది ఏమయినా, ఇకముందు పూర్ణతో ఆట్టే చనువుగా ఉండకూడదని నిర్ణయించుకున్నాడు వెంకటరత్నం. అతని ఆలోచనలు పూర్తికాకముందే, దబ్బుమని చప్పుడు అయింది గోడదూకి లోపలికివచ్చిన రాజా మరచెంబులో మంచినీళ్ళు తాగి తనమంచంమీద పడుకున్న తరువాత

"అయిందా?" అని అడిగాడు వెంకటరత్నం. రాజా ఉలిక్కిపడి లేచికూర్చుని "నువ్వింకా నిద్రపోలేదూ!" అన్నాడు.

"తమరు రాసక్రీడ పూర్తిచేసి వచ్చేదాకా నిద్రపోకూడదనుకున్నాను"

"సర్లే, చంపక నన్ను నిద్రపోని" అని రాజా ఒత్తిగిలి పడుకున్నాడు.

౬

"నన్ను విసిగించకమ్మా. కాసేపు పడుకోనీ" అని మళ్ళీ మంచంమీద ఒరిగింది వరాలు. ఆమె తల్లి పెద్దది. కష్టాలన్నీ ముడతలుగా మారి, ఆవిడ మొగంమీద గూడు కట్టాయి. వాళ్ళు ఉండేఇంట్లో మధ్యతరగతి సంసారం తాలూకు వాతావరణం ఉన్నాగాని, ఆ తెరచాటున మిగిలింది పరమదరిద్రం.

ఆ సంగతే ఆ మొతల్లి కూతురుకి బోధపరుస్తోంది. జీవితం జూదంలాటిదని ఆవిడకి తెలుసు. "రాజుగారి నాటకాల్లో వేషాలు వేస్తే డబ్బుకి లోటుఉండదమ్మా. సీ సంగతి నువ్వే చూసుకుంటున్నావుగాని, మిగతా వాళ్ళసంగతి నువ్వు ఏమాత్రం ఆలోచించటంలేదు" అన్నది విసుగ్గా. వరాలు చివ్వున లేచికూర్చుని "ఆయన మంచివాడు కాదమ్మా. ఆ మాట్లాడే పద్ధతిచూస్తే ఒళ్లుమండిపోతుంది" అన్నది.

"ఆయన లేకపోతే, మనబ్రతుకులు ఎలా గడుస్తాయి?"

"గడవకపోతే చనిపోవటం మేలు" అని పెంకిగా జవాబు చెప్పింది వరాలు. ఆమెకు రాజా జ్ఞాపకంవచ్చాడు. ఆమె రక్తనాళాల్లో గులాబీఅత్తరు ప్రవహించింది. ఆమె కన్నులలో వేయి విద్యుల్లతలు జిగేలుమన్నాయి. ఏదో తేలిక పరిమళం ఆమెను ముంచివేసింది.

క్లాసులో ఉపాధ్యాయుడు తెలుగు బోధిస్తున్నట్లుగా ఉంది తల్లి ఉపన్యాసం. వరాలుచెవుల్లోకి ఆమెచెప్పేది ఎంత

మాత్రం ఎక్కటంలేదు. "ఆవిషయం తరవాత ఆలోచిద్దాం. ముందు నన్ను నిద్రపోనీ" అని తేల్చివేసింది వరాలు. తల్లి విసుక్కుంటూ అక్కడినుంచి వెళ్ళిపోయింది.

వరాలు అందం ఆ వూళ్లో నాటకాలరాజుగార్ని ఆకర్షించింది. ఆకర్షణ రెండువిధాలు. అందులో ఒకటి డబ్బు. వరాలులాటి అందగత్తె వేషంవేస్తే జనం విరగబడతారు. రెండోది వరాలుమీద ఆయనకున్న మోజు. అయిదుగురు పిల్లల్ని ఈదుకురాలేక వరాలుతల్లి అవస్థపడుతోందని ఆయనకి తెలుసు. ఆర్థికంగా ఆమెకు తను సహాయపడితే వరాలు తనకి దక్కుతుంది. అంతేకాకుండా, తన మొదటిభార్య చనిపోయింది. వరాలులాటి పిల్ల దొరికితే, తనకి పెళ్ళిచేసుకుందామనే ఉంది. ఈ కారణాలవల్ల వరాలుకి ఆయన దగ్గరవుదామని ప్రయత్నిస్తున్నాడు. చిత్రం ఏమిటంటే, ఆ కారణాలవల్లనే ఆమె అతన్ని అసహ్యించుకుంటున్నది. ఏది ఏమయినా, తనతల్లి తెలివితక్కువవల్ల ముందుగా ఆయనదగ్గర డబ్బు వాడుకుంది. ఆ ఋణం తీర్చటానికయినా, రెండుమూడు నాటకాల్లో వేసితీరాలు. వాడా కనిపించి వారంరోజులయింది. బహుశా వెంకటరత్నంపన్నాగం అయిఉంటుంది.

అన్నిటికన్న పెద్ద చావు ఈ రిహార్సలు ఒకటి. వరాలు విసుగ్గా లేచి, బట్టలుమార్చుకుని బయలుదేరింది. బుట్టయ్యపేటగొందుల్లో ఒకదాంట్లో ఆ రిహార్సలు రూమ్ ఉన్నది. నాటకం నలదమయంతి. అందులో తను దమయంతి. ఇంకెవరో ఒకళ్ళిద్దరూ భోగంవాళ్ళున్నారు. వాళ్ళ పౌడర్లూ, కిల్లీలూ, వాళ్ళు మాట్లాడేమాటలూ చూస్తే వరాలుకి పరమ

అసహ్యం. ఆరోజు వరాలు వెళ్ళేసరికి అందులో ఒక వనజాక్షి, హారోనిస్టూ విరగబడినవ్వుతూ గబుక్కున ఆపేశారు. అసలు ఆ వాతావరణం అంటేనే గిట్టని వరాలు మనస్సులో అస హ్యించుకుంటూ వెళ్ళి కూర్చుంది. ఆ వూళ్ళో అందరికీ వరాలుఅందమూ పెంకితనమూ తెలుసు. ఏదయినా అయినా పయినా వస్తే చావగొట్టేస్తుందనికూడా తెలుసు. అందుకే ఆ అమ్మాయి రిహార్సలుకొస్తే చాలా జాగ్రత్తగా ఉంటారు. అందులో ఒకళ్లిద్దరు రాజుగారికి కాబోయే ఇల్లాలనికూడా పసి గట్టేశారు. రిహార్సలు అవుతూఉండగా రాజుగారూ ప్రసాద రావుగారూ లోపలికి వచ్చారు.

రాజా వెంకటరత్నం బందరు వచ్చేస్తుంటే బట్టలు కొనా లని ప్రసాదరావుగారుకూడా వచ్చారు. బస్సుదిగి కాఫీ అదీ తాగి బజారుకి బయలుదేరుతుంటే ప్రసాదరావుగారి స్నేహి తుడు రాజుగారు కనిపించి. మా రిహార్సలు చూద్దురుగాని రండని లోపలికి తీసుకువచ్చారు.

వయసులో పెద్దయినా, రాజా పోలికలతో ఉన్న ఈ పెద్దమనిషి ఎవరో వరాలుకి తెలియలేదు. నిర్ఘాంతపోయి ఆయనవంక చూడటం ప్రారంభించింది. ఇదివరకల్లా ప్రసాద రావుగారికి ఒక నమ్మకం ఉండేది. పూర్ణ చాలా సౌందర్య వతిఅని. ఇప్పుడు అంత సౌందర్యవతీఅయిన వరాల్ని చూసి ఆయన ఆశ్చర్యపోయినారు. బయటికి వచ్చేంతరువాత ఆవిష యంలో రాజుకి హితోపదేశంచేశారు.

"నువ్వు పెళ్ళిచేసుకోవాలనుకున్నప్పుడు ఆ అలగా వాళ్ళముందు కూచోపెట్టి నాటకాలేయించటం అంతమంచిది కాదు."

"నేను పెళ్ళిచేసుకుందామనుకుంటున్నాను గాని, ఆ పిల్ల అనుకోవటంలేదు" అని జాలిగా జవాబుచెప్పారు రాజుగారు.

"నేను నీకు ఇంకో సంగతికూడా చెప్తున్నాను. ఆ పిల్ల కిష్టంలేకుండా నువ్వు పెళ్ళిచేసుకుంటే, నీ బ్రతుకంతా నరకం అవుతుంది"

"ఆసంగతి నాకూ తెలుసు ప్రసాదరావు. కాని, ఆ రతనాలబొమ్మ"

"హూహు రాజా, ఈ వయసులో వ్యామోహాలు పెట్టుకోటం అంత మంచిపనికాదు"

"మనకిద్దరికీ ఇంకా నలభయి పూర్తి కాలేదు. అన్నట్లు మీ అబ్బాయి ఏం చేస్తున్నాడు?"

"చదువుతున్నాడు. అయినా నువ్వుచేసేది అంత మంచి పని కాదనుకుంటాను"

"ఎందుకని?"

"ఆవయసు పిల్లలకి మనబోటివాళ్ళను చూస్తే, అసహ్యం. అది ఒకటి. రెండు: ఆ పిల్ల చాలా అందగత్తె. మూడు: ఒకవేళ నిన్ను పెళ్ళిచేసుకున్నా నీ డబ్బునిచూసి మాత్రమే"

"అయితే ఇప్పుడు నన్నేంచేయమంటావు?"

"పెళ్లి చేసుకోవటం మానెయ్యి. కాని పిల్లమాత్రం ఊర్వశిలా ఉంది...రాజూ, ఆ పిల్లని చూస్తే నా కేమని పించిందో తెలుసా?"

"ఏమనిపించింది?"

"నా కోడల్ని చేసుకోవాలని. కాని, ఆ భాగ్యానికి నేను పెట్టిపుట్టలేదు. ప్రపంచంలో మనిషికీ మనిషికీ మధ్య భేదమే లేకపోతే, నే నా పని తప్పక చేసిఉండేవాడిని. ఏం పిల్ల! రత్నం!" అన్నారు ప్రసాదరావుగారు.

ఆయన బట్టలూ అవీ కొనుక్కొని, కృష్ణాపత్రిక ఆఫీసులో పనిచూసుకుని రాత్రి పదకొండింటికి రూమ్‌కి వచ్చేసరికి గదిలో స్త్రీ-పురుష కంఠస్వరాలు వినిపిస్తున్నాయ్. ఆయన ఆశ్చర్యపోయి అక్కడే నిలబడ్డారు.

"మా మామయ్య సంగతి మీకు తెలియదు. అనవసరంగా ఊబిలోకి దిగటం అంత మంచిదికాదు" ఇది వెంకటరత్నం గొంతుక.

"బ్రహ్మదేముడు అడ్డువచ్చినా రాజాని చూసితీరాలి. అయినా, మీ కేమిటండీ పాడుగొడవ" ఆ స్త్రీకంఠస్వరంలో చాలా హాయిఉన్నది అనుకున్నారు ప్రసాదరావుగారు.

"సరే నీఇష్టం. కాని, జరగబోయే అనర్థానికిమాత్రం సిద్ధంగాఉండండి. ఇక దయచేయండి, మామయ్య వస్తాడు"

ఇందాక రిహార్సలులో చూసిన సౌందర్యవతి అతి కోపంగా తనముందునించే వెళ్ళటం చూసి ఆశ్చర్యపోయి నారు ప్రసాదరావుగారు. వరాలు వెంబడే బైటికివచ్చిన వెంకటరత్నం మేనమామనిచూసి భయపడ్డాడు. ప్రసాద

రావుగారు తాపీగా లోపలికివెళ్ళి బట్టలుమార్చుకుని పడక కుర్చీలో కూర్చుని

"రాజా ఏడిరా?" అన్నారు.

"ఎక్కడికో వెళ్ళాడు" అని ముభావంగా జవాబు చెప్పాడు వెంకటరత్నం.

"ఇందాకవచ్చిన ఆ అమ్మాయి ఎవరు?"

"ఈ ప్రశ్న నువ్వు అడుగుతావని నాకు తెలుసు. కాని సరిఅయిన సమాధానంవస్తే భరించలేవు"

"భరించలేనంత భయంకరమైనవిషయం ఇందులో ఏముంది? ఏదో ప్రేమగొడవ తప్ప" అన్నారు ప్రసాద రావుగారు.

వెంకటరత్నం తెల్లబోయినాడు. కొడుకు శూద్రపిల్లని ప్రేమించినందుకు అరిచి గోలచేస్తాడని అనుకున్నాడు. తరు వాత ఇంకోవిషయం ఏమిటంటే, తన మేనమామ, హృద యంలో చాలా సంస్కారిఅని తెలుసుగాని, ఇంత సంస్కారి అని తెలియదు ప్రేమగొడవఅనేది చాలా మామూలు విషయం అన్నట్లు మాట్లాడిన ప్రసాదరావుగార్ని చూసి ఏం జవాబుచెప్పాలోకూడా తెలియలేదు వెంకటరత్నానికి.

"మాట్లాడవేంరా?"

"నువ్వుఅన్నట్లు ప్రేమగొడవ తప్ప మరేంలేదు?"

"అదే... ఏమిటీ అని అడుగుతున్నాను."

"ఆ అమ్మాయినిచూసి మీవాడు భ్రమపడు తున్నాడు. మీ వాడినిచూసి ఆ అమ్మాయి ప్రేమిస్తోంది."

"సహజమే... మరి మధ్యలో నీగొడవేమిటి?"

"నీకోసమే ఇన్నాళ్ళూ గొడవచేస్తూవచ్చాను. ఇక వాళ్ళజోలికిపోతే ఒట్టు."

"ఆ అమ్మాయినిచూసి నలభయ్యేళ్ళుదాటిన నాట కాలరాజే భ్రమపడ్డాడు. రాజాసంగతి కేమిటి?" అన్నారు ప్రసాదరావుగారు.

వెంకటరత్నం గభాలున లేచి కూర్చుని "అయితే, ఈ పిల్ల నీకూడా తెలుసన్నమాట?" అన్నాడు.

"తెలుసు, రాజా నాకు తెలియదనే అనుకున్నాడు, నేనూ మొదట గుర్తుపట్టలేదు. ఈ పిల్ల వెంకటనరసయ్య కూతురు."

"సరేలే. ఇప్పుడీ పిల్ల నీ కోడలుగావస్తే నీ కిష్టమే నన్నమాట." అని మరోముక్క విసిరాడు వెంకటరత్నం. ప్రసాదరావుగారు చాలాసేపు మాట్లాడలేదు. తరువాత,

"నీ కో చిన్నకథ చెపుతా వింటావా?" అన్నారు. ఇవ్వాళ మామయ్య తరహా వేరుగాఉంది అనుకొన్న వెంకటరత్నం సరేనని తలఊపాడు. ప్రసాదరావుగారు చెప్పటం ప్రారంభించారు.

"నేను మనిషిలోఉండే అన్నిలోపాలకీ సానుభూతి చూపించగలను గాని, చావాలనుకునే స్వభావానికి మాత్రం సానుభూతి చూపించలేను. ప్రతి చిన్నవిషయాన్ని అంత ర్జాతీయ సమస్యగా చేసి, ఆరాటపడేవాళ్ళని చూస్తే నాకు పరమఅసహ్యం.

"నేను చెప్పేది ఇరవయ్యేళ్ళనాటిసంగతి. అప్పటికి నేనుకూడా చిన్నవాడిని ... ఈ సంగతులు తెలిసినవాడిని నే

నొక్కడినే ఉన్నాను. నువ్వు రచయితవని నీ కివన్నీ చెపుతున్నాను. ఇవన్నీ నీ మనసులోనే ఉంచుకుంటానని మాట ఇయ్యి.''

వెంకటరత్నం తలూపాడు. ప్రసాదరావుగారు చెప్పనారంభించారు:

''నీ కంతా చెపుతాను. నీవుమాత్రం ననర్థంచేసుకోవాలి. ఆ రోజుల్లో నాకు జీవితాన్నిగురించి అర్థం తెలుసుకోవాలనేకోరిక తీవ్రంగాఉండేది... నరనరాలలో ఏదో అర్థం కాని ఆవేదనలో అందరినీ పరీక్షగా చూస్తూ ఉండేవాడిని. వీళ్ళంతా ఎవరు ? వీళ్ళబ్రతుకుల్లో ఏమేం విచిత్రాలున్నాయి ? అనిపించేది. అప్పట్లో చదివేది ఫోర్త్‌ఫారమైనా అన్నీ ఇంగ్లీషులో ఉండేవి. పారడైజ్ లాస్ట్‌లో చెప్పినట్లు ప్రతిరాత్రి ఒక దేవకన్య వచ్చి నా చెవుల్లో గుసగుసలాడినట్లు ఉండేది.''

''మామయ్యా !''

''ఏమిటి ?''

''నీ మేనల్లుడినిఅయినందుకు నాకు చాలా గర్వంగా ఉంది''

''సరేలే, విను. వెంకటనర్సయ్య నా క్లాస్ మేట్. అంత తెలివిగలవాడిని నే నెప్పుడూ చూడలేదు. కాని అతనిలో ఒక్కటే లోటుఉండేది. ఏ కొంచెం బాధవచ్చినా ''అబ్బ ! ఏం బ్రతుకురా; చస్తే బాగుండును'' అనేవాడు. అతని ఈ నిస్పృహకి కారణం ఏమిటో తరువాత నాకు తెలిసింది.

''[illegible] ! ప్రేమేనా !''

"ఆ రకమే... అసలు జరిగిందేమిటంటే, 'శండవల్లి మండే' అనే ఒక వస్తాదు ఉండేవాడు. మండేకి ఆస్తి ఉండేది. పెళ్ళీ పెటాకులూ ఏమీలేదు. తెగతినటం, లోకాన్ని భయ పెడుతూ తిరగటం అతని కార్యక్రమం. అప్పట్లో నాకో కోరికకూడా కలిగింది—మండేలా బ్రతికితే బాగుండునని... సరే, అదలాఉంచు. మండేకి ఆడవాళ్ళ వ్యామోహంకూడా అట్టేలేదు... అలాటిది ఒకరోజున పదహారేళ్ళ పిల్లని తీసుకు వచ్చి, తన కూతురని లోకానికి పరిచయంచేశాడు"

"ఎవరా పిల్ల ?"

"తెనాలిలో మండేకి ఒక తురకస్నేహితుడు ఉండే వాడు. అతని కూతురీ పిల్ల. ఉన్నకాస్తా అప్పులపాలవటం వలన ఒక్క కూతుర్ని స్నేహితుడికి అప్పచెప్పి గన్నేరు కాయలు తిని చచ్చాడు ఆ సాయిబు. ఆ పిల్లే ఈ పిల్ల. ఆ అమ్మాయిపేరు హిందూపేరో తురకపేరో ఎవరికీ తెలి యదు - తెలుగు చాలా చక్కగా మాట్లాడేది భాషా.

"భాషా ... పేరు బాగుందిసుమా !"

"పేరేకాదు, ఆ అమ్మాయికూడా చాలా అందగత్తె. తన ఒదినగారికూతురని మండే చెపుతూఉండేవాడు. బొట్టు పెట్టుకుని బందరు కలంకారీచీర కట్టుకొన్న భాషానిచూస్తే, నియోగప్రభువులఇంట్లో పుట్టిన ఆడపడుచులా ఉండేది. కలలోకూడా తురకపిల్ల అని ఎవరూ అనుకోరు. ... అసలా సంగతి తెలిసినవాళ్ళం ముగ్గురమే మండే, నేనూ, వెంకట నరసయ్యానూ—సరే, అదలాఉంచు; వెంకటనరసయ్యకి హిందూమతంఅన్నా దేవుళ్ళన్నా చాలా ఇష్టం. ఆ ఇష్టం

చివరకి ఎండాకాపోయిందంటే, ఇక ఏ మతాన్నయినా ఘోరంగా ద్వేషించేవాడు. నే నెప్పుడూ చెప్తుతూ ఉండే వాడివి. నీకు తెలియదురా, హిందూదేశంలో ఒక్క హిందూ మతమే ఉండాలి అనేవాడు. మండేఇంట్లో దేవీపీఠం ఉండేది. మే మిద్దరమూ ఏదో ఒకసమయంలో ప్రతిరోజూ అక్కడ హాజరవుతూఉండేవాళ్ళం. ప్రపంచంలో అందరినీ అనుమా నించే మండే మమ్మల్ని ఎంతో ప్రేమగా చూసేవాడు. పని మీద ఉండి మేము ఒక్కపూట వెళ్ళకపోతే "ఏం బాబూ, ఇవ్వాళ రాలేదేం?" అని ఆ సాయంత్రమే మా గదికి తయారయేవాడు ఏ కారణంచేత అయితేనేం మేం మాత్రం ప్రతిరోజూ విధిగా అక్కడికి వెళ్ళేవాళ్ళం.

"నువ్వు నిజంచెప్పటంలేదు మామయ్యా"

"నువ్వు అడిగింది నాకు అర్థంఅయింది. మేం వెళ్ళ టానికి భామాకూడా కారణమే. చాలా అందగత్తెఅయిన ఆ పిల్ల తలనిండా పూలుపెట్టుకుని, ఆ ఇంట్లో తిరుగుతుంటే లక్ష్మిలా ఉండేది. ఇప్పటికు తల్చుకుంటే నవ్వువస్తుంది. ఈ పిల్లకుండే శుచి మీలోకూడా ఉండదు, అని ప్రతీరోజూ న న్నెత్తిపొడిచేవాడు నరసయ్య. స్నానంచేసి దేవీపూజకి అన్నీ అమర్చేటప్పుడు భామా రెండో రాజరాజేశ్వరిలా ఉండేది.

"చాలా చిత్రమైనకథ ... తరువాత ఏం జరిగింది మామయ్యా?"

"ఆమె ఎవరికిడుపున పుడితే యేం మునిగిపోయింది! భామా ఆపాదమస్తకం ఒక దేవసుందరి. ఈ ప్రపంచానికి

అంటుని ఒక విచిత్రజ్యోతి. ఆ రోజుల్లో ప్రతిరోజూ ఆమెను చూసేవాడిని...కవికి కవితా, చిత్రకారుడికి చక్కని ప్రకృతి చిత్రమూలాగానే సామాన్యమానవుడికి "స్త్రీ" ఒక మహా వరం ఆ రోజుల్లో...సరే పోనీ..."

"సరే పోనీ కాదు మామయ్యా, నీవు నా దగ్గర యేమీ దాచవద్దు. చక్కని రచయిత వ్రాసిన నవలలాగా ఉంది నీ కథ...తరువాత ?"

"నా పరిస్థితి నీకు తెలుసు. నేను ఆంధ్రదేశంలో అందరికంటె గొప్పకులంలో పుట్టిన మొఖాసాదారుని. నా బంధువులంతా జమీందార్లు. ఈ కులంగానిపిల్ల నాకు ఎలాగూ దక్కదు. అందుకని ఆ ఆశ మనసులోంచి తుడిచి వేసుకున్నాను. అప్పట్లో భామా తురకపిల్ల అని మాకూ తెలి యదు. ఆ విషయాన్ని రహస్యంగాఉంచాడు మండే....... మండేలాటి దేవీభక్తుడు పూర్వాచారపరాయణుడూ ఇంకె వరూ ఉండరని నరసయ్య అనుకుంటూఉండేవాడు... అను కోవటమేకాదు, అతనంటే అపరిమితమైన భక్తికూడా."

"ఆగు మామయ్యా, ఒక ప్రశ్న. ఇంట్లో వంటా, దేవికి నివేదనా ఎవరుచేసేవాళ్ళు ?"

"అన్నీ భామే చేసేది. అందుకే మా కెవరికీ ఏవిధ మైన అనుమానమూ ఉండేదికాదు. కొద్దిరోజుల్లోనే నర సయ్య భామాని ప్రేమించటం ప్రారంభించాడు. నరసయ్యకి తల్లీ తండ్రీ లేరు. ముసలిమేనత్త పోషణలో ఉండేవాడు. అందుకని అతనికి అడ్డుచెప్పేవాళ్ళు లేరు. పైగా నరసయ్యదీ మండేదీ ఒకే కులం"

"ఈ మండేపేరు చాలా తమాషాగా ఉంది."

"తమాషాఏంలేదు. అసలుపేరు శండవల్లి మండేశ్వర స్వామి. అతను తాలింఖానా అదీ పెట్టి వస్తాదు అయ్యాక శండవల్లి మండేగా మారిపోయాడు.... అదలా ఉంచు ... భాషాని నరసయ్యకిఇచ్చి ఇంట్లో ఉంచుకోవాలని మండే ఉద్దేశ్యపడుతూఉండేవాడు. నాతో ఈ విషయం రెండు మూడుసార్లు అన్నాడుకూడా ... అతను ఇంకోమాటకూడా అనేవాడు "బ్రాహ్మడు నాలుగుజాతులవాళ్ళనీ చేసుకో వచ్చును. ... మీరు చేసుకుంటానంటే మీకే ఇస్తా" అని ... అది జరిగేపనికాదని మా ఇద్దరికీ తెలుసు ... కాని అత నా మాట అన్నప్పుడల్లా నాకు చాల బాధకలిగేది. ... నా కులం మీదా నా జమీందారీమీదా చెప్పలేనంత అసహ్యం కలిగేది.

"ఒక్క సందేహం మామయ్యా, నువ్వుకూడా భాషాని ... ...?"

"అనే ఒప్పుకోవాలి ... కాని అప్పట్లో నాకా ధైర్యం లేదు. నరసయ్యకి భాషాని ఇస్తానని మండే నాతో అన్న ప్పుడు నేను పైకి నవ్వినా లోలోపల చాల బాధపడ్డాను. భాషామాత్రం మా ఇద్దరితోనూ ముభావంగానే ఉండేది. పెళ్ళి ఇంకా ఇరవయ్యిరోజులుంది. తిరపతిలో ముడి పెడతా నని మండే అన్నాడు ... ..."

ప్రసాదరావుగారు కొంచెంసేపు తన కథ ఆపారు. తరువాత—

"ఆ రాత్రి, ఇప్పటికీ నాకు జ్ఞాపకంఉంది. ఆరోజు నేను చేసినపని మంచిదో చెడ్డదో నేను ఈనాటికీ తెల్సుకోలేదు. ఎవరితోనూ చెప్పలేదు. అరవయ్యేళ్ళకి తరువాత నాటికి నేడు మొదటిసారిగా నా హృదయాన్ని నీముందు విప్పు తున్నాను. నా కెవరూ స్నేహితులు లేరు. నువ్వు నాకంటె చిన్నవాడివి. అయినా, గొప్పవాడివి. ఎందుకంటే, సృష్టితో సరిసమానమైన రచన నీలో ఉన్నది. మానవుడి తప్పు ఒప్పుల్ని సమానదృష్టితో చూడగలిగినవాడు ఒక్క రచయితే... అందుకే నా ఈ కథను నీముందు తెరిచాను. కాసేపు నా పెద్దరికాన్నీ ముసలితనాన్నీ మరిచిపోయి ప్రియ స్నేహితుడుగా మాత్రమే నా కథ నీకు చెప్తున్నాను."

"ఒకొక్కప్పుడు జీవితాల్లో జరిగే చిత్రాలు ఎవరూ ఊహించలేనంత అద్భుతంగా ఉంటాయి... తరువాత ?"

"పెళ్ళిసంగతి వాళ్ళఅత్తగారితో చెప్పటానికిగాను నరసయ్య ఊరికి వెళ్ళాడు. సాయంత్రం ఆరుదాటితే మండే నల్లమందు బిగించి నిద్రపోతాడు. నేను అప్పుడే భోజనంచేసి రాధికాసాంత్వనం చదువుతున్నాను. నా గదితలుపు చప్పుడయింది. వెళ్ళి తలుపుతీశాను. అక్కడ ఆమె నిలబడిఉంది ఎవరయినా చూస్తారేమో అనే భయంతో లోపలకి పిల్చి తలుపువేశాను. ఆ క్షణంలో ఆమెమీద ప్రేమకన్న కీర్తి గౌరవాలమీదే నా దృష్టి కేంద్రీకరించాను అది పొరపాటని నాకూ తెలుసు కాని, అంతకంటె ఏంచేయాలో నాకు తెలియలేదు."

ప్రసాదరావుగారు చెప్పటం ఆపారు. వెంకటరత్నం ఆయనకళ్ళల్లో నిలిచిన నీళ్ళనుచూసి ఆశ్చర్యపోయినాడు. కళ్ళుతుడుచుకుని తిరిగీ చెప్పటం ప్రారంభించారాయన.

"జీవితంలో మనం అనుభవించే శిక్షలకు మన తిరస్కృతులే కారణం. ఆ శిక్ష అనంతరం మిగిలేదేమీ ఉండదు. ఆ స్మృతితాలూకు మాధుర్యంతప్ప... సరే. అదలావుండనీ. అంతవరకూ అయిదారుమాటలుతప్ప నాతో ఆట్టే మాట్లాడని భామా నా గదికి రావటం నాలో ఆశ్చర్యాన్ని కలిగించటమే కాక, ఆమె అంటే ఏదో జాలిక భావంకూడా కలిగినట్లుంది. ఆ విషయం ఇప్పుడు అనిపిస్తోంది. బందరు కలంకారీచీర, గువ్వ కన్ను రవిక, తలనిండా పూలు, మెళ్ళో గజ్జలపట్టెడ పేటతో నా గదిలోకి వచ్చిన ఆ బంగారుబొమ్మని నేను ఈనాటికీ మర్చిపోలేను. ఆరోజు జరిగిన ప్రతి చిన్నవిషయాన్ని నేను మర్చిపోలేదు. నేను తలుపుమూసి గడియపెట్టినప్పుడు భామా భయపడలేదు. సరాసరి వచ్చి నా మంచందగ్గర నేలమీద కూర్చుంది. కొంచెం సేపటికి నాకు భయంవల్ల వచ్చిన వణుకు తగ్గింది. అయితేయేం? నేను మగవాణ్ణే. అందుకని వణుకుతున్నసంగతి భామాకి తెలియకుండా జాగ్రత్తపడ్డాను"

వెంకటరత్నం నవ్వి "ఎంతమటుకూ నీ సంగతి నువ్వే కాని, ఆ అమ్మాయి అంత సాహసించి నీ గదికి ఎందుకు వచ్చిందో ఆలోచించలేదు, అవునా?" అన్నాడు.

"వణుకు తగ్గాక ఆలోచించాను. నా ఎదురుగుండా కూర్చున్న సౌందర్యరాశి నాదికాదని తెలుసుకనుక, మర్యా

దగా వచ్చిన పనేమిటని అడిగాను; భాషా కొంచెంసేపు మాట్లాడలేదు. తరువాత

"నాకు పెళ్ళిచేస్తానంటున్నాడు బాబాయి" అన్నది భాషా. మండేని బాబాయి అంటుంది.

"మరి ఆడపిల్లకి పెళ్ళిచేయకపోతే ఎలా?" అని వేధవనవ్వు నవ్వాను. భాషా తలఎత్తి నావంక విచిత్రంగా చూసింది. ఆ చూపుకు ఆగలేక "అదికాదు భాషా, పెళ్ళి చేసుకో, దానికింత ఆలోచనయెందుకు?" అన్నాను. ఆమె కొంచెంసేపు తలవంచుకు కూర్చుని,

"చేసుకోటానికి నాకేం అభ్యంతరంలేదు. నరసయ్య గారికి మతంఅంటే చాలా ఇష్టం. మీలో అంత మతపిచ్చి ఉన్నట్లు నాకు కనిపించటంలేదు" అన్నది. ఆమెమాటలఅర్థం నాకు బోధపడలేదు.

"మతంఅంటే వాడికి ఇష్టంకానచ్చును, దానికీ మీ పెళ్ళికీ సంబంధం ఏమిటో నా కర్థంకావటంలేదు" అన్నాను.

"సంబంధంఉంది కనుకనే చెపుతున్నాను. అతన్ని పెళ్ళిచేసుకోవటం నా కిష్టంలేదు" అన్నది. ఆమెఉద్దేశ్యం ఏమిటో తెలియలేదు.

"అదేమిటో నాకు స్పష్టంగా చెప్పు" అన్నాను.

"చెపుతాను. చెప్పాలనేవచ్చాను. మీరు జమీం దారులుగదా, మీఇంట్లో దాసీలు యెంతమంది ఉన్నారు?" అన్నది.

"మేం నియోగిజమీందార్లం ; మిగతావాళ్ళకి ఉన్నట్లు మాకు దాసీలూ కాసాలూ ఎక్కువగా ఉండరు. అయినా, ఆ ప్రశ్న ఎందుకు ?" అన్నాను.

"ఏంలేదు. నా కన్నిపన్లూ చేతనవును. మీఇంట్లో నాకు దాసీపని ఇప్పించలేరూ ?" అన్నది.

"భేష్ ! మామయ్యా! బెంగాలీ నవలలో నాయికలా అడిగింది. తరువాత ?" అన్నాను వెంకటరత్నం. ప్రసాద రావుగారు జీవంలేని నవ్వునవ్వి చెప్పటం మొదలుపెట్టారు.

"బెంగాలీనవలల్లో నాయికలయినా తెలుగునవలల్లో నాయికలయినా ఉత్తమాచరయిత తన పాత్రల్ని ఎప్పుడూ జీవితాలనించే ఎన్నుకుంటాను...సరేవిను - భాషా ఆమాట అన్నతరువాత నేను తెల్లబోయి,

"అదేమిటి భాషా ! మీ బాబాయికి కాస్తోకూస్తో ఆస్తిఉంది పెళ్ళిచేసుకోకపోతే పోనిగాని. దాసీపని చేసే ఖర్మేంకాలింది ?" అన్నాను. భాషా పెళ్ళిఅంటే ఇష్టపడక పోవటం నాకు చాలా ఆనందాన్ని కలిగించిందనే చెప్పాలి. నే నా మాట అన్నతరువాత భాషా నావంక ఇంకా అర్థం కాలేదా ? అన్నట్లు చూసింది. నాకూ అర్థమయింది కాని అవనట్లు నటించాను.

"పోనీలెండి. ఇప్పుడు నా గతేమిటో ఆలోచించండి" అన్నది.

ఆమె అలాఅన్నందుకు కొద్దిగా గర్వంకలిగినా "పెళ్ళి చేసుకో. సుఖపడు... అప్పుడప్పుడు నేనొస్తే భోజనంపెడుతూ ఉండు" అన్నాను, భాషా మొగం ఇంతయింది.

"మరి నాచేతిభోజనం మీరు తింటారా ?" అన్నది. ఆక్షణంలో నాకేమయిందో తెలియదుగాని, గభాలున లేచి, భాషాచెయ్యి నాచేతిలోకి తీసుకొని "ప్రపంచంలో ఈచేతి మీదుగా వచ్చిన పదార్థం ఎప్పుడూ పవిత్రంగానేఉంటుంది. ఇంతఅందమైన చేతిలోంచి అపవిత్రమైన పదార్థం ఎప్పుడూ రాదు" అన్నాను.

"కవిత్వంసూ నేసి నిజంగా చెప్పండి- నా చేతిభోజనం మీరు తింటారా ?" అన్నది.

"తప్పక తింటాను. కాని ప్రపంచానికి తెలియటం నా కిష్టంలేదు" అన్నాను. భాషా నావంక అదోమాదిరిగాచూసి-

"ప్రపంచానికి తెలియాల్సిన అవసరంకూడా లేదు" అన్నది. నాకళ్ళముందునించి ఒకటొకటిగా తెరలు జారుతున్నట్లనిపించింది ఆ మాటతో. అక్కడికీ ధైర్యంచేసి,

"నువ్వనేది ఏమిటి భాషా?" అన్నాను. ఆమెచెయ్యి అప్పటికీ నా చేతిలోనే ఉన్నది. ఆమె ఏడుస్తూ నా కాళ్ళ మీదపడి "నాకు భార్యను కావాలనేకోరిక లేదు. మీ ఉంపుడుగత్తె అనిపించుకున్నా నా కిష్టమే. మీరు ధనవంతులు. గుప్పెడన్నం పెట్టండి చాలు. బాబాయిఆ స్త్రీ వద్దు. నరసయ్యగారితో పెళ్ళివద్దు... అన్నది..." ప్రసాదరావుగారు ఆపైన మాట్లాడలేకపోయారు. దుఃఖం ఆయన కంఠాన్ని అడ్డుకుంది. వెంకటరత్నం లేచి మేనమామ కుర్చీదగ్గర కూర్చుని,

"ఇరవయ్యేళ్ళ తరువాతకూడా ఆ విషయం తల్చుకుని నీవు దుఃఖపడుతున్నావంటే నాకు అర్థంఅవుతోంది

మామయ్యా" అన్నాడు. ప్రసాదరావుగారు ఆ ఆవేశం తగ్గినాక తిరిగీ చెప్పటం ప్రారంభించారు-

"స్త్రీ తనగౌరవాన్నికూడా త్యాగంచేయటానికి సిద్ధపడిందంటే, అంతకన్న చెపాల్సిందేమీలేదు. తన ధర్మపత్నీత్వపుగౌరవాన్ని బలిపెట్టే స్త్రీ కన్న త్యాగశీల మరెవరూ ఉండరు; లోకం ఆ సంగతి ఒప్పుకోదు. అది లోకం తప్పుకూడా కాదు; లోకం అలా ఒప్పుకున్నరోజున ఈ సాంఘికవ్యవస్థ తారుమారైపోతుంది."

"ఇంతకీ అప్పుడు నువ్వేం జవాబు చెప్పావు మామయ్యా?" అన్నాడు వెంకటరత్నం.

"ఒక సౌందర్యవతి తనసర్వస్వాన్నీ నాకు అర్పిస్తున్నదని నాకు తెలుసును. కాని నా చేతులు వాటిని స్వీకరించేందుకు సిద్ధంగాలేవు. భామని ఉంపుడుగత్తెగా ఊహించుకోటానికికూడా నాకుభయం వేసింది. బంగరుగుల్లో రెండు గవ్వల్లో భామని పెట్టి, నేను వస్తూపోతూఉండటంలోఉన్న నైచ్యత నా కళ్ళకి కట్టినట్లుఅనిపించింది. నా కది ఇష్టంలేదు. ఆ మాటే భామకి చెప్పాను.

"మరి మీరు నన్ను పెళ్ళిచేసుకోలేరుగా" అంది. నేను అవునన్నట్లు తలఊపాను. భామ ఏడుస్తూ నా రెండు చేతులూ పట్టుకొని,

"అందుకే నన్ను ఉంపుడుగత్తెగా ఉండనివ్వండి. నాకేం అమర్యాదలేదు. నరసయ్యగారికి భార్యగాఉండటం కన్న మీకు ఉంపుడుకత్తెగా ఉండటమే నాకిష్టం" అన్నది.

"నాకు నాన్నగారూ, సభారంజనమ్మా జ్ఞాపకం వచ్చారు. అలాగే మేమూనా? ఎప్పుడూకాదు. సభారంజనమ్మ వేశ్య. నాన్నగారు ఆమెని ప్రేమించటంలో ఆక్టేతప్పు లేదు అనుకున్నాను. అప్పట్లో నాకు నాన్నగారు చేస్తున్న పని నచ్చేదికాదు; కాని స్త్రీ అంతర్యంలో అగ్నిపర్వతాలే ఉంటాయో! అమృతస్రవంతులే ఉంటాయో తెలుసుకోలేం. సభారంజనమ్మ నాన్నగారితోపాటే చనిపోయింది. సీతా, అనసూయా మొదలయినవారి దారిలోనే ఆమెకూడా నడిచింది. ఆ సంగతి ఇప్పుడు నేను అర్థంచేసుకోగలిగాను. పవిత్రతకీ పాతివ్రత్యానికీ వర్ణక్రమంకూడా తెలియని మనం వాటినిగురించి మాట్లాడుతూఉంటాం" అని నిట్టూర్చారు ప్రసాదరావుగారు.

వెంకటరత్నం జాలిగా మేనమామవంక చూశాడు.

"భాషాని నా రెండుచేతులతోనూ లేవతీసి హృదయానికి హత్తుకుందామనిపించింది. కాని అలా చేయలేకపోయినాను. భాషా తనంతటతానే లేచినిలబడింది. కూజాలో నీళ్ళు గ్లాసులో పోసుకుని తాగి మళ్ళీ వచ్చి కూర్చుని,

"అసలుసంగతి మీకు చెప్పనేలేదు" అంది. నేను ఆదుర్దాగా ఆమెవంక చూశాను. ఆమెలో ఇప్పుడు దుఃఖం లేదు. అభిమానంలేదు; స్త్రీత్వంతాలూకు నైర్మల్యం తప్ప మరేమీ లేదు. ఆమె ఈ నిశ్చలదీప్తిని చూసి నేను భయపడిపోయాను.

"నేను మిమ్మల్ని అభిమానించాను. మీ హృదయం కూడా మీఅంత సుందరంగానూ ఉంటుందని భ్రమపడ్డాను.

ఆఖరికి మీకు ఉంపుడుగత్తెగా ఉండటానికికూడా నాకు అభ్యంతరంలేకపోయింది... కాని, మీరు నన్ను అర్థంచేసుకోలేకపోయినారు. అయినా, మిమ్మల్ని నిందించాలని నేను అనుకోవటంలేదు. నాకర్మ ఎలాఉంటే అలా జరుగుతుంది" అన్నది. నేను తెప్పరిల్లుకొని,

"అలా అనకు భాషా. నిన్ను నాదాన్ని చేసుకోటానికి తప్పకుండా ప్రయత్నిస్తాను"... అన్నాను. భాషా నావంక అదోమాదిరిగా చూసి

"నేను తురకపిల్లను" అన్నది. నేనుకొన్ని క్షణాలు స్పృహ తప్పిపోయాను. ఆ కన్నీటి తెరలమధ్య తన కథ వినిపించింది భాషా. నిశ్శబ్దంగా విన్నాను. కథ పూర్తయిన తరువాత,

"ఇప్పుడు చెప్పండి, నా భవిష్యత్ ఏమిటో?" అన్నది.

"మరి మీ నాన్నగారు ఈ సంగతి దాచి పెళ్ళిచేయాలనుకుంటున్నారుగదా... ఈ సంగతి నువ్వూ ఆయనా చెప్పకపోతే ఎవరికీ తెలియదుకూడా" అన్నాను.

"ఆవిధంగా లోకాన్ని మోసంచేయటం నాకెంత మాత్రం ఇష్టంలేదు. నా కులాన్ని మతాన్ని దాచి, నేను పెళ్ళిచేసుకోకపోతే యేంమునిగిపోయింది?" అన్నది భాషా.

ప్రపంచంలో ఆమె పరిస్థితిలోఉన్న ఏ ఆడపిల్లయినా మరోవిధంగా ప్రవర్తించిఉండేది. కాని, ఆమెమాత్రం ఏమీ దాయాలని అనుకోటంలేదు. తద్వారా ఏమీ పొందాలని కూడా అనుకోటంలేదు. భాషా తురకపిల్లఅయినా చాలా స్వచ్ఛమైన తెలుగు మాట్లాడేది.

"నేను బొట్టుపెట్టుకుంటాను. బాబాయి దేవతార్చనకి అన్నీ నేనే అమర్చిపెడతాను. గత్యంతరంలేక చేస్తున్న ఈ పాపాలు చాలు నాకు. పెళ్ళిచేసుకుని మరొకళ్ళబ్రతుకునికూడా భ్రష్టంచేయటం నా కిష్టంలేదు. అదీకాక..." అని మధ్య లోనే ఆపేసింది.

"అదీకాక?...అదీకాక ఏమిటి?" అని రెట్టించాను.

"అదీకాక, ఆత్మార్పణం చేసినతరువాత నాదంటూ నాదగ్గర ఏమీలేదు" అన్నది భాష. ఎవరికి ఆత్మార్పణ చేసిందో నాకు తెలుసు...నిస్సహాయుడనై నిలబడిపోయాను.

"మీరు నాకేదో దారిచూపిస్తారని ఆశతో వచ్చాను" అన్నది మళ్ళీ.

ఒక్కసారి తలఎత్తి ఆ ముగ్ధమోహనమూర్తిని కనులారా చూశాను. ఆమెలో మతాంతాలూకు చిహ్నలేమీ నాకు కనిపించలేదు. మతాలకీ కులాలకీ చిహ్నలంటూ ఏమీ లేవని అప్పుడే మొదటిసారి తెలుసుకున్నాను. ఈ ప్రపంచంలో మతాలూ కులాలూ ఉత్త అసత్యాలని, మానవత్వం ఒక్కటే మహాసత్యమనీ కూడా అప్పుడే గ్రహించాను. ఒక్కసారి భాషాపాదాలమీదపడి 'భాషా! మనిద్దరమూ ఎక్కడికైనా వెళ్ళిపోదాం పద' అందామనిపించింది. ఆమాట అనటానికే భాషావంక చూశానుకూడా. ఈ రెండుమూడుక్షణాల్లో నామనసులో కొన్నిఏళ్ళచరిత్రి కనిపించింది.

అమ్మపవిత్రత. నాన్నగారిగౌరవం, నా జమీందారీ దర్జా, ఇంట్లోఉన్న కోదండరామస్వామివిగ్రహాలు, వైదేహి మాతృత్వమూమది, అన్నీ ఒకదానితరువాత ఒకటి నా మనసులో

నాటకంలా కనిపించినయ్. 'పద భామా! నువ్వే నా సర్వస్వం' అందామనుకున్న నేను "ఏసంగతీ తరువాత చెపుతాను. ఇక వెళ్ళు" అన్నాను. భామా తనసర్వస్వాన్ని పోగొట్టుకున్న దీనపాంథురాలిలాగా నావంక చూసింది. ఆ చూపు నే నెన్నటికీ మర్చిపోలేను. భామా వెళ్ళిపోయినతరువాత నేలమీదపడి చాలాసేపు దుఃఖించాను. కాని ఏమీ జరుగలేదు. భామా వెనుకాల పరుగెత్తి 'భామా! వెనక్కి రా' అందామనిపించింది. కాని లేవలేకపోయినాను. భామా లేకుండా బ్రతకటం చాలా కష్టమని అప్పుడే నిర్ణయించుకున్నాను. తెల్లవారగానే వెళ్ళి భామాపాదాలమీదపడి క్షమించమని ప్రార్థించాలనిపించింది. నేను మగవాడిని. ఎక్కడయినా బస్తాలు మోసి అయినా భార్యని పోషిస్తా అనేనిర్ణయానికి వచ్చేశాను. ఏడ్చి ఏడ్చి తెల్లవారుఝామున ఎప్పటికో నిద్రపట్టింది.

నాకు తిరిగి మెలకువవచ్చేసరికి జ్వరం పేలిపోతున్నది. నా తలదగ్గర నాన్నగారు కూర్చునిఉన్నారు. అంతమట్టుకే నాకు తెలుసు. వెంటనే మళ్ళీ స్పృహతప్పిపోయింది. ఆ జ్వరం జ్వరం మంచంమీదకాలు కిందపెట్టేసరికి నెలఅయింది. నేను మళ్ళీ స్కూలులో చేరటానికి బందరు వచ్చినరోజునే మండేవాళ్ళింటికి వెళ్ళాను.

వాకిట్లోనే భామా ఎదురయింది. నన్నుచూసి పలకరించకుండా లోపలికి వెళ్ళిపోయింది. ఇంట్లో ఎవ్వరూ లేరు. అస లేం జరిగిందో నాకు తెలియలేదు. కొన్నిక్షణాలు తటపటాయించి నేనే లోపలికివెళ్ళాను. దేముడిమందిరంముందు నిశ్శబ్దంగా నిలబడిఉంది భామా.

"నేను వచ్చాను భాషా! పద, వెళ్లిపోదాం" అన్నాను. భాషా జవాబు చెప్పలేదు. "ఆ రాత్రి నేను పొరపాటు చేశాను. నువ్వులేకుండా నేను బ్రతకలేనని నిర్ణయించుకున్నాను. వెంటనే వద్దామంటే జ్వరపడ్డాను. మావాడు తీసుకెళ్లారు" అన్నాను. అప్పటికీ భాషా మాట్లాడలేదు. నేను తెల్లబోయి ఆమె కెదురుగుండా వెళ్లాను. ఆమె మెడలో మంగళసూత్రాలూ నల్లపూసలూ కనిపించినయ్."

"ఘోరం" అన్నాడు వెంకటరత్నం.

ప్రసాదరావుగారు జీవంలేని నవ్వు నవ్వి "నాకు తల తిరిగింది. అక్కడ ఒక్క క్షణమయినా నిలబడలేక, ఇంటికి వచ్చేశాను... మళ్లీ జ్వరం తిరగబెట్టింది. చదువు మానేశాను. మళ్ళీ నాలుగేళ్ళదాకా బందరు ఎంతఅవసరంవచ్చినా వెళ్ళలేదు" అన్నారు.

"కథ చాలా చిత్రంగాఉంది. నీ ఈ ఇతివృత్తంలో ఒక గొప్ప సౌందర్యంఉంది మామయ్యా! ప్రపంచంలో కని పించే నీలాటి ప్రతి గంభీరవ్యక్తికీ వెనక ఇలాటిదే ఏదోఒకటి ఉంటుందా? అనిపిస్తోంది. బ్రతుకు ఎంతచిత్రం! ఇదంతా ఏ నవలలోనో చదివితే కన్నీరుకారుస్తాం" అన్నాడు వెంకట రత్నం.

"మంచినిర్ణయాలు లోకానికి చెడుగా కనిపిస్తాయి. ఆ భయంతోనే ఆలస్యంగా మనం నిర్ణయానికొస్తాం. అప్పటి కంతా మించిపోతుంది" అన్నారు విషాదంగా ప్రసాద రావుగారు.

"క్షమిస్తే రచయితగా రెండుముక్కలు చెపుతాను మామయ్యా! అసలు జ్ఞాపకమనేది ఒక విషాదసంఘటనలగుత్తి. అప్పుడప్పుడు ఆ గుత్తిలో కళాత్మకమైన ఒక మనోహరపుష్పం వికసిస్తుంది. ఇలాటి అనుభవమే నాకు జరిగిఉంటే ఎంత బావుంటుందా? అని నా కనిపిస్తోంది... సరేలే మామయ్యా, గతం గతంలోని సౌందర్యం గతించడంలోనే మరింత అందం సౌందర్యం ఉన్నది. తరువాత ఏంజరిగిందో చెప్పు"

"తరువాత ఏముంది? మొంతమందిచెప్పినా నేను మళ్ళీ చదువుకోలేదు. ఈ సంఘటన విషయంకూడా ఎవరికీ తెలియదు. అది జరిగినతరువాత నే పెళ్ళిచేసుకోకతప్పలేదు... నిజం చెప్పాలంటే, రాజ్యలక్ష్మిని భార్యగాచూశాను గాని, ఆత్మీయురాలిగా చూడలేదు."

"సరే, అదలాఉండనీ. నాలుగేళ్ళతరువాత మళ్ళీ బందరు వెళ్ళానన్నావుగదా, అప్పుడు చూడలేదా?"

"భాషాని నేను మళ్ళీచూస్తానని అనుకోలేదు. కాని, అనుకోకుండా నరసయ్య కనిపించి అన్నివిషయాలూచెప్పాడు"

"ఏమిటవి?" ఆదుర్దాగా అడిగాడు వెంకటరత్నం.

భాషా తనని పెళ్ళిచేసుకుందిగాని, సుఖపెట్టటంలేదట. తనతో ఏనాడూ మనసిచ్చి మాట్లాడలేదనీ, ఎప్పుడూ దేముడి మందిరంముందే కూర్చుంటుందనీ చెప్పి, నన్ను బలవంతంగా వాళ్ళింటికి తీసుకువెళ్ళాడు"

"చిత్రంగాఉంది. మళ్ళీ ఎలా వెళ్ళావు?"

"నిజంచెప్పాలంటే, నాలుగేళ్ళతరువాత నా ప్రాణబంధువుని ఒకసారి చూద్దామనిపించింది. మేము వెళ్ళేసరికి

భాషా బియ్యంలో రాళ్ళేరుతోంది. ఆమెచుట్టూ ముగ్గురు పిల్లలు ఉన్నారు. మమ్మల్ని చూసి లోపలికి వెళ్ళిపోయింది. నరసయ్య నావంకచూసి 'ఇదీ వరస' అన్నాడు. నే నేమీ మాట్లాడకుండా ఆ పిల్లల్నిచూస్తూ నిలబడ్డాను.

"అయితే భాషా తురకపిల్లని నరసయ్యకి తెలియదా?" అని ప్రశ్నించాడు వెంకటరత్నం.

"అప్పటికి తెలియదు. ఆ సావిట్లోనే ఒకమూల మండే పక్షవాతంతో మంచంలోపడిఉన్నాడు. నేను అతనిదగ్గరకి వెళ్లే సరికి పరమానందపడిపోయి, ఒంటిచేత్తో నమస్కారంచేశాడు నే నతనిమంచంపక్క కుర్చీలో కూర్చున్నాను. 'మామతో మాట్లాడుతూఉండు. నేను బజారుపని చూసుకువస్తాను' అని నరసయ్య వెళ్ళిపోయినాడు.

నరసయ్య వెళ్ళిపోవటం చూసి, నన్ను దగ్గరగా ఒంగ మని సౌంజ్ఞచేశాడు మండే - నేను ఒంగాను. "పొరపాటు చేశాను బాబూ! భాషామనసు తెలుసుకోకుండా దానిగొంతు కోశాను" అన్నాడు. నా యీ రహస్యప్రణయగాథ మండే గ్రహించాడన్నసంగతి నాకు చాలా ఆశ్చర్యాన్ని కలిగిం చింది. నే నేమీ మాట్లాడలేదు. మండే మళ్ళీ ప్రారంభిం చాడు.

"దానిమనసు అందనిదానికి ఆరాటపడ్డది. పోనీ ఆ సంగతిఅయినా అది మనసువిప్పి నాతో చెప్పలేదు. కిమ్మన కుండా ఆ దౌర్భాగ్యుడిని పెళ్ళిచేసుకొంది. నాలుగేళ్ళకీ ముగ్గురుపిల్లలు. ఈ నాలుగేళ్ళనుంచీ అది అయిదారుమాటలు మాట్లాడిందేమో! ఎప్పుడూ ఆ దేముడిమందిరంలో కూర్చుని

ఏడుస్తూఉంటుంది" అన్నాడు మండే. నేను మండేదగ్గరనుంచి లేచి సరాసరి లోపలికి వెళ్ళాను. భాషా కత్తిపీటమీద కూర్చుని కూరతరుగుతున్నది. తలెత్తి నావంక చూడలేదు. "భాషా!" అని పిలిచాను. హటాత్తుగా తలెత్తిచూసి "ఈ రోజు మీరు నాచేతివంట తినాలి. గుర్తుందా మీరు అన్నారు – ఈ చేతిమీదుగా వచ్చినపదార్థం ఎప్పుడూ పవిత్రమేనని" అన్నది.

"నాకు చాలా సంతోషంఅనిపించింది" తప్పకతింటాను భాషా. మరి కూరలేంచేస్తున్నావు?" అంటూ పీటవాల్చుకుని కూర్చున్నాను.

భాషా నవ్వుతూ "మీ కేంకావాలో చెపితే అవే చేస్తాను" అన్నది.

"నాకు ఏదికావాలో నాకంటే నీకే బాగాతెలుసు" అన్నాను. భాషా మాట్లాడలేదు. ఆ చిన్న వంటఇల్లూ, సర్వస్వాన్నీ నాకు వంచి వడ్డిస్తున్న ఆ త్యాగమూర్తి ఈ జీవితంలో ఏనాటికీ మరిపురారు. ఆరోజు భాషాచేతిభోజనం చేశాను. శూద్రపిల్లా తురకపిల్లాకూడా అయిన భాషాచేతి భోజనం నాలో ఏవిధమైనమార్పూ తీసుకురాలేదు. ఏ వైదేహమ్మగారికో,ఆ విషయం తెలిస్తే, జీవప్రాయశ్చిత్తం చేయించేది. అదలా ఉండనీ, నేను భోజనంచేసి చెయ్యికడుక్కున్న తరువాత భాషావచ్చి నాకు నమస్కారంచేసింది. నేను తెల్లబోయి ఇదేమిటన్నట్లు చూశాను.

"ఈరోజుకోసమే నేను ఎదురుచూస్తున్నాను, నేను మిమ్మల్ని ఎంత ఆరాధించినా, మీమీద ప్రేమాలో నన్ను

మీరు ప్రేమించలేదని, మీ కులగౌరవాల్ని నాకోసం వదులుకోరనీ ఒక అనుమానం నన్ను పట్టిపీడిస్తున్నది. ఆ అనుమానం ఈరోజు తీరిపోయినది. ఈ అభాగ్యురాల్ని మీరూ అభిమానిస్తున్నారు'' అన్నది. నే నప్పుడు మహా సాహసం చేశాను. 'అది చెయ్యకపోయినా బాగుండేది. వీధితలుపు గడియవేసి ఉన్నది. మండే మంచంలోంచి లేవలేను. ఈ రెండువిషయాలూకూడా నాచేత పొరపాటుచేయించినయ్.

"అలా అన్న భాషాని గట్టిగా నా గుండెలకి అదుముకున్నాను. నేను పోగొట్టుకున్న అమూల్యమణిని తిరిగి ధరించాను. కాని, అలా చేయకుండా ఉంటేనే బాగుండేది. నరసయ్య రాకముందే నేను అక్కడినించి వచ్చేశాను'' అని కళ్లుమూసుకున్నారు ప్రసాదరావుగారు. మూసిఉన్న ఆయన కళ్ళల్లోంచి కన్నీళ్ళు చెంపలమీదుగా జారి మడతకుర్చీగుడ్డ మీద టపటపా పడ్డయ్.

ఇదిచూసిన వెంకటరత్నం నిట్టూర్చి "తరువాత ఏం జరిగింది?'' అన్నాడు.

"ఆరాత్రే భాషా చనిపోయింది'' అన్నారు ప్రసాదరావుగారు. వెంకటరత్నం అదిరిపోయినాడు. కొంచెం సేపటికి తెప్పరిల్లుకొని "ఈ జీవనస్రవంతిలో ఉన్న సుడిగుండాల్లో కొట్టుకునే మనం అప్పుడప్పుడు నటకులం మాత్రమే కాకుండా ప్రేక్షకులకిందకూడా మారిపోతాం. విషాదాంతనాటకంలో ఆఖరిరంగంలా ఆ మైత్రికూడా ముగిసిపోయింది... అ దెలా జరిగిందో చెప్పు మామయ్యా'' అన్నాడు.

“న్యాయంగా భామలాంటి స్త్రీ అలాగే చేస్తుంది. ఆ విషయం నేను ఏమాత్రం గ్రహించగలిగినా, ఆమె పెట్టిన అన్నం తినేవాడిని కాదు. ఆ కొన్నిగంటలూ తన ధర్మపత్నిత్వపు హక్కుని నానుంచి పొందగలిగిన భామ, ఆతరువాత మరి జీవించలేకపోయింది. ఆమె చేష్టలలో మాటలలో ఆసంగతి వ్యక్తంచేసిందికూడా. నేనే గ్రహించలేకపోయినాను. తను చనిపోతూ నరసయ్యకి ఉత్తరం వ్రాసిపెట్టింది. తను తురక పిల్లననీ, తన అంత్యక్రియలు మహమ్మదీయ సంప్రదాయం ప్రకారం చెయ్యమనీను. నరసయ్య ఎవరికీ తెలియకుండా అలాగే చేసి, ప్రాయశ్చిత్తంచేయించుకుని, మళ్ళీ పెళ్ళి చేసుకున్నాను. ఆ తరువాత మండేని చూడటానికి ఒకసారి వెళ్ళాను. మండే ఇటూ అటూ చూసి, లోపల్లోంచి ఒక వస్తువు తీసి “తీసుకోండి బాబూ! ఇది భామది” అన్నాడు. అది బంగారు వడబిళ్ళ. తరువాత రెండు మూడు నెలలకే మండేకూడా పోయినాడు. ఈ విషాదనాటకంలో నాది నాయకపాత్ర అయినా, నాకేం దెబ్బతగల్లేదు. బ్రతికే ఉన్నాను.” అని నిశ్శబ్దంగా దుఃఖించటం ప్రారంభించారు ప్రసాదరావుగారు.

“బ్రతుకులో ఎన్నో దుఃఖాలున్నాయి మామయ్యా. వాటిరూపాన్ని అర్థంచేసుకోవాలంటే, – వాటిని అనుభవించి తీరాలి. ఆ నిప్పులో అడుగువేయాలి. అయినా, చివరకు మిగిలే అనుభవం మనకి మహోన్నతమైన రసానుభూతి కలిగిస్తుంది. నీవు తెగించి ఆ అమ్మాయిని పెళ్ళిచేసుకుంటే, ఈ ఆకర్షణా, ఈ మధురస్మృతిశాలూను మహావేదనా నీకు అనుభవంలోకి

వచ్చేవికాదు. కులానికీ స్థితికీ దూరమై ఎక్కడో అర్థంలేని బ్రతుకు బ్రతికేవాడివి. ఇదే మంచిది మామయ్యా! ఇలా జరగటంలోనే అందంఉన్నది" అన్నాడు వెంకటరత్నం.

"అలా అనుకోక చేసేదిమాత్రం ఏముంది? ఇంకో విషయంకూడా చెప్పాలి నీకు"

"ఏమి టది?"

"భాషా చనిపోయినాకే నాకు దగ్గరయింది. ఆమె చనిపోయింది. బందరులో, సెప్టెంబరు 23వ తారీఖున మధ్యాహ్నం భాషా నాకు భోజనంపెట్టింది. ఆరోజు సాయంత్రమే నేను మనఊరు వెళ్ళిపోయినాను. నేను బస్సు దిగి ఊళ్ళోకి వెళ్ళేసరికి ఆరుగంటలయింది. స్నానంచేసి భోజనంచేసి ఉత్తరపువేపుగదిలో పందిరిమంచంమీద పడుకుని చాలాసేపు రోమియోజూలియట్ చదివాను. బాటసారి మనస్సుల్లో రోమియో నేనే అనిపించింది. వందల సంవత్సరాల క్రితం చనిపోయిన జూలియట్ నా ప్రాణాన్ని పిండివేసింది. నాకు రాత్రి ఒంటిగంటకు కొద్దిగా కునుకుపట్టింది.

ఆ కలతనిద్రలో ఏదో సంగీతధ్వనిలాంటిది క్రమక్రమంగా దగ్గరకి రావటం మొదలుపెట్టింది. నాకు మెలకువ వచ్చింది. కళ్లుతెరిచి చూశాను. భాషా నా పక్కన కూర్చుని ఉంది. నేను ఖంగారుపడి తలుపువంక చూశాను. నేను పడుకోబోయేటప్పుడు ఆ తలుపుతీసేఉంది. ఇప్పు డది మూసి ఉన్నది. భాషా వేసిఉండాలి. నేను భాషాని కౌగలించుకుని "ఏమి టీ అఘాయిత్యం?" అన్నాను. ఆ కౌగిలిలో గాఢత లేదనేసంగతి నే నప్పుడు గ్రహించలేదు. నా ప్రశ్నకి సమ్మా

ధ్యానంగా భాషా నవ్వింది. "ఈ అర్ధరాత్రివేళ మెలా రాగలి గావు !" అని మరోసారి ప్రశ్నించాను.

"మిమ్మల్ని ఒకసారి చూడాలనిపించింది. అనుమతి తీసుకుని వచ్చాను"

"ఎవరి అనుమతి తీసుకున్నావు ?" అని ఆశ్చర్యంగా అడిగాను.

భాషా విచిత్రంగా నవ్వుతూ "అల్లాది" అన్నది. అప్పట్లో ఆమాటకు అర్థం తెలియక నవ్వాను. "ఏం నమ్మకం లేదా ?" అని తనుకూడా నవ్వింది. ఆ దివ్యసుందరిని ఏం చేసుకోనా అనిపించింది. "భాషా ! మనిద్దరం లేచి పోదామా ?" అని అడిగాను. భాషా అదిరిపడి "ఆ సంగతి నిన్న ఎందుకు అడగలేదు ?" అన్నది.

"నిన్నయితేనేం ? ఇవ్వాళఅయితేనేం ? ఇప్పు డడి గానుగా" అన్నాను.

భాషా నావంక జాలిగా చూసి"నిన్న అడిగితే ఈపని చేయలేకపోయేదాన్ని" అన్నది.

నేను తెల్లబోయి "ఏపని ?" అన్నాను.

భాషా నా పక్కలోంచి లేచి నుంచుని "ఇక నేను వెళ్ళాలి. నాకు టైములేదు" అని జాలిగా నావంక చూసి, నా పాదాలమీద రెండుచేతులూ ఆనించి నమస్కరించింది. ఆ స్పర్శ నాకు చాలా చల్లగా అనిపించింది. తరువాత తలుపుతీసుకుని వెళ్ళిపోయింది. నేను లేద్దామని యెంత ప్రయత్నించినా అరగంటదాకా లేవలేకపోయినాను. తరు వాత ఇల్లూ వాకిలీ అన్నీ గాలించాను. భాషా కనిపించలేదు.

తెల్లవారిన తరువాత బందరు వచ్చాను. నేను వెళ్ళేసరికి భాషామృతకళేబరం వాకిట్లో ఉంది. రాత్రి పన్నెండూ ఒంటిగంటాప్రాంతంలో ఆమె చనిపోయిందట. ఎలా చనిపోయిందీ ఎవరికీ తెలియదు'' అని ఆగారు ప్రసాదరావు గారు. వెంకటరత్నం ఒకవిధమైన జలదరింపువలన ఆపాదమస్తకం వణికిపోయినాడు. కొంచెం సేపయినాక "ఇంతకూ ఆమె చనిపోయినతరువాత నీకు కనిపించిందంటావా ?'' అన్నాడు.

"అనే చెప్పాలి. ఆ రాత్రి నా గదిలోంచి అందమైన ఆడపిల్ల వెళ్ళటం చూశానని వెంకడూ అన్నాడు."

"అదంతా భ్రమకాకూడదూ ?''

"కావచ్చును. కాని, ఆ రాత్రి భాషా నా పాదాల్ని ముట్టుకున్నచోట ఇప్పటికీ స్పర్శజ్ఞానంలేదు. అదికూడా భ్రమేనంటావా ?''

"విచిత్రంగాఉంది !''

"విచిత్రంగానేఉంది. నా ప్రాణప్రదమైన భాషాని శాశ్వతంగా భూస్థాపితం చేసి ఇంటికివచ్చిన తరువాత మళ్ళీ జ్వరపడ్డాను. కొంచంకోలుకున్నాక తీర్థయాత్రలు చేసి సంవత్సరానికి ఇంటికి వచ్చాను'' అని కథ ముగించారు ప్రసాదరావుగారు.

"ఎప్పుడూ కరణీకంలెక్కలలో పడి కొట్టుకుంటూ, అతిసామాన్యంగా ఉండే ని మనసులో ఇంత వ్యథఉన్నట్లు ఎవరికీ తెలియదు. అదే చిత్రం మామయ్యా ! చండీదాసు 'మానవుడా ! సృష్టిలో అన్నిటికన్నా అతివిచిత్రం నువ్వే''

అంటాడు అదిసరే, ఈ కథ నా కెందుకు చెప్పినట్లు ?''
అన్నాడు వెంకటరత్నం.

"ఈ వరాలు నా భామాతురకు '' అని జవాబి
చ్చారు ప్రసాదరావుగారు.

"ఏమిటీ?'' అని ఆశ్చర్యంతో కళ్లు పెద్దవిచేసిన
వెంకటరత్నం "అవును, నువ్వు వెంకటనరసయ్య కూతురన్న
ప్పుడే నేను గ్రహించిఉండాల్సింది. ఇంతకూ ఇప్పుడున్న
తల్లి ఎవరు?'' అన్నాడు.

"వెంకటనరసయ్య రెండవభార్య. సవతిపిల్లలు
ముగ్గురినీ, తన పిల్లలిద్దరినీ ఆవిడే పెంచింది. భామాతురకపిల్ల
అన్నసంగతి ఎవరికీ తెలియదు. ఆ రహస్యం తెలిసినవాడిని
ఇప్పుడు నే నొక్కడినే బ్రతికిఉన్నాను. నువ్వీ రహస్యం ఎవ
రితోనూ అనకు'' అన్నారు ప్రసాదరావుగారు.

వెంకటరత్నం మాట్లాడలేదు.

"నీవు నా స్నేహితుడవని ఈ కథ చెప్పాను. అది
చెపుతున్నంతసేపూ నా సిద్ధాంతాన్ని మర్చిపోయాను. ఈ కథ
మర్చిపోయి నిద్రపో. నేను నీ మేనమామగా తిరిగి మారి
పోతాను'' అన్నారు ప్రసాదరావుగారు.

"సరే మామయ్యా! దునియా ఏక్ ముసాఫిర్ ఖానా
—ఎవరికెవరో'' అని ఒత్తిగిలిపడుకున్నాడు వెంకటరత్నం.
రాజా ఎప్పుడు వచ్చిందీ ఎవరూ చూడలేదు.

౨

వెంకటరత్నం రచయిత. అత డెప్పుడూ రచయిత
గానే ఉంటాడు. అన్ని విషయాలూ అన్ని సంఘటనల్లూ

రచయితదృష్టిలోంచే చూస్తాడు. అతని రచనాప్రతిభ చాలా పదునైనది. గొప్పరచయితకి కావలసిన పరిశీలనాత్మకమైన దృక్పథం భగవంతుడు అతనికిచ్చిన వరం. అన్ని ముఖాలనీ అన్ని స్వభావాలనీ అతను అదే దృష్టితో చూస్తాడు. ఎక్స్‌రే తీస్తాడు.

మనుష్యులతాలూకు విభిన్నమైన మనస్తత్వాలని వివిధ కోణాలనుంచీ పరిశీలించి ఫ్రేముకట్టి పదిలపరుస్తాడు. ఆ తరువాత వాటినన్నిటినీ తన కథల్లోనూ నవలల్లోనూ ఇమిడేటట్లు వ్రాస్తాడు. జీవితాలనుంచి కథావస్తువు తీసుకోవటంతో అతని రచనలు చాలా ఉత్తమ శ్రేణికి చెందుతాయి. మామూలు రచయితలలాగా కాకుండా అంతకుమించిన మరో విచిత్రం ఇతని రచనల్లో కనిపిస్తుంది. జీవనస్రవంతిలో తానూ నటుడే అయినా ఎప్పుడు కావాలంటే అప్పుడు సామాజికుడుగా, మారిపోతాడు. అందుచేతనే, అతని రచనలు జీవితానికి కార్బన్లు.

అతను వ్రాసిన ప్రతి కొత్త రచన ఒకవిధమైన సంచలనాన్ని లేవతీసేది. ఎవరిమటుకు వారు అవి చదువుకుని భుజాలు తడుముకునేవారు. కాని అతను ఎప్పుడూ వ్యక్తిగత దూషణ చేయలేదు. అతని సిద్ధాంతాలుకూడా చాలా తమాషాగా ఉంటయ్.

అలాంటి వెంకటరత్నానికికూడా మేనమామ చెప్పిన కథ చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. అన్నిటికన్న చిత్రం ఆమె చనిపోయినాక కనిపించటం. తన మేనమామ ఎప్పుడూ అబద్ధంచెప్పడు. ఒకవేళ అది ఆయన భ్రమకూడా కావ

చ్చును. ఈ ఆలోచనలతో కలతనిద్రపోయిన వెంకటరత్నం తెల్లారగానే "ఆ జడబిళ్ళ ఏమయింది?" అని అడిగాడు. ప్రసాదరావుగారు నిట్టూర్చి "అదీ పోయింది" అన్నారు. ఆ మధ్యాహ్నం ఆయన వెళ్ళిపోయినారు.

తనూ వరాలూ స్వేచ్ఛగా తిరుగుతున్నా ఏమీ అనని వెంకటరత్నాన్నిచూసి రాజా ఆశ్చర్యపోయి ఒకసారి అడిగేశాడుకూడా. వెంకటరత్నం విరాగిలా ముఖంపెట్టి "ఈ ప్రపంచంలో ఒకరికొకరు నీతులుచెప్పేందుకు పుట్టలేదు. ఆ అర్హతకూడా లేదు" అన్నాడు.

"ఈమాటకు అర్థంఏమిటో మరోనాడు ఆలోచించి తేల్చుకుంటాను - రాత్రికి వరాలునాటకం బుట్టయ్యపేటహాల్లో ఉంది. వస్తావా?"

"తప్పకుండా వస్తాను"

ఆరాత్రికి ఇద్దరూ నాటకానికి వెళ్ళారు. దమయంతి వేషంలో వరాలు అద్భుతంగాఉంది. ఆ అందాన్ని చూసి, వెంకటరత్నమే ముగ్ధుడయిపోయినాడు. రాజా మెల్లిగా "రాజుగారు దాన్ని పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నారా?" అన్నాడు. వెంకరత్నం ఆ మాటకి అతి మామూలుగా "చేసుకోనీ" అని సమాధానం ఇచ్చాడు.

"చేసుకోనీ; ఇప్పుడు అభ్యంతరం నాకు కాదు, దానికే. నాకు ఉంపుడుగత్తెగాఅన్నా ఉంటుందటగాని, వాడిని పెళ్ళిమాత్రం చేసుకోదట" అన్నాడు రాజా. వెంకటరత్నం ఉలిక్కిపడ్డాడు. భాషాకూడా సరిగ్గా ఇలానే అంది. ఆమెకూతురు ఈ పిల్ల.

ఇంక చిత్రం ఏమిటంటే, భాషా అచ్చంగా మహమ్మదీయుల పిల్ల. వరాలులో హిందూరక్తంకూడా ఉంది. కొంచెం సాహసం ఎక్కువ. "సరే, అయితే; ఇప్పుడేం చేస్తావు ?'' అని ప్రశ్నించాడు వెంకటరత్నం.

"చెయ్యటానికేముంది ? వరాలు ఎలాచెపితే అలాగే చేస్తాను."

మీ నాన్న అలాచేయలేదని బ్రతికిఉన్నంతవరకూ బాధపడుతూనే ఉంటాడు. అలాచేసి నీవు సుఖపడతావో, పడవో చూడాలి అనుకున్నాడు వెంకటరత్నం, కేవలం ఈ లోకానికి సామాజికుడుగా మారిపోయి.

వీళ్ళు నాటకంచూసి, ఇంటికి వెళ్ళేసరికి పూర్ణా, ప్రసాదరావుగారూ వచ్చారు. ప్రసాదరావుగారి మొగాన నెత్తురుచుక్కలేదు. పూర్ణ మొగంకూడా ఇంచుమించు అలాగే ఉంది. ఇద్దరూ ఇంట్లో అడుగుపెట్టగానే ప్రసాదరావుగారు ఎదురుగావచ్చి "కొంచెం అలా పోయివద్దాం రారా'' అని వెంకటరత్నాన్ని తీసుకెళ్ళారు. రాజు ఆశ్చర్యంతో నిలబడిపోయి ''ఏమి టక్కయ్యా ఇది?'' అని అడిగాడు. పూర్ణ సమాధానంచెప్పకుండా పోయి పడుకుంది. ఇక రాజుకూడా ఆట్టే తరచకుండా పోయి పడుకున్నాడు.

మేనమామా మేనల్లుడూ పోయి ఒక రోడ్డుమొదట్లో నిలబడ్డారు. ఇంతమటుకు ఇద్దర్లో ఎవరూ మాట్లాడలేదు. వెంకటరత్నం విషయం గ్రహించేశాడు. ప్రసాదరావుగారు విషయంఅంతా వివరించినాక

"అసంభవం మామయ్యా. ఒదిన అలాటిది కాదు" అని జవాబిచ్చాడు.

"కాదనే నాకూ నమ్మకం. అయినా…"

"అయితే ఇప్పు డేం చేద్దామని?"

"మద్రాసు వెడదాం. నువ్వూ రావాలి" అన్నారు ప్రసాదరావుగారు. ఆయనమొహంలో అసలు రక్తమన్నది ఉన్నదా లేదా అనిపిస్తున్నది. కొంచెంసేపయినాక, రెండు చేతులతో మొగంకప్పుకుని బావురుమన్నా రాయన. వెంకట రత్నం ఆయనభుజంమీద చెయ్యివేసి,

"ఏమిటి మామయ్యా ఇది! ఇంత అధైర్యమయితే ఎట్లా?" అన్నాడు.

"అధైర్యంకాదు నాయనా! జీవితం నన్ను ఇంత తిప్పలుపెడుతోం దేమిటా అని" అన్నారు. వెంకటరత్నం కొన్నిక్షణాలు ఆలోచించి

"నే నో సలహాచెపుతా విను మామయ్యా! ఆ పల్లె టూరినించి కాపురంఎత్తివెయ్యి" అన్నాడు.

"నేనూ అదే అనుకుంటున్నాను. మద్రాసునించి వచ్చాక ఆ పనే చేయాలి."

"నువ్వు ఈ చిన్నవిషయానికే బెంబేలుపడిపోకు. ఏదోఒకటి జరుగుతుంది" అన్నాడు వెంకటరత్నం. ప్రసాద రావుగారు అతనివంక విచిత్రంగా చూసి "ఇది చిన్నవిష యమా?" అన్నారు.

"చిన్నవిషయం కాకపోవచ్చును. ఆ విషయం నాకూ తెలుసు. ఒక్కమాట చెపుతాను విను మామయ్యా. ఉన్న

తుడైనవ్యక్తికి ఆ ఔన్నత్యమే ఒక శాపం. తోటివాళ్ళమాదిరిగానే ఉంటే, బ్రతుకు సాఫీగా నడిచిపోతుంది. కాని నువ్వూ నేనూ వేరు. నీకు హోదా, డబ్బు ఉన్నాయి. నాచేతులో కలం ఉన్నది. ఒదినకు సౌందర్యం ఉన్నది. ఇవి ఒకవిధంగా వరాలేగాని, మరొకవిధంగా శాపాలుకూడాను. అందుకు ఫలితం, మనసుఖం మరింత సుఖంగా ఉంటుంది. మనకష్టం మరింత కష్టంగాఉంటుంది. పద, ఇంటికి పోదాం" అని దారి తీశాడు వెంకటరత్నం. నిశ్శబ్దంగా అతనిని అనుసరించారు ప్రసాదరావుగారు.

ఆకాశంలో పాలపుంత క్రమక్రమంగా మసకవేస్తున్నది.

౮

మద్రాసు రాయపేట హాస్పిటల్లో పూర్ణ ఒకమంచం మీద పడుకునిఉంది. ఆమెమంచంప్రక్కన వెంకటరత్నం కూర్చునిఉన్నాడు. కొన్నిక్షణాలయాక పూర్ణ ఏడుస్తూ,

"వెంకటరత్నం! నీ దృష్టిలో నేను చాలా నీచురాల్ని కదూ ఇప్పుడు?" అన్నది. వెంకటరత్నం మాట్లాడలేదు.

"అవును, నువ్వు మాట్లాడకపోవటంలోనే ఆసంగతి తెలుస్తున్నది."

"ఇప్పుడా చర్చ దేనికి? కొంచం విశ్రాంతితీసుకోరాదూ?" అన్నాడు విసుగ్గా అతను.

"నేను చాలా పొరపాటుచేశాను. ఆ సంగతి నాకూ తెలుసు, ఆ పొరపాటు నేను నీదగ్గర ఒప్పుకున్నానుకూడా.

కాని నాన్నగారి మొహం ఎలాచూడను?" అని మళ్ళీ ఏడవ టం ప్రారంభించింది పూర్ణ.

"ఆ సంగతేదో నేను చూస్తాను. నువ్వాట్టే హైరాన పడకు."

"ఛీ ఛీ! పాడుబ్రతుకు!"

"ఒదినా!"

"ఇంకా నన్ను ఒదినా అనే పిలుస్తున్నావా?

"నీవు ఎన్నిపొరపాట్లుచేసినా నాకు ఒదినవే."

"నేను చాలా అదృష్టవంతురాల్ని."

"ఏమీ అనుకోకుండాఉంటే, నిన్నొకవిషయం అడగా లని ఉంది."

"అడుగు, నీదగ్గర నే నేమీ దాచుకోవాలని అను కోటంలేదు."

"అస లీ పొరపాటు ఎలా జరిగింది?"

"నిజంచెపితే నన్ను నిందించవుకద?"

"ఎప్పుడూ నిందించను. నువ్వంటే నా కెప్పుడూ గౌరవం ఉంటుంది."

"చాలు, ఇక నేను చెప్పాల్సింది ఏమీలేదు."

"మరి ఈ పొరపాటు?"

"ఏ పొరపాటూ జరుగలేదు. ఇది ఒకరకం జబ్బు. ఆ సంగతి నాకూ అమ్మకూ తెలుసు. కేవలం నీ మనసు తెలుసుకోవాలనేఉద్దేశ్యంతో నామీద నిందవేసుకున్నాను" అన్నది పూర్ణ. వెంకటరత్నం నిర్ఘాంతపోయినాడు. కొంచెం సేపయినాక తేరుకుని "మరి మామయ్య ఖంగారేమిటి?"

అన్నాడు. పూర్ణ కొంచంసేపు మౌనంగాఉండి "అదే నాకూ తెలియటంలేదు. దీన్నిబట్టి చూస్తుంటే నాన్నగారు నన్ను అనుమానిస్తున్నారా? అనిపిస్తున్నది" అన్నది.

"బహుశా ఆ అనుమానితుడిని నేను కాదుగదా?"

"అయిఉండవచ్చు. కాని నా కంత అదృష్టమా?" అని నవ్వింది పూర్ణ.

"మీ రంతా విచిత్రవ్యక్తులు ఒదినా. నువ్వు, రాజా, మామయ్య, అత్తయ్య, ఆఖరికి శాంతమ్మకూడా ఒక పెద్ద కొశ్చన్‌మార్కులా కనిపిస్తున్నారు. సరే, ఒకభారం తొలగి పోయింది. ఇది నిజమేమోఅని నేను చాలా బాధపడ్డాను" అన్నాడు వెంకటరత్నం.

ఇంతలో డాక్టరుఅడుగులచప్పుడు వినిపించింది. అతని వెంట ప్రసాదరావుగారుకూడా ఉన్నారు. ఆ డాక్టరు ఆరడుగుల వ్యక్తి. అతనిలో అందంకన్న సమర్థత కొట్టవచ్చినట్లున్నది. తెలివితేటల్ని వ్యక్తీకరించే కళ్లు లోకాన్ని ఎక్సురే దృష్టితో చూస్తూఉంటాయి.

ఒకవిధంగా అతను ప్రసాదరావుగారిలాగానే ఉంటాడని చెప్పాలి. సభారంజనమ్మకీ కృష్ణయ్యగారికీ పుట్టిననాడు అందరూ అలాగే అన్నారు. సభారంజనమ్మ పోయినాక అతను మద్రాసువదిలి ఆంధ్రదేశానికి రాలేదు. తన తల్లి ఎంత పవిత్రమూర్తిఅయినా తనస్థానం సంఘంలో అట్టే బలంగాలేదని అతనికి తెలుసు.

అయినా, అతనికి ఏవిధమైన విచారమూలేదు. యం. బి. బి. యస్. ప్యాసయి మద్రాసులోనే ప్రాక్టీసుచేస్తు

న్నాడు. రాయపేట హాస్పిటల్లో అతను ఆనరరీ సర్జన్. తల్లి అతనికి చాలా ఆస్తి ఇచ్చివెళ్ళింది. ఆర్థికంగా ఏలోటూ లేని ఆ డాక్టర్ ఫీజుకోసం ప్రాక్టీసుచేయటం ఏనాడో మాని వేశాడు.

పేషెంటుని చూసి మందిస్తాడు; డబ్బు వాళ్ళిస్తే పుచ్చుకుంటాడు, లేకపోతే లేదు. అందుకే మద్రాసునగరం లోని ప్రతి తెలుగువాడూ డాక్టర్ శంకరనారాయణ నర్సింగ్ హోమ్‌కే వెడతాడు.

ప్రసాదరావుగారు తన సోదరుడే. అయినా శంకరనారాయణ ఆయ న్నెప్పుడూ పేరుపెట్టిగాని, వరసపెట్టిగాని పిలవడు. ముభావంగా "మీరు" అంటాడు. ప్రసాదరావుగారుమాత్రం "శంకరం"అని పిలుస్తారు. ఈ పసివాడిని తనతండ్రి తొడమీద కూర్చోపెట్టుకుని లాలించటం ఆయనకి ఇంకా గుర్తే. చిత్రం ఏమిటంటే, వాళ్ళిద్దరిమనస్సుల్లోకూడా అదేదో తప్పనిగాని న్యూనతఅనిగాని అనిపించదు. ఇంకో చిత్రంఏమిటంటే, శంకరనారాయణకి రాజాఅంటే అపరిమితమైన ప్రేమ. ఆసంగతి పైకి ఆయన ఏనాడూ చెప్పలేదు. ఆ అవకాశం కూడా రాలేదు. తల్లి ఉన్నప్పుడు గుడివాడ వెడితే, తప్ప కుండా తండ్రినికూడా చూసివచ్చేవాడు. తల్లిదండ్రులిద్దరూ ఒకేసారి చనిపోయినప్పుడు అతనొకసారి వెళ్ళాడు. ఆతరువాత ఒకసారి ఆస్తివ్యవహారాలమీద వెళ్ళినప్పుడు రామమ్మ గార్ని చూసివచ్చాడు. ఆవిడ అతనితలమీద చెయ్యివేసి నిమురుతూ "నాయనా; నీ తల్లి అదృష్టవంతురాలు. నేనే

ఇంకా ఈ దుఃఖాన్ని మోయటానికి బ్రతికిఉన్నాను" అన్నది.

శంకరనారాయణ అవివాహితుడు. అతన్ని ఇంత మట్టుకు ఏ స్త్రీ ఆకర్షించలేదనే చెప్పాలి. ఆరడుగుల నిండు విగ్రహంతో స్టెతస్కోపు చేతులోపుచ్చుకుని రౌండ్సుకి వెడుతున్న ఆ డాక్టర్ అవివాహితురాలైన ప్రతినర్సుకీ అనుకోకుండా ఆశలు కల్పిస్తూనేఉన్నాడు.

ప్రసాదరావుగారు సరాసరి శంకరనారాయణ నర్సింగ్ హోమ్‌లోనే దిగి, పూర్ణని హాస్పిటల్లో చేర్పించాడు. తల్లి జబ్బుఅనుకోవటం, తన అనుమానం అన్నీ అతనికి చెప్పారు. శంకరనారాయణ మాట్లాడకుండా పూర్ణని పరీక్ష చేసి, ప్రసాద రావుగారితో

"మీరు పొరపాటుపడ్డారు. ఇది యూట్రస్‌కి సంబంధించిన వ్యాధి'' అన్నాడు. ఆ ముక్క ప్రసాదరావుగారికి అమృతంలాగా పనిచేసింది. ఎంతో బరువుదిగిపోయినట్లు ఆనందించా రాయన. అనవసరంగా అనుమానపడ్డందుకు తననితాను నిందించుకున్నారు. తరువాత నాలుగురోజులకి ఆపరేషన్‌చేసి ఓవరీస్ తీసేశారు. పూర్ణ త్వరలోనే కోలుకుంది.

౯

డాక్టర్ శంకరనారాయణ నర్సింగ్‌హోమ్‌లో అతని కన్సల్టింగ్‌రూమ్ చాలా చక్కనిది. వెంకటరత్నం, శంకర నారాయణా అదేరూమ్‌లో కూర్చుని సాహిత్యసింహావలోక

నం చేస్తున్నారు. సంచారి పేరుతో పత్రిజాతంత్రి వారపత్రి
కలో ప్రతివారం పడుతున్న వ్యాసాలు శంకరనారాయణ
వ్రాసినవే అని తెలిసి, వెంకటరత్నం ఆశ్చర్యపోయినాడు.
అందులో ఉపయోగించేభాష, భావాలూ అన్నీ చాలా
ఉదాత్తంగా ఉంటాయి.

"యేం? పైకి కనిపిస్తున్న నా రూపానికీ, నాలో ఉన్న
సుందరసాహిత్యానికీ పొంతన ఎలాకుదిరిందా? అని ఆశ్చర్య
పడుతున్నారుకదూ!" అని నవ్వాడు శంకరనారాయణ.

"మీరు ప్రాక్టీసుచేస్తూకూడా ఎలా వ్రాయగలుగు
తున్నారు?"

వెంకటరత్నం అడిగిన ఈ ప్రశ్నకి శంకరనారాయణ
చిరునవ్వునవ్వి, "ఈ ప్రశ్నే అందరూ అడుగుతూఉంటారు.
నిజంచెప్పాలంటే, నేను రచయితనుకాను. ఆ సంగతి గ్రహిం
చలేని మా స్నేహితుడొకడు నన్ను రచయిత అంటూ
ఉండేవాడు. ఒకసారి క్లబ్బులో పత్రిజాతంత్రిఎడిటరుతో
నేనో గొప్పరచయితనని పరిచయంచేశాడు. ఇక ఆ సంపా
దకమహాశయుడు నాచేత వ్రాయించటం ప్రారంభించాడు.
నేనుకూడా నా మిత్రుడిమాట అబద్ధంచేయటం ఇష్టంలేక
వ్రాస్తున్నాను. మరి ఎందుచేతో అవి అందరూ బాగానే
ఉందంటున్నారు" అన్నాడు.

వెంకటరత్నం నవ్వి "తమ రచనల్ని చదువుతుంటే
రచయితకన్న శాస్త్రజ్ఞుడు ఎక్కువగా కనిపిస్తాడు" అన్నాడు.

"సరే, ఆ సంగతి పోనీండి. పూర్ణకి పెళ్ళిచెయ్యమని
మీరు ప్రసాదరావుగారితో చెప్పకూడదూ?" అన్నాడు

శంకరనారాయణ. సంభాషణ సాహిత్యంమీదినుంచి ఇలా తిరిగేసరికి కాస్త కంగారుపడ్డాడు వెంకటరత్నం. కొన్ని క్షణాలు మాట్లాడకుండా ఊరుకుని,

"ఆ విషయంలో మామయ్య మనమాట వింటాడని నాకుతోచదు" అన్నాడు.

"మీ కింకోచిన్నరహస్యం చెపుతున్నాను. పూర్ణకి ఓవరీస్ తీసివేయాల్సివచ్చింది. ఆమె ఈ జీవితంలో తల్లి అయ్యేఅవకాశంలేదు ... కాని ...!

"కాని?"

"ఏంలేదు. ఇలాటికేసుల్లో కొన్నిచోట్ల దైహిక వాంఛ ప్రకోపించటం జరిగింది. దానివలన ప్రమాదంలేదు."

"దేహవాంఛ ఎక్కువకనుక పెళ్ళిచేయటం అవసరం అంటారా ?" అన్నాడు వెంకటరత్నం.

"అలాఅనికాదు... సరే పోనిండి, ఆ గొడవ. రాజా ఏమంటున్నాడు?"

"మీ రలా మాట మార్చివేయకండి మరి, నిజం చెప్పాలంటే పూర్ణ చాలా చిత్రమైనస్త్రీ. ఆమెరక్తనాళాల్లో రక్తానికిబదులు స్త్రీత్వమే ప్రవహిస్తోందని చెప్పాలి... పురుషుడిహృదయాన్ని పిండేతత్వం ఆమెది."

"డాక్టరుగా చికిత్సనయితే చేసేశాను... రచయితగా మీ అభిప్రాయంతో ఏకీభవిస్తున్నాను. మగవాడిహృదయాన్ని పిండే స్త్రీని చూస్తే ఆమె అంతర్యాన్నితప్ప మరేమీ తెలుసుకోవాలనిపించదు. ఆమెముందు నిలబడ్డవాడి స్థితి ఎలా తయారవుతుందంటే రోహిణీకార్తెలో ఐస్‌ఫ్రూట్

(17)

అమ్ముతున్న కుర్రాడిస్థితిలాగా తయారవుతుంది. ఇంతకూ మీరు ఆమెవిషయంలో ఇచ్చిన అభిప్రాయానికి ఆధారం నాకు కనిపించటంలేదు. మీ కెలా తెలుసుకోగలిగారో డాక్టర్‌గా అడగవచ్చునా?"

"తప్పక ... కాని, ఆ ప్రశ్నకి సమాధానం మీ రీపాటికే గ్రహించిఉంటారు" అన్నాడు వెంకటరత్నం. సరిగ్గా అదేసమయంలో ప్రసాదరావుగారు ఆగదిలో ప్రవేశించారు.

ఆయన వస్తూనే "ఇవ్వాళరాత్రికి వెళ్ళాలని అనుకుంటున్నామోయ్" అన్నారు శంకరనారాయణని ఉద్దేశించి.

"వెంకటరత్నంగారు చెప్పారు... క్షమిస్తే మీ కో సంగతి చెప్పాలని అనుకుంటున్నాను" అన్నాడు శంకరనారాయణ.

"తప్పకుండా చెప్పొచ్చును."

"ఏంలేదు, పూర్ణకి మళ్ళీ పెళ్ళిచెయ్యటం మంచిదేమో అనుకుంటాను."

కొంచెంసేపు ప్రసాదరావుగారు మాట్లాడలేదు. తరువాత "నేను తండ్రిని. నాకూ హృదయంఉన్నది. కాని, కుటుంబంలో కొన్నిపరిస్థితులవల్ల అది సాధ్యపడేవిషయం కాదు," అన్నారు.

"దానివల్ల చాలా నష్టాలొస్తాయని నా ఉద్దేశ్యం. తరువాత మీ ఇష్టం" అని తుంచేశాడు డాక్టర్ శంకరనారాయణ.

ఆరాత్రికి బయలుదేరి బందరు వచ్చేశారు అందరూ. పూర్ణ ఆరోగ్యంగానేఉంది. కాని రాజ్యలక్ష్మికి రాచకురుపు లేవటంవలన మళ్ళీ మద్రాసుకాపురం పెట్టాల్సివచ్చింది. రాయపేటలో ఒక మేడమీద భాగంతీసుకుని, రాజ్యలక్ష్మి, పూర్ణా, రాజా ఉంటున్నారు. శంకరనారాయణ రెండు పూట్లా వచ్చి చూసి పోతూఉన్నాడు.

రాజా, వెంకటరత్నం బ్రిటిష్‌గవర్నమెంట్‌కి వ్యతిరేకంగా నాన్‌కోఆపరేషన్‌మూమెంట్‌లో చదువుకి స్వస్తి చెప్పేశారు. వెంకటరత్నం శ్రీనివాసశిరోమణిగారు సంపాదకులుగాఉన్న ఒకపత్రికలో సబ్‌ఎడిటరుగా చేరి, మద్రాసు వచ్చాడు. ప్రస్తుతం ప్రసాదరావుగారు పల్లెటూళ్ళకూ, రాజా బందరు, మద్రాసులమధ్యనా తిరుగుతున్నారు.

పరిస్థితులు ఇలాఉండాగా రాజాకి సంబంధం కుదిరింది. పిల్ల బాగానే ఉంటుంది. బోలెడు ఆస్తి ఉండటం, పిల్లవాడు అందగాడుకావటంవలన మంచిసంబంధమే వచ్చింది. రాజ్యలక్ష్మికి కొద్దిగా తగ్గినతరువాత పెళ్ళిలగ్నంపెట్టుకున్నారు.

రాజాకి పెళ్ళిసంబంధంకుదిరిందన్నవిషయం వరాలులో అసూయ రేకెత్తించింది. ఆవిషయమే అతన్నిప్రశ్నించింది. రాజా నవ్వి.

"పెళ్ళిఅనేది సంఘానికీ తల్లితండ్రులకీ సంబంధించినది. నీకూ నాకూ అంతర్యానికీ సంబంధించినది వేరే ఉన్నది. దయచేసి ఈ విషయంలో నన్ను ప్రశ్నించవద్దు". అన్నాడు రాజా. వరాలుకి ఆ మాటలు ఎందుకో నచ్చలేదు. కాని చేసేదీ కనిపించలేదు. తనేమో నాటకాలేసి కుటుంబాన్ని

పోషించకతప్పటంలేదు. పైగా తనకులం వేరు. అదీకాక, అతన్ని పెళ్ళిచేసుకొని తనని ఉద్ధరించమని వేడుకోటం తనకి న్యూనతగాఉంది. ఒకసారి నిట్టూర్చి,

"రాజా, నిన్ను నేను తెలుసుకోకపూర్వం నాకు జీవితానికి అర్థమే తెలియదు. నాటకాలాడటం ఒకకళ అనుకునేదాన్ని. దమయంతి కష్టాలు నా కష్టాలుగా కనిపించేవి. పాంచాలి పరాభవం నా పరాభవంగా కనిపించేది. నాతో పాటు నటించే ప్రతి దున్నపోతూ నా కంటికి రాజకుమారుడుగానే ఉండేవాడు. ఆ రోజుల్లోనే నీవు నా గుండెల్లో అడుగు పెట్టావు. ఆ భ్రాంతినుంచి నన్ను బైటికిలాగి బ్రతుకంటే ఏమిటో నాకు తెలియపరచావు. అసత్యాలైన ఆ అనుభవాలతో విసిగెత్తిపోయాను.... కాని ఇప్పుడు నువ్వు నాకు కాకుండాపోతున్నావు" అన్నది. రాజాకి కళ్ళవెంబడి నీరు తిరిగింది.

వరాలుది సంపూర్ణ వికసిత యవ్వనం. ఆమెజీవన కుసుమంమీాద వాలిన స్వర్ణభ్రమరం శాశ్వతంగా అక్కడే ఉంటుందని అనుకోకపోయినా, అది యింతత్వరగా ఎగిరి పోతుందనికూడా ఆమె అనుకోలేదు. అయినా ధైర్యం తెచ్చుకుని,

"నువ్వు నాకోసం కన్నీళ్ళుపెట్టుకోవటం చాలు. నాకు అంతకన్న నే నేమీా కోరను.... కాని, రాజా నువ్వేదో పరాయివాడివి అయిపోతున్నా వనిపిస్తున్నది" అన్నది.

రాజా ఆమెని దగ్గరకు తీసుకుని తలనిమురుతూ "ఆడ వాళ్ళు మగవాళ్ళకన్న ఎక్కువదుఃఖాన్ని భరించగలరు. మీ మీ ఉద్యోగాలలో మీరు శాంతినిపొందుతారు.... కాని, నేను నీ వాడిని. ఆవిషయం నీకూ తెలుసు ... ఇంతకన్న నన్ను ఏం చేయమంటావు?" అన్నాడు.

వరాలు కొంచెంసేపు మాట్లాడలేదు. తరువాత "ఎల్లుండి నేను మద్రాసు వెడుతున్నాను. ఇరవయిరోజుల వరకూ అక్కడే ఉంటాను" అన్నది.

"సరే... నీవుమాత్రం ఈ విషయంలో అట్టే విచారం పెట్టుకోకు. జీవితం మనకోసం కాలయవనికచాటున రకరకాల అనుభవాల్ని దాచింది. కాసేపు నువ్వు నటివనేసంగతి మర్చి పోయి ప్రేక్షకురాలిగా మారిపో ... అందులో అందమే కాకుండా ఆనందంకూడా ఉన్నది" అన్నాడు రాజా.

వరాలు చిరునవ్వునవ్వి "అచ్చం వెంకటరత్నం గారిలా మాట్లాడుతున్నారు" అన్నది.

"అన్నట్లు వెంకటరత్నాన్నికలుసుకో. వాడి ఎడ్రసు ఇస్తాను" అని ఓ చీటీమీద వెంకటరత్నం ఎడ్రసు వ్రాసి యిచ్చాడు రాజా. వరాలు ఆ చీటీతీసుకుని బొడ్లోపెట్టుకుంది.

"పద, నిన్ను ఇంటిదాకా పంపించివస్తాను" అని వరాలుని చెయ్యిపట్టుకుని లేవదీశాడు రాజా. వాళ్ళిద్దరినీ కాలం నీడలాగా అనుసరిస్తోంది.

౧౦

మనస్సు సినిమాతెరలాటిది. ప్రతి సంఘటనా వెంటనే మారిపోయి, మరో సంఘటన వస్తుంది.... అదీ మారిపోయి

ఇంకో సంఘటన. సచేతనమైన మనోయవనికమీద అనుక్షణం కొత్తసృష్టి అవుతూనే ఉంటుంది. తరువాత ఇంకో సంగతి ఏమిటంటే? క్రియకీ కారణానికీ ఉన్న సంబంధం తెంచటానికి వీలులేనిది. దీనితాలూకు స్విచ్చికూడా మన చేతుల్లో ఉండటానికి ఆట్టే అవకాశంలేదు.

బహుశా ఈ కారణంచేతనే పూర్ణకి డాక్టర్ రేణు అంటే ఇష్టం ప్రారంభమయిఉండవచ్చును. తల్లికి రాచకురుపుకు చికిత్స జరుగుతున్నప్పుడు శంకరనారాయణతో పాటు అతని ప్రియమిత్రుడు డాక్టర్ రేణుకూడా ఇక్కడికి తరుచుగా వస్తూఉండేవాడు. కాలేజీనుంచి అప్పుడే బయటపడి, హౌస్‌సర్జన్‌గాఉన్న రేణుకి ఈ అలౌకికసుందరి పూర్ణ అమిత కుతూహలాన్ని కలిగించిందనే చెప్పాలి.

శంకరనారాయణకి పూర్ణావాళ్ళూ ఏదో చుట్టాలని మాత్రమే రేణుకి తెలుసు. ఇంకోసంగతి ఏమిటంటే, పూర్ణ వితంతువు అన్న విషయంకూడా తెలుసు. ఎప్పుడూ బాల్కనీలో నుంచుని మద్రాసుమహానగరం తాలూకు వేగాన్ని కుతూహలంతో పరిశీలిస్తూఉండే ఈ అపరిచిత యువతి శంకరనారాయణతో వచ్చిన మొదటిరోజునే అతనిని ఆకర్షించింది. తెల్లగా, అందంగా, సన్నగాఉండే ఈడాక్టరు పూర్ణకి ట్రాముబండికన్న విచిత్రంగా కనిపించసాగాడు.

ఎప్పుడయితే వెంకటరత్నం తనకి కాదనిపించిందో, అప్పుడే అతనిమీద కచ్చతీర్చుకోవాలనే అవ్యక్తమైన వాంఛ కూడా ఆమెలో ప్రవేశించింది. ఈ వాంఛకి డాక్టర్ రేణుని సాధనంగా తీసుకోవాలని మాత్రమే ఆమె అనుకుంది

గాని, ఈ కోరికవలన వచ్చే పర్యవసానం ఎలాఉంటుందో ఆమె ఆలోచించలేదు. అంతేకాకుండా, ఆమెలోని తీవ్రమైనవాంఛ ఆమెకి యుక్తాయుక్త జ్ఞానాన్ని లేకుండా చేసింది.

బాల్కనీలో నుంచుని ఆలోచిస్తున్న పూర్ణ 'నమస్కారం' అన్నమాట విని పక్కకితిరిగి చూసింది. ఆ సాయంత్రపు నీరెండలో రేణు తెల్లతామరలాగా కనిపించాడు. పూర్ణ అట్టే ఖంగారుపడకుండా "నమస్కారం కూర్చోండి" అన్నది.

రేణు కూర్చుని "ఇవ్వాళ మీ అమ్మగారికి ఎలా ఉందో చూసిరమ్మని శంకరం నన్ను పంపాడు. ఎలాఉందావిడకి ?" అన్నాడు

"కొంచెం బాధ తగ్గింది" అనిపూర్ణ జవాబుచెప్పింది. ఇద్దరూ కొంచెంసేపు మాట్లాడలేదు .... అలా మాట్లాడకుండా ఉండటం ఇద్దరికీ దుస్సహంగా కనిపించింది. చివరకి రేణే తెగించేసి "మీ రిలా రోజల్లా ఒంటరిగా ఉండటం కష్టంకాదూ" అన్నాడు. పూర్ణ తలఎత్తి చూసి "కష్టమే మరి, కాని ఏంచేస్తాం" అన్నది. రేణుకి కొద్దిగా ధైర్యంవచ్చింది.

"మీకు అభ్యంతరం లేకపోతే, మా ఇంటికి రావచ్చును" అన్నాడు.

"అభ్యంతరానికి ఇందులో ఏముంది కాని... అమ్మని వదిలిపెట్టి రావటం అంత భావ్యంగాఉండదు. అంతకన్న మీరేవచ్చి వెడుతుంటే నేను సంతోషిస్తాను" అన్నది. ఈ విధంగా ప్రారంభమైన వారి క్లుప్తపరిచయం గాఢస్నేహంగా మారటానికి అట్టేరోజులుపట్టలేదు. సాయంత్రం

పూట రాజ్యలక్ష్మికి జవాబిచ్చి, బాల్కనీలో డాక్టరుతో కబుర్లుచెబుతూఉండేది పూర్ణ. వీళ్ళపరిచయం స్నేహంగా మారిందని వెంకటరత్నానికీ, శంకరనారాయణకే కాకుండా రాజ్యలక్ష్మికికూడా తెలియదు. వెంకటరత్నం రాత్రి ఏ పది కొండింటికో గాని రాడు. కన్నెమెరా లైబ్రీకి సరాసరి ఆఫీసునించే వెళ్ళిపోతాడు.

అక్కడ పుస్తకాలే అతనికి ప్రాణస్నేహితులు. జన్మతః వచ్చిన అతని రచనాప్రపంచంలో పుస్తకాలు తమ విచిత్ర నాటకాన్ని రకరకాల రంగస్థలాలమీద ప్రదర్శించటం ప్రారంభించినయ్. క్రమక్రమంగా రచయిత వెంకటరత్నం మహారచయిత అయినాడు. అతనికలం ఇప్పుడు రంగులకుంచెగా మారి, జీవితచిత్రాన్ని వివిధకోణాల్లో చిత్రిస్తోంది. ఒకనాటిసాయంత్రం వెంకటరత్నం కన్నెమెరాలైబ్రరీలో పుస్తకప్రపంచం తాలూకు మ్యాపును పరీక్ష చేస్తున్నసమయంలో ఇంటిదగ్గర పూర్ణ వేణులమధ్య విశ్వరంగస్థలం మీద అనుక్షణం ప్రదర్శింపబడుతున్న ఒక విచిత్రనాటకం ప్రారంభమయింది.

వేణుది చాలా ఉద్వేగప్రకృతి. మెడికల్ కాలేజిలో ప్రాణంలేని స్త్రీశవాలని కోస్తున్నప్పుడూ, జనరల్ హాస్పిటల్లో పురుళ్ళుపోస్తున్నప్పుడుకూడా అతనికి ఒకవిధమైన ఉద్వేగం కలిగేది. సజీవ సౌందర్యప్రతిమ పూర్ణ అతనిలో అపరిమితమైన ఉద్వేగాన్ని కలిగించిందనే చెప్పాలి.

సరిగ్గా పూర్ణకూడా ఇలాంటివ్యక్తినే వెతుకుచున్నది. ఆ అందమైన మద్రాసులో సాయంత్రంపూట డాబామీద

చాప వేసుకుని కూర్చున్న ఆ ఇద్దరిలో ఎవరూకూడా సూటిగా ఒకళ్ళముఖంలోకి ఒకళ్ళు చూడలేకుండా ఉన్నారు. ఉన్నట్లుండి పూర్ణ ఏడవటం ప్రారంభించింది. రేణు ఖంగారుపడి "ఏడవకు పూర్ణా! నిన్ను పెళ్లిచేసుకుంటాను" అన్నాడు. పూర్ణ తలఎత్తి ఆశ్చర్యంగా అతనివంక చూసి "ఎవర్ని? నన్నా!" అన్నది.

"అవును, ప్రపంచం తలకిందులయినా నిన్ను పెళ్ళి చేసుకుంటాను "అన్నాడు రేణు.

"నీకు పెళ్ళయిందిగా మరి?" అన్నది పూర్ణ.

"అయితేనేం? ఇద్దరుభార్యల్ని నేను పోషించగలను"

"మీవాళ్ళు ఒప్పుకోరేమో?"

"ఆవిషయం తరువాత ఆలోచిద్దాము. మరి నేను వెళ్ళనా?" అని వాచీచూసుకుని లేచాడు రేణు. సరిగ్గా ఆ సమయంలో వెంకటరత్నం డాబామీద అడుగుపెట్టాడు. రేణు మాట్లాడకుండా వెళ్ళిపోయాడు. వెంకటరత్నాన్ని చూడగానే తను యెంత పొరపాటుచేసిందో అర్థమయింది పూర్ణకి.

నిప్పులుకురుస్తున్న కళ్ళతో "ఏమిటిది?" అని ప్రశ్నించాడు వెంకటరత్నం. ఏ వెంకటరత్నంమీద కోపంతో తను తప్పుదారితొక్కిందో ఆ వెంకటరత్నమే తన ఎదురుగా నిలబడి ఏమిటిది? అని గర్జించగానే పూర్ణకి అపరిమితమయిన భయంవేసింది. ఆమెచుట్టూవున్నలోకం గిరాగిరా తిరగనారంభించింది. మరుక్షణంలోనే ఫిట్ వచ్చి పడిపోయింది

పూర్ణ. వెంకటగత్నం ఖంగారుగా అమెని లేవతీసి కిందికి మోస్తున్నసమయంలో వరాలు ఆ ఇంటిమెట్లు ఎక్కింది.

వరాలుని చూడగానే ప్రాణంలేచి వచ్చింది వెంకటరత్నానికి. తుపానులో సౌధంలా ఆమె అతనికి కనిపించింది. వరాలుకూడా ఆ దృశ్యంచూసి ఆశ్చర్యపోయింది. ఆ ఖంగారులో "అమ్మయ్యో! ఏమిటండీ అది?" అని అతనికి సహాయంచేయటానికి ముందుకువచ్చింది.

ఇద్దరూకలిసి పూర్ణని సోఫాలో పడుకోబెట్టారు. స్మెల్లింగ్‌సాల్ట్ వాసనచూపించగానే పూర్ణకి తిరిగి స్పృహ వచ్చింది. వెంకటరత్నం ఆమెవంక అసహ్యంగాచూసి, "చేసినపని తప్పని గ్రహిస్తేచాలు, కొంచెంసేపు విశ్రాంతితీసుకో" అని వరాలుకేసి తిరిగి,

"నువ్వెప్పుడు వచ్చావు? పద, అలా బయటికివెళ్ళి మాట్లాడుకుందాం" అంటూ నడిచాడు. వరాలుకూడా అతనిని అనుసరించింది. అదిచూసిన పూర్ణహృదయం ఆమె ఎవరో తెలియకపోయినా అసూయతో మండసాగింది.

ఎడ్వర్డ్ ఇలియట్‌రోడ్డులోంచి బీచికేసి నడుస్తున్నారు వరాలూ వెంకటరత్నం. తమిద్దరూ ఒకప్పుడు పోటీదార్లనే విషయం ఏవరికీ గుర్తులేదు. ఆంధ్రదేశానికీ బందరుకీ అవతల మరో దూరదేశంలో కలుసుకునేసరికి వారిద్దరూ ఆత్మీయులయినారు. ఉన్నట్లుండి "రాజా ఎలా ఉన్నాడు?" అని ప్రశ్నించాడు వెంకటరత్నం.

"పెళ్ళిచేసుకోబోతున్నారు. ఆ సంగతి మీకు తెలిసే ఉంటుంది" అని జవాబిచ్చింది వరాలు. వెంకటరత్నం

కొంచెంసేపు మాట్లాడలేదు. తరువాత "మరి ఇకముందు నీ సంగతి ఏమిటి?" అన్నాడు.

వరాలు ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవిచేసి, "భలే! నా సంగతికీ ఆయనపెళ్ళికీ ఏమిటి సంబంధం" అన్నది.

కొన్నిక్షణాలయినాక వెంకటరత్నం తేరుకున్నాడు. ఈ అమ్మాయి ఎంత విచిత్రవ్యక్తి!. తను ప్రాణాలుధారపోసే వ్యక్తి పరాయివాడయిపోతుంటే ఇలా ఎలా ఉండగలిగింది? అనుకున్నాడు.

"క్షమించు వరాలూ; ఒకప్పుడు నువ్వంటే నాకు పడేదికాదు. సీతో పోట్లాడి రాజుని దాచేయటమే అప్పట్లో నాకు జీవితపరమార్థం" అన్నాడు.

"మీరే నన్ను క్షమించాలి వెంకటరత్నంగారూ. మీరు వాతధోరణిలో మాట్లాడుతున్నారనుకుని అదేధోరణిలో నేనూ జవాబిచ్చాను... నిజంచెప్పాలంటే, నేను చాలా బాధపడుతున్నాను" అన్నది వరాలు.

"ఏదిఏమయినా, నీవు వాడిని అభిమానిస్తూనే ఉంటావు... ఇప్పుడిక్కడి కెందుకొచ్చినట్లు?"

"వరుసగా నాలుగు నాటకాలున్నాయి"

"అన్నట్లు నేనే నిన్ను ఉత్తరంవ్రాద్దామని భయపడి మానేశాను. జీవనస్రవంతి స్టేజిచేస్తున్నారు ఈ వూళ్ళో. మరి నువ్వు అందులో నటించాలి"

"తప్పకుండా ఇంతకూ ఎప్పుడేమిటి నాటకం?"

ఏసంగతీ రేపుసాయంత్రం చెపుతాను." ఇద్దరూ పోయి ఇసుకలో ఒకపక్క కూర్చున్నారు. వెన్నెల సముద్రం

పొడుగునా వెలుగుచారని నిర్మించింది. ఆ దారమీదుగా నడిచిపోయి, ఈ లోకానికి గుడ్‌బైకొడదామా అనిపిస్తుంది.

"ఇంతకూ ఆవిడ ఎవరండీ?" అని ప్రశ్నించింది వరాలు

"ఏనకేముంది? రాజా అక్కగారు"

"ఆవిడకి అప్పుడప్పుడు అలా ఫిట్స్ వస్తూంటాయా?"

"అప్పుడప్పుడు"

"క్షమిస్తే, ఒక్కసంగతి. చేసినపని తప్పని గ్రహిస్తే చాలు అన్నారు, అదేమిటి?" వరాలు వేసిన ఈ ప్రశ్న వెంకటరత్నానికి నచ్చలేదు. ఆసంగతి గ్రహించిన వరాలుకూడా మళ్ళీ అదేమిటని ప్రశ్నించలేదు. వెంకటరత్నం నిట్టూర్చి,

"నిజానికి ఈ జీవననాటకంలో నాకు తెలిసిందెంత అనిపిస్తోంది. అంతా మసకగా ఉంది. యదార్థాన్నీ, కల్పననీ, కాంతినీ, అంధకారాన్నీ, కలిపి నేను ఊహించిన ఈ ఊహాలలో ఏది సత్యమో! ఏది అసత్యమో నాకు అంతుదొరకటంలేదు. అంతా అబద్ధమయినా కావచ్చును. నేను మోసంతో గుడ్డివాడినయినాను. దానితో అసహ్యాన్ని అందమనీ, అందాన్ని అసహ్యమనీ నేను భ్రమించటమే కాకుండా ఇతర్లనికూడా అదేభ్రమలో ఉంచడానికి ప్రయత్నించాను. ఈ ఇరవయ్యో శతాబ్దంలో అసహ్యకరమైన ఈ మనః ప్రవృత్తి సర్వసామాన్యమయిపోయింది" అన్నాడు.

వరాలు పకపకానవ్వి "ఇంతసేపటికి వెంకటరత్నంగారిలాగా మాట్లాడారు. మీరు మోహాంధంలో గుడ్డివారవలేదు, మీ దృష్టిబలం పెరిగింది" అన్నది,

మోహంతో గుడ్డివాడయినాను అన్నమాటతో వరాలు అంతా గ్రహించేసిందని అతను అర్థం చేసుకున్నాడు. అయినా తనేమీ మాట్లాడలేదు.

సర్వసాధారణమైన జీవితాలు మన కెందుకు దొరకలేదా? అని అప్పుడప్పుడు నాకు విచారంగా ఉంటుంది. అతి అసహ్యకరమైన సంతోషంలో జీవించడం కన్న, అతి రమణీయమైన దుఃఖంలో బ్రతకటమే ఆనందం అనిపిస్తుంది నాకు. కాబట్టి, జీవితంలో మనలాంటి విచిత్రవ్యక్తులు అతిరమణీయమైన దుఃఖం అనుభవించడానికి సిద్ధపడిఉండాలి'' అన్నది వరాలు.

''ఒక చిన్న కథ ఉన్నది. ఒక సంఘసంస్కర్త సంఘంలో ఒక మార్పుకోసం చాలాకాలం ప్రయత్నించి ఆ మార్పు తీసుకొచ్చాడు. ఆ సాయంత్రం అతని స్నేహితుడు అభినందించడానికి వెళ్ళేసరికి ఆయన దిగాలుగా కూర్చుని ఉన్నాడు. ఇదేమిటయ్యా, నీ యిల్లు బంగారంగానూ! నువ్వు కోరుకున్న మార్పు వచ్చిందిగదా, నీ మొహం అలాఉన్నదేం అని స్నేహితుడడిగితే, ఇదివరకు చెయ్యటానికి ఒక పని ఉండేది. ఇప్పుడది లేదే అని బాధపడుతున్నాను అని ఆయన జవాబిచ్చాడట. సరిగ్గా అలాఉంది మనస్థితి.. వివాహాన్ని అందం ... అనుకుని, దాన్ని అనుభవిస్తాం. క్వైనైన్ మిక్స్చర్ తాగినట్టు'' అన్నాడు వెంకటరత్నం.

వరాలు మాట్లాడలేదు.

''ఎవరి బ్రతుకుని వాళ్ళు సాక్షిలాగా చూడగలిగితే జీవితంలో కొన్ని దుఃఖాలనుంచి విముక్తి పొందగలుగుతారు!

అని సంభాషణ ముగించి,లేచి నిలబడ్డాడు వెంకటరత్నం. ఇద్దరూ కొంతదూరంకలిసి నడిచినాక,

"నాటకంసంగతి రేపు చెబుతాను.ఇంకా ఎన్నాళ్ళుంటావు ఇక్కడ?" అన్నాడు అతను.

"ఎన్నాళ్లుంటానో తెలియదు. రేపు సాయంత్రం నన్ను రమ్మంటారా!"

"నువ్వే రా. మరి ఇక వెళతాను" అని వెంకటరత్నం వెళ్ళిపోయినాడు.

అతను ఇంటికి చేరేసరికి, రాజా పెళ్ళిలగ్నం పెట్టుకున్నట్టూ, వెంటనే పూర్ణని రాజ్యలక్ష్మని పంపమనీ ప్రసాదరావుగారు వ్రాసిన ఉత్తరం బల్లమీద ఉన్నది. బ్రతుకు జీవుడా అనుకున్నాడు వెంకటరత్నం. కనీసం కొన్నాళ్ళపాటుయినా పూర్ణ మొగంచూడటం తప్పుతుంది. ఉదయానే మేనత్తనీ పూర్ణనీ బండీఎక్కించాడు.

౧౧

ఆ సాయంత్రం వరాలు వెంకటరత్నంకోసం వచ్చినప్పుడు శంకరనారాయణకూడా ఉన్నాడు. వెంకటరత్నం వారిద్దరినీ ఒకళ్ళకొకళ్ళ పరిచయంచేశాడు.

"మీరు సినిమాల్లో ఎందుకువేయరూ?" అని వరాల్ని ప్రశ్నించాడు శంకరనారాయణ.

"నా కెందుకో అవంటే ఇష్టంలేదు" అని మాట తేల్చివేసింది వరాలు.

"జీవనస్రవంతిలో మీది ఏ పాత్ర?" అని శంకరనారాయణ అడిగినప్రశ్నకు పకపకా నవ్వి "నాయికపాత్రే

అన్నది వరాలు. ఆసమాధానానికి వెంకటరత్నంకూడానవ్వి,

"నిజంచెప్పాలంటే, జీవనస్రవంతిలో స్త్రీది ఎప్పుడూ ముఖ్యపాత్రే. అయినా ఆవిషయం ఆమెకీ మనకీకూడా గుర్తు ఉండదు" అన్నాడు.

"ఒక నాయికపాత్రే కాదు, సూత్రధారణికూడా స్త్రీయే" అన్నాడు శంకరనారాయణ గంభీరంగా.

"భలే! ఇవ్వాళేదో మీకిద్దరికీ స్త్రీని పొగడాలనిపిస్తున్నది, కానీండి" అన్నది వరాలు.

తనకి ఎదురుగుండా కూర్చున్న ఆ యువతీయువకుల పరిస్థితి చాలా చిత్రమైనది. ఆ యువతిలో హిందూమహమ్మదీయులరక్తం సమానంగా ప్రవహిస్తున్నది. ఆ సంగతి లోకానికీ ఆమెకీకూడా తెలియదు. ఆ యువకుడు భిన్న కులాల తల్లిదండ్రులకి పుట్టాడు. ఆమెరక్తంలో మతభేదం ఉంటే, అతనిరక్తంలో కులభేదం ఉన్నది. కాని వారిద్దరి లోనూ చైతన్యస్రవంతి ప్రవహిస్తున్నది. ఈ కుల మత భేదాలు వాళ్ళశరీరాల్లోనూ మనసుల్లోనూకుండా ఏవిధమైన మార్పూ తేలేదు.

అలాటప్పుడు ఈ కులమతభేదాలు లోకంలో శుద్ధ అనవసరపదార్థాలన్నమాట అయినా లోకులు వీటి కింత ప్రాధాన్యత ఎందుకిస్తారో తెలియదు. వెంకటరత్నం మొదటిసారిగా కులమతాల్ని అసహ్యించుకోకపోయినా, మళ్ళీ ఒకసారి వాటిని అసహ్యించుకున్నాడు.

"ఏమిటి వెంకటరత్నంగా రేదో దీర్ఘంగా ఆలోచిస్తున్నారు?" అని అతనిఆలోచనలని కదిపివేసింది వరాలు.

"ఆయన రచయిత, ఏదో కొత్తనవలనిగురించి ఆలోచిస్తూఉంటారు, అవునా?" అన్నాడు డాక్టర్.

"ఒకవిధంగా అంతేగాని, మరోవిధంగా అది కాదు... సరేగాని, డాక్టర్! మీరు ఇంకా పెళ్ళి ఎందుకుచేసుకోలేదు?" అన్నాడు వెంకటరత్నం. వరాలు పకపకా నవ్వి,

"అదేప్రశ్న డాక్టరుగారు మిమ్మల్ని అడిగితే మీ రేం సమాధానంఇస్తారో చెప్పండి" అన్నది.

"ఈలోగా నేను ఇవ్వాల్సిన సమాధానాన్నిగురించి ఆలోచించిఉంచుకుంటాను. ముందు డాక్టరుగారే సమాధానంచెప్పాలి" అన్నాడు వెంకటరత్నం.

"మా కులంలోపిల్లని పెళ్ళిచేసుకోవాలని నాకు లేదు. ఇతరకులాల్లో పిల్లలకి నన్ను పెళ్ళిచేసుకోవాలని ఉండదు" అని జవాబుచెప్పాడు శంకరనారాయణ.

అతనికులం ఏదో తెలియని వరాలు తెల్లబోయి అతని వంక చూసింది. అది చూసిన డాక్టరు

"మేము కళావంతులం. మా తండ్రి కృష్ణయ్యగారు - అంటే ప్రసాదరావుగారితండ్రిగారు" అన్నాడు.

వరాలు ఆశ్చర్యపోయి "మీరు రాజాకి..." అన్నది.

"అవును... మా ఇద్దరిరక్తం ఒకటేకాని, మా ఇద్దరి కులం వేరు"అన్నాడు డాక్టరు.

"మీఅమ్మగార్నిగురించి విన్నాను. ఆవిడేకదూ, ఆయన ఇంకా పోకముందే ఆయనపాదాలదగ్గర ప్రాణాలు వదిలిందని చెప్పుకుంటారు?" అన్నది వరాలు.

"ఆవును. మూడునాళ్ళాయెరా మువ్వగోపాలా; అని పాడి ఆయనపోకమునుపే ఆవిడ ప్రాణాలొదిలింది" అని నిట్టూర్చాడు వెంకటరత్నం.

"మా అమ్మ పిల్లలకోసం తపస్సుచేయగా నేను పుట్టాను. ఒక్కరోజుకూడా ఆవిడని నేను సరిగా అర్థంచేసుకోలేదు. ఎందుకంటే, నన్ను విడిచిపెట్టేదిగాని, నాన్నగారికి దూరమవుతానని గుడివాడవదలి వచ్చేదికాదు" అన్నాడు డాక్టరు.

"ఒకసంగతి తల్చుకుంటుంటే నాకు నవ్వువస్తుంది" అన్నాడు వెంకటరత్నం.

"ఏమిటది?" అని వరాలూ, డాక్టరూ ఒక్కసారే ప్రశ్నించారు.

"రచయితగా ఒకసారి ఈ వ్యక్తుల్ని, స్వభావాల్ని విపులీకరిద్దామని ఉంది."

"దానికింత ఆలోచనఎందుకు?" అన్నాడు డాక్టరు.

వెంకటరత్నం గంభీరంగా కొన్నిక్షణాలు ఆలోచించాడు. అతనేం చెపుతాడోఅని వాళ్ళిద్దరూ ఎదురుచూస్తున్నారు. పైన ఫాన్ తిరుగుచున్నది.

"ఈ శతాబ్దంలో తెలుగుదేశంలో చాలా ఉన్నత కుటుంబాల్లో ఒకటయిన మావాళ్ళకుటుంబంలో మూడు తరాలవాళ్ళతో నాకు పరిచయముండున్నది. దానికికారణం ఆ కుటుంబానికి నేను దౌహిత్రుడినిఅవటమే. ఆ మూడుతరాల వాళ్ళలో మొదటివాడు మా తాతగారు – కృష్ణయ్యగారు. ఆయన గుర్రంఎక్కి తిరుగుతుండేవాడు. భార్యని ప్రాణ

ప్రిదంగా చూచుకునేవాడు. అంతేకాదు. తను కన్నెరికం పెట్టిన సభారంజని కళావంతులలోఉండే రసికతనీ, భార్యలో ఉండే పవిత్రతనీ తెచ్చుకుని, ఆయనని సేవించి, ఆయనవలన డాక్టరుగారిలాటి కొడుకుని కని, చివరకి ఆయనకోసమే ప్రాణా లొదిలింది. ఆయన మహోన్నతుడు. భార్యనీ, ప్రియురాల్నీ కూడా రెండుకళ్ళలా చూచుకున్నాడు. స్త్రీని ఆయన ప్రేమిస్తే, స్త్రీ ఆయనని ఆరాధించింది.

"ఇక రెండోతరంవాడు మా మామయ్య ప్రసాద రావుగారు; ఈయన సైకిలుమీద తిరుగుతున్నాడు. తను ఒక కులంగానిస్త్రీని ప్రేమించి ఆవిడని తనదాన్ని చేసుకునే ధైర్యంలేక జీవితానికి భయపడి లొంగిపోయినాడు. ప్రియు రాల్ని పోగొట్టుకున్నాడు. భార్యని పొందలేకపోయినాడు. తాతయ్య సంతానంలో ఉన్న ధార్ఢ్యం మామయ్యసంతా నంలో లేకపోవటానికి బహుశా అదే కారణంకావచ్చును. మామయ్య స్త్రీని దక్కించుకోలేనిపిరికివాడు. తెలుగునవలలో హీరోలాటి వ్యక్తి.

"పోతే ఇక మూడోతరంవాడు మా మామయ్య కొడుకు రాజా. వీడు కారుమీద తిరుగుతున్నాడు. 'పెళ్ళి సమాజంకోసం, ప్రేమ నాకోసం' అని విభాగించిపారేశాడు వీడు. గాఢంగా స్త్రీని అనుభవించటమే వీడి జీవితధ్యేయం. తండ్రిలాగా తాతలాగా ఇద్దరుస్త్రీలతో వీడు గడుపుకోలేడు. అన్నిరకాల కూరలూ మనం తిన్నాగాని, ఏదోఒకకూరమీద ప్రత్యేకమైన ఇష్టం ఉన్నట్లు అన్నిరకాలస్త్రీలనీ అనుభవిం చినా ఒకొక్క-స్త్రీమీద ప్రత్యేకమైన అభిమానం చూపిస్తాడు

వాళ్ళిద్దరికంటే వీడికి మరో ఆధిక్యత ఉన్నది. అది వాడి సౌందర్యం. స్త్రీని వాడు కాంక్షిస్తే, స్త్రీ వాడిని ప్రేమిస్తుంది.

ఈ మూడుతరాలవాళ్ళల్లోకీ మా మామయ్యే దురదృష్టవంతుడు. ప్రాచీనుడైన క్రిష్ణయ్యగారూ, నవీనుడైన రాజాకూడా కనీసం స్త్రీతాలూకు మాధుర్యాన్ని అనుభవించారు. మామయ్యే ఎటూకాకుండాపోయినాడు. తనప్రేమని పైకికూడా వెల్లడించలేని దిక్కుమాలినస్థితిలోపడి నలిగిపోయినాడు. పాతకీ, కొత్తకీ మధ్య ఉన్న అగడ్తలో పడి అర్థవిహీనంగా బ్రతుకు గడిపేస్తున్నాడు. సంప్రదాయంవీడని క్రిష్ణయ్యగారూ, సాహసంవీడని రాజా - ఇద్దరూ అదృష్టవంతులే. ఎటొచ్చీ సంప్రదాయంవిడవలేక, సాహసం అసలే లేక నాశనంఅయినవాడు ఒక్క మామయ్యే.

ఇంతసేపూ వెంకటరత్నంమాటలు శ్రద్ధగా వింటున్న వరాలూ, డాక్టరూ అతను ఆపగానే ఊపిరిపీల్చుకున్నారు. కొంచెంసేపు అయినాక మళ్ళీ వెంకటరత్నమే,

"ఈ జగన్నాటకంలో ఎవరిపద్ధతి మంచిదో, ఎవరిమార్గం సరిఅయినదో అర్థంకావటంలేదు. ఇంకోచిత్రం ఏమిటంటే, సంప్రదాయానికి వెలిగా జన్మించిన డాక్టరుగారిలో నిగ్రహం జాస్తిగా ఉంటే, సంప్రదాయానికి సరిగా జన్మించిన రాజాలో ఆ నిగ్రహం మచ్చుకైనా లేదు'' అన్నాడు.

వరాలు నిట్టూర్చింది ...

"రాజా రేపు పెళ్లికొడుకై బుద్ధిమంతుడిలాగా పెళ్లి చేసుకొని తిరిగివస్తాడు. షడ్రసోపేతమైన అతని విందుభోజనం

లోకి మరో కొత్త పిండివంట చేరుతున్నది ... ఏదిఏమయినా వాడు అదృష్టవంతుడు."

వెంకటరత్నం అంటున్నమాటలు డాక్టరుకి తమాషాగా ఉన్నయ్యి కాని, శ్రద్ధగా వింటున్నాడు; కొంచెంసేపు ఆ గదిలో నిశ్శబ్దం రెక్కలువిప్పింది.

ఉన్నట్టుండి వరాలు పకపకా నవ్వి "స్త్రీని ఆయన ప్రేమిస్తే, స్త్రీ ఆయనన్ని కాంక్షిస్తుంది. అందుకోసమే ఆయన స్త్రీని ప్రేమించరు. అదికూడా ఆయనలోఉన్న ఆకర్షణాల్లోఒకటి" అన్నది.

డాక్టరు తెల్లపోయినాడు. అయితే వరాలు రాజాని ఎరుగున్నదా? అతనిమనస్సెందుకో చివుక్కుమన్నది.

"నీవు చాలా విచిత్రమయినవ్యక్తివి అని తెలుసును గాని ఇంత విచిత్రమయినవ్యక్తివని అనుకోలేదు" అన్నాడు వెంకటరత్నం.

"సామాన్యంగా ఇప్పటిఆడవాళ్ళల్లో హిస్టీరియా లక్షణాలు జాస్తిగా కనిపిస్తున్నాయి. దేనికీ అందీఅందని రకరకాల చిత్తభ్రమలతో వీరు గజిబిజిపడుతూఉంటారు. వీరి ఊహల్లో ఏఒకటీ వాంఛగా తిరిగి, ఫలించటంఅంటూ జరుగదు. గాలివానలో గాలిపటాల్ని ఎగరేసినట్లు వీరు ఆలోచనల్ని ఎగరవేస్తూఉంటారు" అన్నాడు డాక్టరు. అతనికెందుకో వరాల్ని నొప్పించాలనే కోరిక కలిగింది.

వరాలు తలఎత్తి అతనినిచూసింది. కాంతిగలమొగం, పొడుగాటిమొగచెంపలు, కొట్టివచ్చినట్లున్నగడ్డం, ఏదోవైరుధ్యంఉన్న కళ్ళు, ఆ చూపులో దాగినవాడిఅలసట, ఆ అలస

టలో ఒకఅందం - ఇవన్నీ వరాలుకి కనిపించినయ్. ఇతను తనతో కావాలని పోట్లాట పెట్టుకోటం లేదుగద అనుకుంది ఆమె. కాని జవాబు ఇవ్వలేదు. ఎవరేమన్నా పడగవిప్పిన ఆడ త్రాచులా బుసగొట్టే వరాలు మాట్లాడకుండా ఊరుకోవటం చూసి, వెంకటరత్నం విస్తుపోయినాడు. అతనికి మరో ఆలోచనకూడా వచ్చింది - రాజాని పోగొట్టుకున్నాననేభావం ఆమెలో ఉత్సాహాన్ని పాడుచేయలేదుగదా అని.

ఇంతలో శంకరనారాయణ లేచి ఏదో కేసు చూడాలని వెళ్ళిపోయినాడు. అతనంత హఠాత్తుగా వెళ్ళిపోవటం ఆ ఇద్దరికీ కూడా ఆశ్చర్యం కలిగించింది. కొంచెంసేపయినాక, వెంకటరత్నం బిగ్గరగా నవ్వి—

"జీవనస్రవంతిలో మరో సుడిగుండం ప్రారంభ మయింది" అన్నాడు.

## ౧౭

డాక్టర్ రేణు పెళ్ళికూతురు పినతల్లికొడుకని తెలుసుకున్న పూర్ణ చాలా ఆశ్చర్యపోయింది. అతనిని జీవితంలో తిరిగి కలుసుకోకూడదని నిర్ణయించుకుంది. తను వెంకటరత్నం మీద కచ్చతీర్చుకోటానికిగాను ఈ దౌర్భాగ్యపుపని చేసింది. ఆ దౌర్భాగ్యపుపనిలోనే రేణు మరో ఆశ చూపించాడు. తన మనసుని యెంత అదుపులో పెట్టుకుందామని ప్రయత్నించినా, అది సౌఖ్యకరమైన గార్హస్థ్యజీవితాన్ని గురించే ఆలోచించటం ప్రారంభించింది. తనకి భవిష్యత్తున్నది, ఈ ఆలోచన వడగాలిమున్న తడిగాలిలా ఆమెను

తాకుతున్నది. ఆ రాత్రి అందరూ ఊరేగింపుకి వెళ్ళటంవలన తనొక్కతే విడిదిలో ఉండాల్సివచ్చింది.

రేణు హటాత్తుగా ప్రవేశించి. "క్షమించండి. మీరు పెళ్ళికొడుకు అప్పగారని తెలియగానే చాలా ఆనందించాను. మనకి బంధుత్వంకూడా కలిసింది" అన్నాడు.

పూర్ణకికూడా అతనంటే ఒక విధమైన ఆకర్షణలేకపోలేదు. మరేం లేదు ... అతను చాలా ఉద్వేగ ప్రకృతి. పైగా పూర్ణకి మరో సరదాఉన్నది. రాజాకూడా సరిగ్గా అలాంటివాడే. అయినా అతను మగవాడవటంవలన తప్పించుకుంటున్నాడు. అదేమిటంటే!

వేటకాడు జంతువులకోసం ఉచ్చులుపన్ని అక్కడనించి వెళ్ళిపోతాడు. అలాగే పూర్ణకూడా తనకు తెలియకుండా వగలుచల్లి వెళ్ళిపోతుంది. చాలామంది ఆ ఉచ్చుల్లో చిక్కుకునేవారేనేమో! కాని, మొట్టమొదట ఆమె విసిరిన జాల వలయంలోంచి వెంకటరత్నం సూక్ష్మరూపంతో తప్పించుకొన్నాడు. రెండవతడవ ఆమెవిసరిన వలని తునాతునకలు చేసి ఆమెనే ఆక్రమించుకొన్నాడు డాక్టర్ రేణు.

ఈ ఇద్దరిలో ప్రేమ వెంకటరత్నంమీదా, వాంఛ రేణు మీద ఉన్నది తనకి సరిగ్గా ఈ ఆలోచనవచ్చినసమయంలోనే డాక్టరు రేణు ప్రవేశించి పైమాట లన్నాడు.

ఏమిటోచక బాధపడుతున్నసమయంలో రేణు రావటం పూర్ణకి ఆహ్లాదాన్ని కలిగించిందనే చెప్పాలి. కాని ఆమెలో మరోభయంకూడా మొలకెత్తింది. ఊరేగింపుకి వెళ్ళిన వెంకటరత్నం వెనక్కిరావచ్చును. మద్రాసులో ఆ

సంఘటన జరిగిన మరునాడే తను వచ్చేసింది. ఆతరువాత కూడా వెంకటరత్నం తనని అసహ్యించుకుంటున్నాడనేందుకు దాఖలాగా నిన్నటినుంచిఒక్కసారైనా తనని పలకరించలేదు.

అతను తనకంటె చిన్నవాడు. తనని ఇలా లొంగతీసుకోటం ఏమీనచ్చలేదు. అయినా ఎదురుగుండా రేణుఉండగా తను వెంకటరత్నాన్నిగురించి ఆలోచించటం ఏమీబాగులేదు. పూర్ణ కావాలని నవ్వుతెచ్చిపెట్టుకొని, "కూర్చోండి. పెళ్ళికూతురు మీ కేమవుతుంది?" అన్నది.

"వాళ్ళమ్మ మాఅమ్మ అప్పచెల్లెళ్ళు. అయితే, ఆ రోజు నే నలా వచ్చేశానని మీరు కోపగించుకోలేదుగద? అసలు అత నెవరో పెళ్ళికికూడా వచ్చినట్లున్నాడు?"

"మా మేనత్తకొడుకు" అని పైకి సమాధానంచెప్పి అత నెవరో నా కే ఇంతమటుకు తెలియలేదు. అని లోపల అనుకుంది పూర్ణ. రేణుని వెంకటరత్నం ఎరుగును గాని, వెంకటరత్నాన్ని రేణు ఎరుగడు. ఆ పెళ్ళికి రేణుభార్య మీనాక్షికూడా వచ్చింది. ఎర్రగా సన్నగా కొంచెం ఎత్తు పళ్ళతో ఉన్న ఆపిల్ల తనకి తగిన భార్య కాదని రేణుఉద్దేశ్యం.

రేణుకి తాచుపాముఅందంలాంటి అందం కావాలి. అలాటిఅందం పూర్ణలో కనిపించింది. ఆమెను పెళ్ళిచేసుకుంటాననికూడా అన్నాడు. అది అయేదికాదని ఈ పెళ్ళివల్ల తేలిపోయింది. అలా కాకుండాపోయినందుకు అంతర్యంలో రేణు సంతోషించాడుకూడా. అయినా, ఆ సంగతి పైకి వ్యక్తపరచకుండానే పూర్ణతో మాట్లాడుతున్నాడు.

పూర్ణకి వెంకటరత్నం ఎప్పుడో రాజావిషయంలో అన్న మాటలు గుర్తుకొచ్చినయ్. ఈరోజుల్లో ప్రమాదం కలిగేంత గాఢంగా స్త్రీని ప్రేమించటం ఫ్యాషనుకాదు అని తనలో తనే నవ్వుకుంది పూర్ణ. ఆ నవ్వులోనే తలఎత్తి చూసింది. ఎదురుగుండా వెంకటరత్నం నిలుచుని ఉన్నాడు.

"నమస్కారం. రండి రండి. మనం ఇప్పుడు కొత్త చుట్టాలం అయినాంకదూ" అంటూ అసందర్భంగా నవ్వాడు రేణు.

ఆ నవ్వులో వెలితి అతనికే అర్థమై సిగ్గుపడి "వస్తానండి" అని వెంకటరత్నంసమాధానానికికూడా ఎదురు చూడకుండా వెళ్ళిపోయినాడు.

పూర్ణవంక కోపంగా చూశాడు వెంకటరత్నం. చూస్తున్నకొద్దీ అతనికోపం కరిగిపోసాగింది.

పసితనాన్ని అతిక్రమించి, యవ్వనంలో ఎప్పుడు కాలుమోపిందో ఆమెకు తెలిసిఉండదు. అంతర్వాహినిగా యవ్వనం ఆమె రక్తనాళాల్లో ఎప్పుడు ప్రవహించటంప్రారంభించిందోకూడా ఆమెకి గుర్తులేదు.

బాల్యం గడిచిపోగానే అందరుస్త్రీలలాగా ఆమెకి గృహిణిఅయ్యేయోగం వరించిపోయింది. విధి ఆమెనుదుట కుంకుమని తుడిచివేస్తే, ప్రకృతి ఆమెపెదవుల్ని రాగరంజితం చేసింది. ఇందులో ఆమెతప్పు ఆట్టేలేదు.

సుఖమే జీవితానికి లక్ష్యం అన్నభావం అయితే ఉన్నదిగాని, ఆ లక్ష్యాన్ని చేరుకోటానికి మార్గంమాత్రం

తెలియదు. అంధకారంలో పయనిస్తున్న పాంథుడికి చేత నయితే మార్గదర్శకదీపాన్ని చూపించాలి గాని, పరిహాసించటం భావ్యంకాదు.

"ఒదినా!"

వెంకటరత్నం ఆప్యాయంగా పిలిచిన ఈ పిలుపులోని ఆత్మీయతకి తట్టుకోలేకపోయింది పూర్ణ. "ఇప్పుడిక భయం లేదు" అన్నది.

"ఏం ఎందుకని?"

"నీకు నామీద కోపంవచ్చిందని యెంత వ్యథపడ్డా ననుకొన్నావు?"

పూర్ణమొగం సంతోషంతో ఉజ్జ్వలంగా వెలిగిపోతున్నది. ఆమెఅందమైనమొగంమీద పవిత్రత చెడిన లక్షణాలేమీ కనిపించటంలేదు... కాని, ఆమె పతితకావటం అనే విషయం తను కళ్ళారా చూశాడు.

పరిపూర్ణమైన యవ్వనంతో ఉన్న ఆమెశరీరమూ, మండే నిప్పులాంటి ఆమెకోరికలూ, వీటిని ఒక్క-సారిగా అతనిప్పుడు చూశాడు. ఈ విచిత్రయువతి తనలో రగిల్చిన నిప్పు దావాగ్నిగా మారిపోవటానికి ఇక ఆట్టేకాలం లేదు.

"నే నంటే నీకు భయందేనికి వదినా?" అన్నాడు అతను.

"ఈ ప్రపంచంలో నేను ఏ పొరపాటుచేసినా ఏ గొప్ప పనిచేసినా దానికి కారణం నువ్వే వెంకటరత్నం" అన్నది పూర్ణ.

"అలా అనకు – పురుషుడినికావటంవలన కొద్దిగా అసూయపడ్డమాట నిజమే. అందుకు నన్ను క్షమించాలి నువ్వు. మళ్ళీ ఒకసారి చెపుతున్నాను; నేను నీకు మేనత్త కొడుకునిమాత్రమే కాదు, స్నేహితుడినికూడా."

"నువ్వే నన్ను క్షమించాలి వెంకటరత్నం. నీమీద కోపంచేత చెయ్యరాని పాపంచేశాను" అన్నది పూర్ణ. ఇద్దరికళ్ళల్లోనూ నీళ్ళుతిరిగినయ్.

కన్నీళ్ళల్లో ఇంత మాధుర్యముందనీ మనస్సులో ఉన్న మాలిన్యాన్ని అవి ఇంతగా కడిగివేయగలవనీ ఆ ఇద్దరికీ ఇదివరకు తెలియదు.

వెంకటరత్నానికి స్త్రీల అంతర్యాన్ని అర్థంచేసుకోగల తెలివితేటలు ఉన్నాయి. ఈ విచిత్ర స్త్రీ తనని అపరిమితంగా అభిమానిస్తున్నది. తనూ అలాగే ఉండిపోవలసింది. కాని లోపలలోపల అత నేదో బాధపడుతున్నాడు. ఏమైన ఇంద్రియచాపల్యం దాగిఉన్న హృదయాంతరాళపు అంధకారమధ్యంలో అలమటించిపోతున్నాడు.

తనకి ప్రపంచం తెలిసినదగ్గరనుంచీ, ఆ ప్రపంచాన్ని వైద్యుడు రోగిని పరీక్ష చేసినంతనిశితంగా పరీక్షిస్తూవచ్చాడు. అందువల్ల అతను మనుషులమధ్యనే జీవిస్తున్నాగాని, ఒంటరితనాన్నే అనుభవిస్తున్నాడు. ఇంకోవిషయం ఏమిటంటే, ఇతరుల లోటుపాట్లు సహానంతో చూసేవాళ్ళ స్థితి సామాన్యంగా ఇలాగే ఉంటుంది.

"నీ కో చిన్నవిషయం చెప్పాలి వదినా. నిరాభరణ సుందరమైన నీ బ్రతుకుని నువ్వు అలంకరించుకోటానికి

మధ్యలో నా అభ్యంతరంఏమిటి గాని, నకిలీనగలు పెట్టుకో వద్దనిమాత్రం చెపుతున్నాను'' అన్నాడు వెంకటరత్నం.

పూర్ణ కన్నీరుతుడుచుకుని, వానలోతడిసిన వెన్నెలలా నవ్వింది. అదిచూచి వెంకటరత్నం ముగ్ధుడైపోయినాడు.

''ప్రేమ మంచుగడ్డలాటిది. దానిస్పర్శతో గడ్డ కట్టుకుపోయిన మనచేతులు ఇంకా మామూలుస్థితికి రాక మునుపే అదికాస్తా కరిగిపోయిఊరుకుంటుంది'' అన్నాడు అతను.

''అందుకే కొందరు అదృష్టవంతులు అది కరిగిపోక మునుపే ఆ చల్లదనాన్ని అనుభవించాలని యత్నిస్తారు'' అని నిటూర్చింది పూర్ణ. డాక్టరు శంకరనారాయణ చెప్పిన మాటలు గుర్తుకొచ్చినయ్ వెంకటరత్నానికి.

''వెంకటరత్నం, ఇకముందు నేను ఏ తప్పూ చేయ కుండాఉండటానికి ప్రయత్నిస్తాను.'

''చాలా సంతోషం''

''ఆరోజు వచ్చిన ఆ అమ్మాయి ఎవరు?''

''వరాలు''

''అంటే తమ్ముడిస్నేహితురాలా?''

''అవును''

పూర్ణమనసు తేలికపడింది. ఆమె అసూయపడ్డదని అతను గ్రహించి నవ్వుకున్నాడు.

పెళ్ళిఊరేగింపు దగ్గరకొస్తున్నధ్వనులు వినిపించినయ్. వెంకటరత్నం అక్కడినుంచి పోయి వాకిట్లో కూర్చున్నాడు. పూర్ణకి తనలోంచే ఆ సంగీతం పుట్టుకువస్తున్నట్లనిపించింది.

## ౧3

విజయవాడ ప్లాట్‌ఫారంమీద పూర్ణ, రేణూ నిలబడి ఉన్నారు. కళ్ళల్లో కోపం కనిపిస్తున్నా ఆమెఅంతర్యంలో ఆ కోపం లేదని రేణు గ్రహించేశాడు. మూడునిద్రలకి వస్తున్న పెళ్ళివారు బెజవాడలో రైలుమారే సందర్భంలో కొంచెం గందరగోళం జరిగింది. ఆ గందరగోళంలో ఎవరు ఎక్కడ ఎక్కిందీ అంతా గొడవ. ఆ సందడిలో పూర్ణని రైలుఎక్కకుండా తప్పించివేశాడు రేణు. కావాలనిచేసిన ఆ పని పొరపాటునచేసినట్లుగా చెప్పాడతను. తరువాత రైలుకి వెళ్ళవచ్చునుగదాఅనేధైర్యంతోనే ఉందిగాని, అంద రితోపాటు తను ఎక్కలేని తెలివితక్కువకు ఆమెకు కోపం వచ్చింది.

"ఈలోగా ఎందుకంత ఖంగారుపడిపోతారు? ఇంతలో మిమ్మల్నెవరూ కొరుక్కుతినరు" అని చిన్న పరియాచకం ఆడాడు రేణు. ఆ పరియాచకంతో పూర్ణఅధరాలు రాగ రంజితాలయినయ్. ఆమెశరీరం అవ్యక్తమైన మోహానికి లొంగిపోవటం ప్రారంభించింది.

"ఈలోగా ఇక్కడ కూర్చుని ఏంచేస్తాం? ఊళ్ళోకి పోయివద్దాం పదండి" అన్నాడు రేణు.

పూర్ణకికూడా ఈ ఆలోచన బాగానే ఉన్నట్లు అనిపిం చింది. అతనిపక్కన స్వేచ్ఛగా, ఎవరైనా చూస్తారేమో అనేభయంలేకుండా నడవటం ఆమెకి ఒక చిత్రమైన అనుభ వం. ఆ అనుభవంలోఉన్న ఇంద్రియలాలసత్వం ఆమెకి గిలి

గింతలు పెడుతున్నది. ఇద్దరూ స్టేషన్ విడిచి ఊళ్ళోకి వచ్చారు.

బెజవాడ విచిత్రమైనవూరు. పల్లెటూరికిఉండే అసౌకర్యాలూ, బస్తీకిఉండే అసౌకర్యాలూ కూడా ఆ ఊరికి ఉన్నాయ్. అంతేకాదు, ఆ ఆకర్షణాలూ ఉన్నయ్. ఏది ఏమయినా, ఈ ఊళ్ళో పుట్టిన మనుషులు ఇంగ్లండ్‌లోకూడా ఉండలేరు.

ఇద్దరూ వెళ్ళి ఒకహోటలులో కాఫీ తాగారు. కాఫీ తాగినతరువాత "సినిమాకు పోదామా?" అన్నాడు రేణు.

"ఎందుకు, మళ్ళీ రైలుకూడా తప్పిపోవటానికా?"

"మళ్ళీ రైలు రాత్రి పదకొండింటికి. అందాకా రోడ్లమీదమాత్రం ఎలాతిరుగుతాం" అన్నాడు రేణు. పూర్ణ ఇహ తలఊపక తప్పలేదు. సినిమాహాల్లో కూర్చున్న తరువాత ఈ ప్రపంచాన్ని మరిపించగల షాంపేన్‌మత్తులో పడిపోయిందామె.

ఆ రైలుకూడా తప్పిపోయింది. తప్పిపోవాలనే ఆ ఇద్దరూ కోరుకున్నారు. వెంకటరత్నానికి ఇచ్చిన వాగ్దానం మర్చిపోయి ఆ రాత్రి ఒక హోటలుగదిలో అతనితో ఉండి పోయింది పూర్ణ.

ఆమరునాడు పూర్ణ ఏమయిందో వెతకటానికి బయలు దేరబోతుంటే పూర్ణ వచ్చేసింది. "రైలుతప్పిపోవటం, ఆ హడావిడిలో తను ప్లాట్‌ఫారంమీద మిగిలిపోవటం, ఆ సమయంలో దేవుడల్లే పెళ్లికూతురుపినతల్లి కొడుకట – ఈయన కనిపించి మళ్ళీ రైలెక్కేదాకా తోడున్నారు. సరే, మీరు కూడా రండి అని నేనే అన్నాను" అని కట్టుకథ అల్లి

చెప్పింది. ఇంట్లో అందరూ రేణుని అభినందించారు. అసలు విషయం అర్థంచేసుకొన్నవాడు ఒక్క వెంకటరత్నమే!

ఆ సాయంత్రం కళ్ళతోనే సెలవుతీసుకొని రేణు వెళ్లిపోయినతరువాత పూర్ణకి వెంకటరత్నం గుర్తుకివచ్చి, భయముతో ముచ్చెమటలుపట్టినయ్. తను చెప్పిన కట్టుకథని తల్చుకుని, తనమీద తనకే అసహ్యంవేసింది. కాని ఈ నాలుగురోజులూ వెంకటరత్నం ఒక్కమాట మాట్లాడలేదు. నాలుగవనాటిరాత్రి అతను మద్రాసు వెళ్ళిపోయినాడు. మూడునిద్రలకి వెళ్ళివచ్చినతరువాత తల్లినీ అప్పగార్ని తీసుకొని రాజాకూడా మద్రాసువచ్చాడు. రాజ్యలక్ష్మి రాచకురుపు మళ్ళీ సెలవేసింది. కొన్నాళ్ళకి అక్కడివాతావరణమే చిత్రంగా తయారయింది. రాజ్యలక్ష్మిసాయంత్రం ఆరుఅయేసరికి నిద్రపోతుంది. రాజా నాలుగూ అయేసరికి కొత్తగా కొన్న కారుతీసుకొని జీవనస్రవంతిరిహార్సలుకి వెడతాడు.

సరిగ్గా ఇదేసమయంలో పూర్ణా రేణూ కలుసుకుంటారు. ఒకరోజు వేళకానివేళ శంకరనారాయణ వచ్చేసరికి పూర్ణా, రేణూ ఒకసోఫాలోనే కూర్చుని నవ్వుకుంటున్నారు. అది చూచిన శంకరనారాయణ విస్తుపోయినాడు. రేణు భయపడ్డాడు గాని, పూర్ణ అట్టే భయపడలేదు. తల్లిగదిలోకి అతన్ని తీసుకువెళ్ళింది. పరీక్షచేసి తిరిగివస్తూ డాక్టరు రేణుని తనతో రమ్మన్నాడు శంకరనారాయణ. ఇద్దరూ కలిసి వీధిలోకి వెళ్ళినాక,

"నువ్వీవిధంగా చేయటం ఏమీ బాగాలేదోయ్. మా అన్నగారికి తెలిస్తే చాలా బాధపడతారు" అన్నాడు శంకరనారాయణ. డాక్టర్ రేణు కొంచెంసేపటికి తెప్పరిల్లుకొని,

"నేనూ అలాగే అనుకుంటాను. కాని, సాయంత్రం అయ్యేసరికి నాకు తెలియకుండానే అక్కడికి వెళతాను" అన్నాడు.

"అదీకాక, నువ్వు పెళ్ళయినవాడివి, అర్థంలేనిప్రణయాల్లో ఇరుక్కోటం ఆ అమ్మాయికి ద్రోహం."

"అదికాదు నారాయణా, ఈ దిక్కుమాలినలోకంలో జీవనసంగ్రామంమధ్య ఏదీ స్పష్టంగా తెలియటంలేదు. జ్ఞానదారిద్ర్యంవల్ల మనశ్శాంతి పోగొట్టుకున్న మనిషి దురలవాట్లకి లోనుకాకతప్పదు. అలాటి అలవాట్లల్లో మదిర తరువాత మానిని వస్తుంది" అన్నాడు రేణు. అతని సమాధానానికి శంకరనారాయణ అసహ్యించుకొన్నాడు.

"నివు అనే ఈ మాటలు ఏ వెంకటరత్నంగారో అంటే, చాలా ఆనందించేవాడిని. నువ్వంటున్నావు కాబట్టి అసహ్యంగాఉంది" అన్నాడు.

"అంత అసహ్యంకలిగించేపని నే నేమీ చేయలేదే" అన్నాడు రేణు. ఈసారి అతనికంఠస్వరంలో శంకితవం ధ్వనించింది.

"ఒక అయినింటిపిల్లతో నీ వ్యవహారం అసహ్యం కాక మరేమిటి?"

"నేనూ అయినఇంటివాడినే వాళ్ళు మాకు చుట్టాలు కూడా అయ్యారు. అయినా ఆమె వితంతువు. కనీసం ఈమాత్రం సుఖానికికూడా ఆమె నోచుకోలేదా?" అన్నాడు రేణు.

సరిగ్గా అదేసమయంలో వరాలూ, రాజా కారులోంచి దిగారు. వాకిట్లో నిలబడి మాట్లాడుతున్న ఆ ఇద్దరుడాక్టర్లనీ పైకి ఆహ్వానించాడు. రేణు వరాల్నిచూడటం ఇదే మొదటి సారి.

నలుగురూ సోఫాల్లో కూర్చున్నతరువాత "అక్కయ్యా, డాక్టరుగార్లకి కాఫీ పంపించు" అని లోపలికి కేకవేశాడు.

"నమస్కారం డాక్టరుగారూ! ఆరోజుతరువాత మళ్ళీ మీారు కనిపించనేలేదు" అన్నది వరాలు.

"ఎక్కడ కనిపించమంటారు?" అని నవ్వాడు శంకర నారాయణ. ఆ నవ్వులో అతనిజీవితరహస్యం కొద్దిగా తొంగి చూసింది. కాని, అక్కడ ఉన్న దెవరూ వెంకటరత్నాలు కారు కనుక, ఆవిషయం గ్రహించలేరు.

ఈ సుందరనారి కనుబొమలవంపులో ప్రపంచం ఉయ్యాల లూగుతున్నది. ఈ ఊర్వశిపెదవివిరుపులో లోకం తన సౌందర్యాన్ని రాగరంజితంచేసుకొంటున్నది. ఎవరు? ఎవరీ స్త్రీ? ఈమె తనని ఇంతగా వేధిస్తున్న దేమిటి?

డాక్టరు రేణుకూడా ఆమెవంక చిత్రంగా చూస్తు న్నాడు. పూర్ణకూడా చాలా సౌందర్యవతి. కాని ఈ పిల్ల సౌందర్యం వేరు. ఈమెది దేవతలఅందం, పైగా నటి కావటంవలన చక్కని అలంకరణలో ఉన్నది. ఈఇద్దరుడాక్టర్లూ తెల్లబోయి వరాలువంక చూడటం చూసి, నవ్వుకున్నాడు రాజా.

ఇంతలో పూర్ణ కాఫీ తెచ్చి ఇచ్చింది. "మా అక్కయ్య" అని వరాలుకి పరిచయంచేశాడు రాజా. తెలుసు అన్నట్లు తలఊపింది ఆమె. తను అర్ధాంతరంగా మూర్ఛపోయినప్పుడు వెంకటరత్నంతో వచ్చినది ఈ పిల్లే అని గ్రహించింది పూర్ణ. ఈమే వరాలు. ఈవిడసంగతే తను వెంకటరత్నం ద్వారా విన్నది. రాజాకి స్నేహితురాలు ఈమే. పూర్ణ విచిత్రంగా వరాలువంక చూడనారంభించింది. వరాలు అందం మొగవాళ్ళయిన డాక్టర్లతోపాటు స్త్రీఅయిన పూర్ణని కూడా ఆకర్షించింది. కొన్నిసౌందర్యాలు అవతలసెక్స్ కే ఆకర్షణ అయితే, మరికొన్నిఅందాలు అందరికీ ఆకర్షణకలిగిస్తాయ్. అలాటిఅందమే వరాలుది. అలాటిఅందమే రాజాది.

"ఏమిటి బావగారు అలా తెల్లబోయిచూస్తున్నారు?" అన్నాడు రాజా రేణువంకచూసి. అదిచూసి పూర్ణ అసూయ పడ్డది.

"రేణుస్వభావం అంతే ఏ అందమైనవస్తువు చూసినా, అతను అలాగే చూస్తాడు" అని ఇదేసమయంఅనుకొని ఒక విసురువిసిరాడు శంకరనారాయణ.

ఇంతలో వెంకటరత్నం లోపలికి వచ్చాడు. అతన్ని చూసి పూర్ణ లోపల కెళ్ళింది. రేణు మొహం చిన్నపోయింది. మిగతా ముగ్గురూ అతన్నిచూసి చాలా సంతోషించారు. వెంకటరత్నం సరాసరి లోపలికి వచ్చి పూర్ణ కాఫీచేసివెళ్ళిన కుర్చీలో కూర్చున్నాడు.

ఒక మహారచయితగా, మరొక ఉత్తమకళాకారుడూ, ఇంకొక మేధావీ అతనిలో ఉన్నారు. వరాలుకి ఉత్తమకళా

కారుడుగా, రాజాకి మహారచయితగా, డాక్టరు శంకరనారా యణకి మేధావిగా కనిపించాడు వెంకటరత్నం.

"అక్కయ్యా, బావకికూడా ఒకకప్పు కాఫీ ఇచ్చిపో" అని లోపలికి కేకవేసి" ఏరా, ఇవ్వాళ ఇంతతొందరగా వచ్చావు?" అని వెంకటరత్నాన్ని ప్రశ్నించాడు రాజా.

ఆ ప్రశ్నకి జవాబుఇవ్వకుండానే "ఏమ్మా వరాలూ, ఇవాళ రిహార్సలు లేదా?" అని ప్రశ్నించాడు. ఎంతో అణ కువగా 'లేదండీ' అని జవాబిచ్చింది వరాలు.

"ఏమిటా్రి తొందరగా వచ్చావ్ అని కాదూ, అడు గుతున్నావు. మీ నాన్నగారిదగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. కాపురం బందరుకి మార్చి, అహోబలరావుగారిచేతే అత్త య్యకి మందుఇప్పిస్తారట" అన్నాడు వెంకటరత్నం.

"అదే మంచిది" అన్నాడు శంకరనారాయణ. డాక్టర్ రేణుమొహం మాత్రం పాలిపోయింది.

"ఏం డాక్టరుగారూ, ఈ విషయం మీకు నచ్చినట్లు లేదే" అని కొంటెగా ప్రశ్నించింది వరాలు.

"అనేక కారణాలవల్ల ఇష్టంఉండకపోవచ్చును. అయినా ఆ ప్రశ్న మీరు వేయకూడదు" అన్నాడు శంకరనారాయణ.

రాజాకి ఈ మాటలఅర్థం ఏమీ బోధపడలేదు. వెంక టరత్నం అంటే ఉన్న అపారప్రేమవలన అతను తనఅక్క గార్ని గౌరవిస్తాడని తెలిసినా, రాజా ఏమీ అనుకోలేదు. రేణుగొడవ అతనికేం తెలియదు. అందుకనే వరాలూ, శంకర నారాయణా అన్నమాటలు అతనికి అర్థంకాలేదు.

"మా కాపురం బందరుకి మారిస్తే, అందులో రేణు బావగారికి ఇష్టంలేకపోవటం ఏమిటి?" అని ప్రశ్నించాడు. పరిస్థితి ఇలా వచ్చేసరికి వెంకటరత్నం మాట్లాడకతప్పలేదు వీళ్ళందరికీకూడా పూర్ణ రేణులకథ తెలియటం అతనికి సిగ్గునీ అసహ్యాన్నీ కలిగించింది. వెంటనే మాట మార్చాలని,

"కాలం ఒక వెలుగుచారవంటిది. ఆ చారపక్కనే మనం నడుస్తూపోతాం. ఎంత బాధఅయినా, జీవితంలో ఒక అందం ఆనందం ఉన్నాయి. అది పరీక్షచేయటంలో అపరిమితమైన తృప్తికూడా ఉంది" అన్నాడు.

"బాగుంది, ఇప్పు డీ మాటలు ఎందుకు చెప్పినట్లు?" అన్నాడు రాజా. వెంకటరత్నం ఉద్దేశ్యంకూడా రాజాని మరోదారిపట్టించాలని అయినా "చెప్పాలనిపించింది, చెప్పాను" అన్నాడు.

"ఈ దిక్కుమాలినప్రపంచంలో జీవనసంగ్రామంమధ్య ఏదీ స్పష్టంగా తెలియటంలేదు. జ్ఞానదారిద్ర్యంవలన మన శ్శాంతి పోగొట్టుకున్న మనిషి దురలవాట్లకి లోనుకాక తప్పదు. అలవాట్లలో మదిరతరువాత మానిని వస్తుంది. ఇందులో మీ అభిప్రాయం ఏమిటి?" అన్నాడు శంకరనారాయణ వెంకటరత్నాన్ని ఉద్దేశించి. రేణుమొహంలో చిరాకు వ్యక్తంఅయింది.

"యుగయుగాల జ్ఞానంతోపాటు తరతరాల వైరికూడా వారసత్వంగా మానవుడికి సంక్రమిస్తూనేఉంది. ఈ దిక్కుమాలిన జీవనసంగ్రామంలో స్పష్టంగా ఏదీ తెలియడంలేదు అన్న మాటలు ఒక తత్వవేత్తవి. అరిస్టాటిల్, సోక్రటీస్,

శంకరరాచార్య పీళ్ళ వారసత్వంకింద అన్నమాటలు. ఇక జ్ఞానదారిద్ర్యంవలన మనశ్శాంతి పోగొట్టుకున్న మనిషి దురల వాట్లకి లోనుకాక తప్పదు, అన్నమాటలు బలహీనతనీ పటుత్వంలేని వ్యక్తిత్వాన్నీ తెలియపరుస్తుంది. నీరో, తుగ్లక్ మొదలయినవారి వారసత్వం ఇది. ఇక మూడవది చాలా ఘోరమైనది. దురలవాట్లలో మదిరనీ మానినినీ చేర్చటం క్షమించరాని మహాపరాధం. మదిరా మానినీకూడా మానవుడి నికృష్టజీవితానికి దీపశిఖలుగా భగవంతుడు ప్రసాదించిన అపూర్వ వరాలు. మొదటిది మదిర. ఈ ప్రపంచంనుంచీ, నీచమైన తన అనుభవాలనించీ తననితాను మభ్యపెట్టుకొని, కొన్నిగంటలయినా దేహమూ, మనసూ మనోస్థితిలో ఇచ్చే నూతనానుభవంకోసం ప్రయత్నించటం. ప్రతి మానవుడూ తనజీవితంలో ఎప్పుడో ఒకప్పుడు చేస్తాడు. ఆ ప్రయత్నానికి పర్యవసానాలే మత్తుపదార్థాలు. అందులో మొదటిది మదిర-ద్రాక్షరసంతో తయారుచేయటం మొదట ప్రారంభమయింది. దీనిలో విచిత్రమైనగుణం ఏమిటంటే,

ఇది తాగినప్పుడు కవి మహాకవి అవుతాడు. గాయకుడు మహాగాయకుడు అవుతాడు. శిల్పి ఉత్తమశిల్పి అవుతాడు. అలాగే దొంగ గజదొంగ అవుతాడు. హంతకుడు రాక్షసుడు అవుతాడు. అబద్ధాలుచెప్పేవాడు ఇంకా అబద్ధాలు చెపుతాడు-అంటే, అదివరకు ఆ మనిషిలో సహజంగా ఏ గుణమైతేఉన్నదో, ఆ గుణాన్ని మదిర హెచ్చువేస్తుంది. సామాన్యంగా మనుష్యుల్లో దొంగలూ అబద్ధాలకోర్ల సంఖ్యే ఎక్కువ

కనుక, మదిర వాళ్ళే త్రాగుతారు కనుక, అది చాలా చెడు అనే అభిప్రాయం ఏర్పడింది.

ఇక మానిని; సృష్ట్యాదిలో ఒంటరితనంతో అఘోరిస్తున్న మగవాడిసహాయార్థం బ్రహ్మ పంపిన ఒక ఉత్తమ వరం. కాలంగడిచినకొద్దీ మగవా డెలా మారినా స్త్రీమాత్రం అతనికి సహాయంచేసి తనకు బ్రహ్మదేవుడిచ్చిన ఆదేశాన్ని తు. చ. తప్పకుండా ఈనాటికీ పాలిస్తూనేఉంది. కాని, మగవాడుమాత్రం ఆమెతోనూ జీవించలేడు. ఆమెలేకుండానూ జీవించలేడు. అందుకే తన పతనానికీ దుర్దశకీ ఆమెమీదనే నేరంవేస్తాడు. ఈ భావం మనకి కీచకుడూ, రావణుడూ మొదలైనవాళ్ళనుంచి దిగుమతి అయింది" అన్నాడు వెంకటరత్నం.

"అంటే, ఇప్పుడు నా ప్రశ్నని మూడుభాగాలుచేస్తే అందులో రెండువంతులు చెడూ, ఒకవంతు మంచీ ఉన్నదన్నమాట" అన్నాడు శంకరనారాయణ. వెంకటరత్నం అవునన్నట్లు తలఊపాడు.

"అయితే, త్రాగటంలో తప్పులేదా?" అన్నాడు రాజా.

"నువ్వు అలవాటుని లొంగదీసుకున్నంతకాలం అది తప్పులేదు. అలవాటు నిన్ను లొంగతీసుకున్నప్పుడు అది తప్పు అవుతుంది" అని సమాధానం ఇచ్చాడు వెంకటరత్నం.

౧౪

సూర్యోదయం అయింది. ప్రసాదరావుగారు గీతా పారాయణంచేస్తున్నారు. ఈ సలహా వెంకటరత్నమే ఆయనకి ఇచ్చాడు. అదివరకు వైదేహమ్మగారి తృప్తికోసం భోజ

నానికిముందు కేశవా, నారాయణా అంటూఉండేవా రాయన. వెంకటరత్నం ఒకసారి "గీత చదువు మామయ్యా" అని చెప్పి, ఒకపుస్తకంకూడా కొనిఇచ్చాడు. అందులో సంస్కృతానికి ఇంగ్లీషువ్యాఖ్యానం ఉంది. ప్రసాదరావుగారు దేవనాగరి చదువుతారు.

పక్కగదిలో మంచంమీద పడుకున్న రాజ్యలక్ష్మి భర్త చదువుతున్న గీత వింటున్నది. పొద్దుటినుంచీ ఆమెకి మగతగా ఉన్నట్లున్నది. బందరు వచ్చినతరువాత కొద్దిగా తగ్గినట్లేతగ్గి మళ్ళీ హెచ్చింది. అహోబలరావుగారు రేపు ఆపరేషన్ చేస్తామన్నారు. ప్రసాదరావుగారు గీత చదువుతూనేఉన్నారు.

అది అర్జునవిషాదయోగం. అంతర్యానికీ కర్తవ్యానికీ సంఘర్షణ కలిగినపుడు యుగయుగాలనుంచీ మానవుడు పడుతూవచ్చిన సందిగ్ధస్థితిలోనే సవ్యసాచికూడా పడ్డాడు. ఈ గీత మనిషి అభ్యుదయానికి ముఖ్యసాధనాలైన జ్ఞాన, కర్మ భక్తి యోగాలను మూడింటినీ సమన్వయంచేసిందని చెప్పవచ్చును.

కొద్దిగా భక్తికి ప్రాధాన్యత ఇచ్చింది. అందరూ భగవంతుడి స్వరూపాలే అయినా, ఒక ప్రత్యేక వ్యక్తిరూపంలో కృష్ణభగవానుడుగా సాక్షాత్కరించి, నరుడైన నరుడికి నారాయణుడుగా ఒక మహోత్తమయోగాన్ని బోధించాడు. అది ఒక్క నరుడికే కాదు, నరులందరికీకూడాను.

బ్రతుకులో పరమార్థాన్ని విస్మరించకుండా ఆధ్యాత్మిక ప్రపంచానికి దూరంకాకుండా స్వధర్మాన్ని పరిపాలించ

మని గీత అంటుంది. అంతేకాకుండా, ఫలాపేక్ష లేని కర్మకి అది ప్రాధాన్యం ఇచ్చింది. ఈ గీతలో ఏదో మహత్తు ఉన్నది. మహా సుందరమైన ఈ వేదాంత గీతిక విషాద యోగంలో పడిన నరుడికి కర్తవ్య ప్రబోధం చేస్తున్నది.

మృత్యువు అంటే, మనిషికి భయంతోపాటు అవ్యక్తమైన కుతూహలంకూడా ఉంది ప్రసాదరావుగారి గీతా పారాయణం పక్కగదిలోంచి వింటున్న రాజ్యలక్ష్మికి మనసులో మృత్యుజిజ్ఞాస కలిగించింది. దాని ఫలితంగా భర్తని పిల్చి, ఎంతోకొంత ఆస్తి పూర్ణపేర పెట్టించే ఏర్పాటు చేయటం మంచిదని సూచించింది. ఈ విషయంలో ఆలోచించటానికి వెంకటరత్నాన్నీ రాజానీ మద్రాసునించి రమ్మని ఉత్తరం వ్రాశారు ప్రసాదరావుగారు. ఈ విషయంలో రామమ్మగార్ని అడిగితే "అదంత మంచిపనికాదు" అన్నది.

ఏది ఏమయినా, తమ వితంతుపుత్రిక పేర కొంత ఆస్తి ఉండటం అవసరమనే ప్రసాదరావుగారు కూడా అనుకుంటున్నారు.

నాలుగురోజుల్లో రాజాభార్య కాపురానికి వస్తుంది. అత్తగారు రాచపుండుతో మంచంమీద ఉంటే... అత్తగారి అత్తగారు వార్ధక్యంతో మంచంలోఉన్న ఈ పరిస్థితిలో ఇంటికి యజమానురాలు ఆమే అవుతుంది. అప్పుడు పూర్ణ పరిస్థితి మారిపోవటానికి చాలా అవకాశంఉంది. ప్రసాదరావుగారు నరహరికి కూడా ఒక ఉత్తరం వ్రాశారు.

గుంటూరునించి మధ్యాహ్నానికల్లా వచ్చిన నరహరి రావు సరాసరి ఒదిన గదిలోకి వెళ్ళాడు. రాజ్యలక్ష్మి పక్కన కూర్చుని ఏడవటం ప్రారంభించాడు.

"ఊరుకో నరహరీ! ఎవరయినా యెంతకాలం బ్రతుకు తారు? చెప్పు. ఇప్పుడు నాకు చనిపోతాననే చింతకన్న పూర్ణగతి ఏమిటాని అన్న చింతపట్టుకుంది" అన్నది రాజ్య లక్ష్మి.

"దాన్ని అక్కయ్య కొడుక్కి ఇవ్వకుండా చేసి మని ద్దరమే దాని గొంతుకోశాం. ఇప్పుడిక ఏంచేయాలోకూడా మనిద్దరమే ఆలోచిద్దాం" అన్నాడు నరహరిరావు.

"నరహరీ!"

"ఏం ఒదినా?"

"గుర్తుందా? రాజాపుట్టినప్పుడు నువ్వు ఆలస్యంగా వచ్చావు. ఆరోజు నీకోసం తోడుపెట్టిన మీగడపెరుగు నీకు అత్తగారు వేయరేమో అని, భయంతో పురిటిమంచంమీద ఉండికూడా అది ఆవిడకి జ్ఞాపకంచేశాను. నీవు నా మొదటి బిడ్డవు. నిన్నొకటి కోరుతున్నాను. పూర్ణకి అన్యాయం జరగకుండా చూడు. ఇక వెళ్ళి మీ అమ్మగారిని చూచిరా" అన్నది రాజ్యలక్ష్మి. నరహరి వెళ్ళాడు.

ఆరాత్రికి రాజా, వెంకటరత్నం దిగారు. అనుకో కుండా దర్శనంఇచ్చిన చిన్న మేనమామని చూసి పలకరించి సరాసరి అమమ్మదగ్గిరికి వెళ్ళాడు వెంకటరత్నం. వెంకట రత్నాన్నిచూసి రామమ్మగారు సంతోషించింది.

"ఏమిటి అమ్మమ్మా, నీ చిన్నకొడుకుకూడా దిగాడు?" అని ప్రశ్నించాడు వెంకటరత్నం.

"ఏమీ లేదు, పూర్ణపేర కొంత ఆస్తిపెట్టటానికిట. మీ అత్తయ్య ఈ విషయంలో ఛాలా పట్టుదలగా ఉంది" అని జవాబిచ్చింది ఆ వృద్ధురాలు. వెంకటరత్నం గతుక్కుమని—

"ఇక సర్వనాశనం జరగటానికి ఆట్టే ప్రయత్నం అక్కరలేదు" అన్నాడు

"నేనుఅనేదీ అదే. నిన్న ప్రసాదం అడిగితే వద్దు అనే చెప్పాను. నీ కోడలు పట్టుపడుతోందమ్మా అన్నాడు" అన్నది. వెంకటరత్నం మాట్లాడలేదు.

"నాకు తెలుసురా నాయనా. దానిస్వభావం చాలా చంచలమయినది. ఆస్తికూడా దానికి చిక్కితే ఇక పట్టపగ్గాలుండవు" అన్నది ఆవిడ. వెంకటరత్నం కొంచెం ఆలోచించి "రాజాభార్య ఎలాంటిది?" అన్నాడు.

"చాలా మంచిది. అయినా, అప్పుడే యేం తెలుస్తుంది?" అన్నది రామమ్మగారు.

"సరే, మామయ్యతో చెప్పిచూస్తాను. ఈవిషయంలో గట్టిగా వద్దని చెప్పటంకూడా లోకదృష్టిలో అన్యాయంగానే కనిపిస్తుంది" అని అక్కడనుంచి బయటికివచ్చాడు వెంకటరత్నం.

ఆ సాయంత్రం ప్రసాదరావుగారూ వెంకటరత్నం చిలకలపూడివేపు షికారువెళ్లారు. ప్రసాదరావుగారు చెప్పినదంతా విన్నతరువాత—

"ఈవిషయంలో నా అభిప్రాయం పాటించేస్థితిలో నువ్వు లేవని నాకు తెలుసును మామయ్యా. మంచో చెడో అత్తయ్యకోరిక నెరవేర్చటం నీకు ధర్మం. ఆ తరువాత విధి ఎలాఉంటే అలా జరుగుతుంది" అన్నాడు.

ప్రసాదరావుగారు నిట్టూర్చి, "నువ్వూ, నేనూ, అమ్మా ఒకమాదిరిగా ఆలోచిస్తున్నాం. నరహరీ, రాజా, మీ అత్తయ్యా ఒకమాదిరిగా అభిప్రాయపడుతున్నారు. న్యాయంగాచూస్తే, వితంతుపుత్రికకి కాస్త ఆస్తిఇచ్చినందువల్ల పోయిందేమీలేదు" అన్నారు.

"ఇప్పుడు ఈ వ్యవహారానికి మనం వ్యతిరేకించినా కూడా మనకు హృదయంలేదంటారు. కాని జరిగేదేదో జరుగుతుంది" అన్నాడు వెంకటరత్నం. కొంచెం సేపు ఇద్దరూ మాట్లాడలేదు.

"వెంకటరత్నం!"

"ఏం మామయ్యా?"

"పూర్ణ ఎలాంటిది?"

"ఆ ప్రశ్న నన్ను అడగొద్దు మామయ్యా"

"తండ్రినై ఉండి నా కూతురు ఎలాంటిది? అని ఇంకెవర్ని అడగమంటావు చెప్పు?"

"నేనుమాత్రం పరాయివాడినికాదా?"

"కాదు. నా ఆశయాలూ నా ఊహలూ నీతో ఉన్నయ్. నేను నా పిల్లలమీద ఏనాడూ ఆశపెట్టుకోలేదు. నా కొడుకువైనా మేనల్లుడివైనా స్నేహితుడివైనా నువ్వే"

"ఆ సంగతి నాకూ తెలుసు మామయ్యా! కాని పూర్ణ

విషయంలో మాత్రం నిజం చెప్పాలన్నా భయంగానే ఉంది" అని నిట్టూర్చాడు వెంకటరత్నం.

"నువ్వు చెప్పకుండానే అర్థమయింది - పద. విధి ఎలా ఉంటే అలా జరుగుతుంది" అని వెనక్కి తిరిగారు ఆయన. కొంతదూరం నడిచాక "నువ్వు కొన్నాళ్ళు పూర్ణనీ నన్నూ అనుమానించావుకదూ" అన్నాడు వెంకటరత్నం.

"లేదు. ఏం అలా అన్నావు?" అన్నారు ప్రసాద రావుగారు.

"మరేంలేదు. ఎందుకో అలా అనుకున్నాను" మేన మామకు సమాధానంఇచ్చి ఆలోచిస్తూ నడుస్తున్నాడు వెంకట రత్నం.

"ఏమిటి ఆలోచిస్తున్నావు?" అన్నారు ప్రసాదరావు గారు.

"ఏమీలేదు మామయ్యా. ఠాగూర్ చిత్రలో "నేను చిత్రను... ఆరాధింపదగిన అప్సరసనూకాను, తీసివేయదగిన సీతాకోకచిలుకనూకాను. ప్రమాదమైన నీ ప్రగతిలోనూ సాహసోపేతమైన నీ జీవనస్రవంతిలోనూ నీతోకూడా ఉం టాను. అప్పుడు నా నిజమేదో నీకు అర్థమవుతుంది" అని చిత్రచేత అనిపిస్తాడు. ఆమాటల కర్థమేమిటా అని ఆలోచిస్తు న్నాను" అన్నాడు వెంకటరత్నం.

"ఇప్పుడా ఆలోచన దేనికి?"

"అత్తయ్య ఇక ఆట్టేరోజులు బ్రతుకదు. ఆతరువాత నీ భాషా నీకు దగ్గిరవుతుంది" అని జవాబిచ్చాడు వెంకట రత్నం.

వెంకటరత్నం చెప్పినది నిజమేఅయింది. రాజ్యలక్ష్మి పూర్ణపేర ఆస్తిపెట్టినతరువాత అయిదారురోజులకు నిశ్చింతగా కన్నుమూసింది. ఆసమయానికి దగ్గరలో వెంకటరత్నం, ప్రసాదరావుగార్లే ఉన్నారు. రాజా మద్రాసులోఉండటం వలన అతడు వచ్చేవరకూ శవాన్నిఉంచారు. తల్లి పోయినందుకు రాజా విచారించినట్లు పైకి కనిపించలేదు. పూర్ణ మాత్రం పైకి చాలా దుఃఖపడింది.

రాజా చాలా బాధపడుతున్నాడనీ, పూర్ణ పైకికనిపించేంత బాధపడటంలేదనీ గ్రహించినవాడు వెంకటరత్నం. రాజ్యలక్ష్మికి చివరిస్నానంచేయిస్తూ ఆమెచేతిప్రధానపుఉంగరం కోడలికి ఇస్తే, మర్చిపోకుండా దాన్ని అడిగితీసుకుంది పూర్ణ. రాజాభార్య గర్భవతి. అత్తగారిచావుకు అందరికంటె బాధపడింది ఆ పిల్లే.

కర్మలన్నీ పూర్తిఅయినాక పదమూడవనాటిరాత్రి ప్రయాణంపెట్టుకున్నాడు వెంకటరత్నం. ఆ సాయంత్రం రామమ్మగారిగదిలోకి వెళ్ళాడు. అతనిని చూడగానే రామమ్మగారు బావురుమంది.

"ఊరుకో అమ్మమ్మా. అన్నీ తెలిసినదానివి నువ్వే ఇలా బాధపడితే ఎలా?" అన్నాడు వెంకటరత్నం. ఆవిడ కళ్ళుతుడుచుకుని "అదికాదురా నాయనా! రాజ్యలక్ష్మి పన్నెండేళ్ళపిల్లప్పుడు ఈ ఇంటికి వచ్చింది. ఈ దిక్కుమాలినకొంపలో అది ఏంసుఖపడిందో ఆ భగవంతుడికే తెలియాలి. ఈ ఇంటికి చాకిరీచేసింది. మీ అమ్మా పిన్నిలూ అన్న ఎత్తిపొడుపులన్నీ పడ్డది. ఇప్పుడు దానిదారిన అది

వెళ్ళింది. నేను బ్రతికే ఉన్నాను. ఇంకో ఉమిటంటే, ప్రసాదం కూడా దానిమీద అభిమానాన్ని నటించాడుగాని, అభిమానించలేదు" అన్నది.

అయితే, ఈవిడదృష్టిని అదీ పడిందన్నమాట అనుకున్నాడు వెంకటరత్నం. అక్కడినుంచి లేచి ప్రసాదరావుగారిదగ్గరకి వెళ్లాడు. ప్రసాదరావుగారు నిర్లిప్తంగా ఉత్తరపు వేపువసారాలో కూర్చున్నారు. వెంకటరత్నం రావటం చూసి

"రాత్రికి వెడుతున్నావా?" అని ప్రశ్నించారు. వెంకటరత్నం తలఊపి, పక్కనేఉన్న కుర్చీలాక్కుని మేనమామకిదగ్గరగా కూర్చున్నాడు.

"అతి జటిలంగాఉండి పరిష్కారంకాని ప్రతిప్రశ్నకీ జీవితం ఇచ్చే సమాధానం ఒక్కటే. అది పరిస్థితులకి లొంగిపోయి జీవించటం"అని ప్రసాదరావుగారు చిరునవ్వునవ్వారు. ఆనవ్వు వెనకాలఉన్న అగాధమైన విషాదం వెంకటరత్నం గ్రహించాడు. ప్రక్కనేఉన్న భగవద్గీత తీసి, మేనమామ చేతుల్లో పెట్టి మెల్లిగా బయటికి వెళ్లిపోయాడు వెంకటరత్నం. భగవద్గీతని కళ్ళకద్దుకున్నారు ప్రసాదరావుగారు. ఆయన కన్నీరు ఆ పుస్తకానికి అంటింది. అందులో నరుడు ఉలిక్కిపడ్డాడు.

నాలుగునెలలు గడచినతరువాత మద్రాసుబీచిలో వరాలూ వెంకటరత్నం కూర్చునిఉన్నారు.

రాజాపతనం పరాకాష్ఠనందుకుంటున్నది. ఆవిషయమయ్యే ఆఇద్దరూ బాధపడుతున్నారు. మూడుకార్లుకొన్నాడు. కేసులకి డబ్బులుతగలేస్తున్నాడు. వీటన్నిటికీ అప్పుచేస్తున్నాడు.

"అయితే, ఈ సంగతి మామయ్యకి తెలియచేస్తాను" అన్నాడు వెంకటరత్నం.

"దానివలన ప్రయోజనంఉందనుకుంటే, అలాగే చేయండి. కాని ప్రయోజనంఉంటుందని అనిపించదు" అన్నది వరాలు.

"నిన్ను ఎంతో అభిమానంతో చూస్తూఉండేవాడు. ఇప్పు డా అభిమానం ఏమయింది?"

"ఇప్పటికీ అదేఅభిమానంతో చూస్తున్నారు." "నువ్వతన్ని ఎలాక్షమిస్తావో నాకుఅర్థంకాదు. నీవదులేటే మరో స్త్రీని వాడు పెళ్ళిచేసుకుంటున్నాడని ఒకసారి బాధపడ్డావు. ఇప్పు డీ అత్యాచారానికి ఎలా ఊరుకోగలిగావో నా కేమీ అర్థంకావటంలేదు" అన్నాడు వెంకటరత్నం. వరాలు నిట్టూర్చింది

"నా పూలసజ్జలో సజీవమైనపుష్పాలే ఉంచాలనుకొన్నాను. అందుకే అవి వాడిపోయినయ్. అలా కాకుండా కాగితంపూలతో నా పూలసజ్జ నింపుకుంటే, అవి ఏనాటికీ వాడిఉండేవికావు. రాజాతో నా ప్రేమ సజీవమైనపుష్పం వెంకటరత్నంగారూ. అందుకే అది వాడిపోయింది. అయినా దాని పరిమళం నా బ్రతుకునీ హృదయాన్నీకూడా పులకింపచేస్తున్నది. నా కది చాలు...అందుకే అతన్ని క్షమించగలిగానుకూడా" అన్నది ఆమె.

వెంకటరత్నం ఒక దేవీమూర్తినిచూచినట్లు ఆమెని చూసి,

"నీవి చాలా చిత్రమైనఊహలు వరాలూ! స్త్రీలు తమజీవితంతుదివరకూ అమూల్యమని భావించినవిషయాన్ని నువ్వు అవహేళన చేస్తున్నావు. స్త్రీలు నీచంఅనుకునేదాన్ని నీవు హిమగిరిశిఖరాన్ని ఎక్కిస్తావు. వరాలూ, ఇది నీలో ఉన్న ప్రత్యేకత" అన్నాడు.

వరాలు కొంచెంసేపు మాట్లాడలేదు. "రాజాలోకూడా అలాటి విచిత్రమే ఏదో ఉన్నది. నేను చిన్నతనంనుంచీ ఆట్టే సుఖపడలేదు. అమ్మనీ మా అయిదుగుర్నీపోషించే భారంకూడా ఇప్పుడు నామీదే పడింది. నా ఈ రంగు దారాలచిక్కులో ఈ అగమ్యమైన పాడుజీవితంలో రాజా ఒక మహాశాంతిని నాకు ఇచ్చాడు. కాని, ఇప్పుడదీ పోయే టట్లున్నది" అన్నది. ఆమెకళ్ళల్లో ముత్యాలకన్న అందం గాఉన్న రెండు నీటిబొట్లు నిలిచినయ్.

వెంకటరత్నం అదిచూసి చాలా బాధపడి, "నీవు ఏడవకూడదు వరాలూ! అందరుస్త్రీలమల్లేనే నీవూ దుఃఖించ టం నాకు బాగాలేదు" అన్నాడు.

"చిన్నప్పటినుంచీ నాలో ఏదో ప్రత్యేకత ఉందని లోకం అంటుంటే, నేనూ నమ్మి అలాగేఉండాలని ప్రయ త్నించేదాన్ని. నాకు దుఃఖంలేనట్లూ, భయం అసలేలేనట్లూ ప్రవర్తించాను. కాని, ఇప్పుడు అదంతా నటనఅని తేల్చు కున్నాను. మనసారా దుఃఖించాలనిఉంది... అంతేకాదు, వెంకటరత్నంగారూ! బ్రతుకంటే భయంపుడుతున్నది" అంటూ వరాలు నిశ్శబ్దంగా దుఃఖించటం ప్రారంభించింది.

"ఒకరకమైన వ్యక్తులు స్త్రీని లక్ష్యంగాఉంచుకుని, తమనితామే ప్రేమించుకుంటారు. అలాగే స్త్రీకూడా. రాజాగాని, పూర్ణగాని అలాగేనని నా ఉద్దేశ్యం" అన్నాడు వెంకటరత్నం.

"ఏనాటికైనా నన్ను మోహంనుంచి రక్షించమనీ, ఈ నిష్ఫల ప్రణయదాహంనుంచి నాకు విముక్తి ప్రసాదించమనీ పరమేశ్వరుడిని ప్రార్థిస్తూ జీవితాన్ని గడపడంతప్ప నేను చేసేది ఏముంది?" అన్నది వరాలు.

వెంకటరత్నం కొంచెంసేపు ఆలోచించి, "పోనీ, వివాహంచేసుకోటానికి ప్రయత్నించరాదూ?" అన్నాడు. వరాలు అర్థంలేనిప్రశ్న అన్నట్లు అతనివంక చూసి,

"స్త్రీసౌందర్యానికి సాటూగగల మత్తుమందు మరోటి లేదని రాజా అంటాడు. కాని, వెంకటరత్నంగారూ! అంత విషంకూడా మరోటి లేదనీ, మత్తులోంచి అంత జాగృతి కలిగించేది మరోటిలేదనీ నా ఉద్దేశ్యం. స్త్రీబ్రతుకుని కాలంతో కొలవలేం. ఈ వయసూ సొగసూ ఎంత అశాశ్వతాలో కూడా స్త్రీ మర్చిపోదుకాని, మథ్యపెడుతుంది. నేనలా మథ్యపెట్టాలని అనుకోటంలేదు" అన్నది.

"అయితే ఏమిటి?"

"నేను పెళ్ళిచేసుకోటం ఎప్పటికీ జరుగదు. రాజా నా వాడే. అలాకాకుండాపోయినా, జీవితపరిసమాప్తికి ఎదురు చూస్తూ ఎలాగోలా బ్రతుకులో ఆఖరిఅంకం పూర్తిచేస్తాను."

"కాని అందులో ఆనందంగాని తృప్తిగాని మిగలదు"

"మిగలాలనికూడా నేను అనుకోటంలేదు. యీ శిథిల సౌందర్యసౌధం ఏ నిర్భాగ్యుడిహృదయాన్నైనా ఆకర్షించ వచ్చును. అయినా అతను పొందగలిగేదేమీ ఉండదు."

"ఈ అనవసరత్యాగంవలన నీకు ఒరిగేదేమీ లేదేమో!" అన్నాడు వెంకటరత్నం.

వరాలు నవ్వి, "నాకు ఒరిగేది నా ఆత్మసంతృప్తి ఒక్కటే. అయినా, వెంకటరత్నంగారూ! అదృష్టహీనురాలైన నాలాటి స్త్రీ అంతంకంటే చేసేదేముంది?"

"ఆత్మార్పణ, పాతివ్రత్యం - ఇలాటివాటినిగురించి చదవడమేతప్ప వాటిల్లో స్త్రీకి ఆనందంగాని, తృప్తిగాని మిగులుతుందో మిగలదో నాకు తెలియదు. అయినా, ఒకటి మాత్రం చెప్పగలను... స్త్రీ ఒంటరిగా బ్రతుకలేదు... అది ఆమెస్వభావానికే విరుద్ధం."

"నిజమే, మీరుచెప్పినట్లు ఒంటరిబ్రతుకు ఆడవాళ్ళకి శాపం... కాని, అవివాహితలైన ప్రౌఢస్త్రీలప్రాంతంలోకి రావటానికి ఎలాటిపురుషుడూ సాహసించడు" అన్నది వరాలు.

వెంకటరత్నం పకపకా నవ్వి "నారీమవ్వనంతాలూకు అవసానకాలం ఎప్పుడంటే, అది ఆమె ఓడిపోయినప్పుడు. ఆ సంగతి మరోసారి నువ్వు రుజువుచేశావు" అన్నాడు. ఇద్దరూ లేచి, నిశ్శబ్దంగా నడవటం ప్రారంభించారు. కొంచెందూరం నడిచినాక,

"మా మామయ్య చాలా దురదృష్టవంతుడు వరాలూ. కూతురు అలా, కొడుకిలా... అయినా, ఆయన ఈ దుఃఖాలన్నిటికీ అతీతుడు. ప్రపంచంలో అన్నిటికన్న దుఃఖం

ఆయన ఇరవైఏళ్ళనాడు అనుభవించాడు" అన్నాడు వెంకటరత్నం.

"ఏం దుఃఖం?" అని ఆశ్చర్యంగా ప్రశ్నించింది వరాలు.

"ఆసంగతి నీకు మరోసారి చెప్తుతాను. నీకు చెప్పాలనే నాకూ ఉంది. మామయ్యకి ఎవరికీ చెప్పనని వాగ్దానం ఇచ్చాను" అన్నాడు వెంకటరత్నం.

"సరే పోనీండి. రాజాని మీరేమీ అనకండి. అతను అన్నీ తెలిసినవాడు; కాని ఇలా చేస్తున్నాడంటే ఇదేదో విధి!" అన్నది ఆమె.

"వరాలూ! నీవు చాలా......"

"అదేపనిగా పొగడకండి. మరి పోయొస్తాను" అని విడిపోయింది ఆమె. వెంకటరత్నాన్ని ఆలోచనలు ఉసుళ్ళ మందలా ముసురుతున్నయ్.

ఈ మద్రాసునగరంలో వరాలు యెంత నిస్సహాయంగా జీవిస్తున్నదో అతనికి తెలుసు. ఒక ఆర్థికంగానే కాదు, మర్యాద, సానుభూతికూడా ఆమెకి దొరకటంలేదు. ఇలాటి నిస్సహాయతకూడా ఆమెధైర్యాన్ని చెడగొట్టలేదు. రాజా ఉండాలి. ఒకవేళ అతన్ని పోగొట్టుకుంటే, ఆమె ఒంటరిగానే జీవిస్తుంది. మరొకరిని తనజీవితంలోకి రానివ్వదు. వెంకటరత్నం మనసులోనే ఆమెని అభినందించాడు. ఆమెనే తను ఒకనాజున విషకన్య అనుకుని ఆ ఆకర్షణనుంచి రాజాని రక్షించాలని శతవిధాల ప్రయత్నించాడు. ఆరోజుల్లోనే భాషాకథ చెప్పి, మామయ్య తన కళ్ళు తెరిచాడు.

ఈరోజున వరాలు తన అంతర్యానికే దివ్యదృష్టి ప్రసాదించింది.

"ఓ స్త్రీ! నువ్వెప్పుడూ ఒకసమస్యవే!" అనుకొన్నాడు.

వెంకటరత్నం ఇంటికివెళ్ళేసరికి రామమ్మగారు పోయిందని ఉత్తరం వచ్చివున్నది.

౧౫

రాజా మద్రాసులోఉండటం ప్రారంభించినదగ్గర నుంచీ ప్రసాదరావుగారు బందరుకాపురం ఎత్తివేయాలనే అనుకుంటున్నారు. కూతురూ, కోడలూ, మనుమరాలూ ముగ్గురితో ఆయన అలాగే కాలాన్ని వెళ్ళతీస్తున్నారు.

రాజా ఎక్కడతిరిగినా ఏంచేసినా కోడలు పల్లెత్తు మాట అనేదికాదు. తిరిగినప్పుడు తిరిగినా, ఇంట్లోఉన్నప్పుడు భార్యని నెత్తిమీదపెట్టుకునేవాడు రాజా. ఆమాత్రం లాలవకే పొంగిపోయేది ఆవిడ.

భార్యా తల్లీ ఒకసంవత్సరంలోనే పోవటం ప్రసాదరావుగారికి ఒకవిధమైన నిర్లిప్తతని కలిగించింది. పొద్దున లేచిందిమొదలు రాత్రి పడుకోబోయేదాకా మనుమరాలితోనే ఆయనకి కాలక్షేపం. బెజవాడలో కోడలు ప్రసవించినరోజున ప్రమాదపరిస్థితిలోఉందని వియ్యంకుడు ఉత్తరం వ్రాస్తే, ఆయన వెళ్ళారు. మరేం ప్రమాదంలేకుండానే కోడలు ప్రసవించింది. వాకిట్లోకూర్చున్న తనదగ్గిరకి వచ్చి మనుమరాలు పుట్టిందని చెప్పారెవరో.

రాజా పుట్టినరోజువిషయాలన్నీ వరసగా ఆయనకి జ్ఞాపకంవచ్చినయ్. తనతండ్రి తనదగ్గరనుంచి పూర్ణని అందు కుని "నాయనా! మనవంశంలో అభిమన్యుడిలాటి బిడ్డ పుట్టాడు" అన్నాడు. తన తల్లి ఆరోగ్యంగా గజలక్ష్మిలా వచ్చి "మనంచేసిన పూజలకిఫలితంగా బంగారుతండ్రిని కన్నది కోడలు" అన్నది. తండ్రి తల్లిని ఏదో పరిహాసం చేశాడు.

పచ్చిబాలింత రాజ్యలక్ష్మి ఆయనమనోయవనికమీద సాక్షాత్కరించింది. తనూ తల్లీ తండ్రీ కలలుకన్న తన కొడుకు సర్వవిధాలా భ్రష్టుడవుతున్నాడు. ప్రసాదరావుగారి కళ్ళల్లో నీరునిలిచింది. ఈనాడు తన తల్లీ తండ్రీ భార్యా ఎవరూ లేరు. ఈతడవ వాళ్ళు కనిపిస్తే రాజావిషయంలో మనంకన్న కలలన్నీ కరిగిపోయినయ్ అని చెప్పాలి. కళ్ళు మూసుకుని ఆలోచిస్తున్న ఆయనదగ్గరకి మంత్రిసాని పిల్లని తీసుకొచ్చి చూపించింది.

పొత్తిళ్ళలో ప్రాణంతో కదులుతున్న ఆ చిన్న మాంసంముద్దలో ఆయనకి చాలా భవిష్యత్ కనిపించింది. ఆ పిల్లలో తన రాజారక్తం ఉన్నది, తనరక్తం ఉన్నది. తన తండ్రిరక్తం ఉన్నది. ఈ పిల్లజీవితంలో ఏం జరుగ బోతోంది? ఆమె భవిష్యత్తుమాటున విధి ఏయేరహస్యా లని దాచింది? ఈ నెత్తురుకందుకూడ యువ్వనవతి అవు తుంది, వృద్ధురాలవుతుంది. చివరకి ప్రవహిస్తున్న జీవనస్రవం తిలో ఆమెకూడా కలిసిపోతుంది. అయినా, ఈ చిన్నప్రాణి మీద తనకి అంతులేని మమకారం పుట్టుకువస్తున్నది. పొట్ట

మీాద మనుమరాల్ని కూర్చోపెట్టుకుని కబుర్లుచెప్తున్న ప్రసాదరావుగారికి ఆరోజుసంగతులన్నీ గుర్తుకువచ్చినయ్. తనతో మాట్లాడుతూ మాట్లాడుతూ తాతగారు ఏదో ఆలోచించటం ఆ పిల్లకి ఇష్టంలేదు....

"చెప్పు తాతయ్యా, కస్తూరీ తిలకే"

ప్రసాదరావుగారు తేరుకుని మనుమరాలికి శ్లోకం నేర్పటం ప్రారంభించారు—

"లలాట ఫలకం"

"లలాట పలకం"

"వక్షస్థలే కౌస్తుభం"

"వస్తుతులే కౌక్తుబం"

"నాసాగ్రే నవమౌక్తికం"

"నీసాగ్రే నివమాక్తికం"

"కాదమ్మా, నాసాగ్రే"

"అదే తాతయ్యా, నీసాగ్రే"

"నీసాగ్రే కాదమ్మా, నాసాగ్రే"

"నేను సరిగానే అన్నాను- నీసాగ్రే"

తాతా మనుమరాలూ నాసాగ్రే నీసాగ్రేలతో కుస్తీ పడుతుండగా వెంకటరత్నం లోపలికి వచ్చాడు. అతన్ని చూసి ప్రసాదరావుగారు ఆనందంతో లేచికూర్చుని, మనుమరాలికి తనకీ వచ్చిన తగాదా వివరించటం ప్రారంభించారు.

జీవితంలో అనేకవ్యథలు సహించిన తన మేనమామ ఆ పసిదానిసాహచర్యంలో అనుభవిస్తున్న ఆనందాన్నిచూసి, చాలా తృప్తిపొందాడు. నవ్వుతూ మేనమామవంకచూసి.

"ఇప్పుడే వస్తున్నాను మామయ్యా. కాసిని మంచినీళ్లు తాగి మీ తగూ తీరుస్తాను" అన్నాడు. ప్రసాదరావుగారు తన ఆదుర్దాకి తనే సిగ్గుపడి "అమ్మా" అని లోపలికి కేక వేశారు. ఒకచేత్తో కాళ్ళుకడుక్కోనేందుకు నీళ్ళూ, మరో చేత్తో తువ్వాలూ పట్టుకుని "ఎప్పుడొచ్చారు అన్నయ్యా" అంటూ రాజాభార్య వచ్చింది.

ఆ పిల్లని చూడగానే వెంకటరత్నానికి కడుపులో చెయ్యేసి దేవినంతబాధ కలిగింది. యుగయుగాల భారతీయ నారీసంస్కృతికి ఈమె వారసురాలు. భర్త ఎలాటివాడైనా కిమ్మనకుండా ఆ బాధలన్నీ సహించేస్వభావం ఆమెలో జీర్ణించి ఉన్నది. కాని ఆమే సుఖపడటంలేదు. వరాలూ సుఖపడటం లేదు. విచ్చలవిడిగా చరించే పూర్ణ సుఖపడుతున్నదో లేదో తనకు తెలియదు. బందరునుంచి కాపురంఎత్తివేయటానికి పూర్ణ ఇష్టపడటంలేదని ఉత్తరంవ్రాస్తూ తనని ఒకసారి వచ్చి పొమ్మని వ్రాశాడు తన మేనమామ.

"ఇప్పుడే వచ్చానమ్మా." అని రాజాభార్యకి సమాధానంచెప్పి, కాళ్లుకడుక్కొని కుర్చీలోకూర్చుని "ఇక చెప్పు మామయ్యా, మీ తగూ ఏమిటో" అన్నాడు వెంకటరత్నం.

"అదికాదురా. నాసాగ్రి అనమంటే చచ్చినా అనదు; నీసాగ్రే అంటుంది" అని మనుమరాలిమీద ఫిర్యాదు చేశారు ప్రసాదరావుగారు.

తాతయ్యపొట్టమీద భాసింపట్టువేసుకొని తీరికగా కూర్చుని, తన చిన్న ఎర్రటి మూతిని, బుంగగాపెట్టి

"అదికాదు మామయ్యా, నాసాగ్రే అంటే నీసాగ్రే అన్నాను. మరి తాతయ్య నా...సాగ్రే అన్నాడు. మరి అది తాతయ్యసాగ్రే కాదా చెప్పు?" అన్నది నాలుగేళ్ళ ఆ పాప.

విషయం అర్థమైన వెంకటరత్నం మేనమామవంక చూసి, నవ్వుతూ "తప్పు నీదే మామయ్యా, ఈ తడవ నీసాగ్రే అంటే అది నాసాగ్రే అంటుంది" అన్నాడు.

"ఏదమ్మా అను, నీసాగ్రే..."

"నాసాగ్రే" అన్నది పాప. వెంకటరత్నం, ప్రసాద రావుగారూకూడా గొల్లున నవ్వారు.

"నీకేం తెలియదు తాతయ్యా. మామయ్యకి అన్నీ తెలుసు" అన్నది పాప అభినయపూర్వకంగా.

"అవునమ్మా! నా కేం తెలియదు. మామయ్యకి అన్నీ తెలుసు. మామయ్య గొప్పవాడమ్మా"

"గొప్పవాడంటే ఏమిటి?"

"కథలుచెపుతాడు. పుస్తకాలు చదువుతాడు. అన్ని సంగతులూ తెలుసు"

"అయితే నేనూ కథలుచెప్పగలను తెలుసా? మామ య్యకన్న గొప్పదాన్నిఅవుతాను" అన్నది పాప.

వెంకటరత్నం ఆశ్చర్యపోయాడు. అవివాహితుడై అపత్యభాగ్యానికి దూరమైన తనకి తన మేనమామమనుమ రాలైన ఈ పాప వారసురాలవుతుందా? పాపని తనఒళ్ళోకి తీసుకుని "పాపా! ఏదీ,ఒక కథ చెప్పు" అన్నాడు. మేనల్లుడిని చూసి ప్రసాదరావుగారు ఆశ్చర్యపోయినారు. అతను ఎప్పుడూ

పిల్లల్ని దగ్గరకుతీయడు. పాప కథ చెప్పటం ప్రారంభించింది-

"దొడ్లో బాదంచెట్టుమీద కాకి రెండుపిల్లల్ని పెట్టింది. ఆ రెండుపిల్లలూ మంచివికావు. వాళ్ళమ్మని ఎప్పుడూ ఏడిపిస్తూనేఉండేవి... వాటినిచూసి దేముడికి కోపం వచ్చింది. దేముడంటే అమ్మపూజచేసే బొమ్మ కాదు. ఆ దేముడు మనకి కనిపించడు"

"ఎందుకు కనిపించడు ?"

"అందరికీ కనిపించడులే మామయ్యా ! కొందరికే కనిపిస్తాడు. నాకు ఎప్పుడయినా కనిపిస్తాడు, ఈ తడవ కనిపించినప్పుడు నీసంగతి చెపుతాను" అన్నది పాప.

వెంకటరత్నం కళ్ళల్లో నీరుతిరిగింది. "తప్పకుండా చెప్పు పాపా ! ఆయనని చాలా సంగతులడగాలి" అన్నాడు.

పాప గంభీరంగా మొహంపెట్టి "పోనీ, ఆ సంగతులేవో నాతో చెప్పు, నేను కనుక్కుంటాను." అన్నది.

ప్రసాదరావుగారు ఈ సంభాషణకి ఆశ్చర్యపోయి "వెంకటరత్నం! నువ్వు చిన్నప్పుడు సరిగ్గా ఇలాగే మాట్లాడేవాడివి... దీనికి నీ పోలిక వచ్చింది" అన్నారు.

వెంకటరత్నం సంతృప్తిపడి "నేనూ అదే పరీక్ష చేసుకుంటున్నాను మామయ్యా ! దీనిలో నా ప్రతిబింబం చూసుకుంటున్నాను" అని "నువ్వు కథ చెప్పడం మానేసి ఇంకేదో చెపుతున్నావు" అని పాపకి జ్ఞాపకం చేశాడు.

"నీకు కథలు చెప్పటంరాదు మామయ్యా ......కథ ఎప్పుడూ పూర్తి కాదు ... ఈ సంగతి నాకు దేముడు చెప్పాడు" అన్నది పాప.

వెంకటరత్నం ఇక మాట్లాడలేదు. కొంచెంసేపయి నాక ప్రసాదరావుగారితో "ఇదికూడా నాకుమల్లేనే ప్రేమకు రాలుగా జీవిస్తుంది. ఇది నా రాజకూతురు. దీనికి మీరంత దరూ ఆస్తిపాస్తులు ఇస్తారు. నే నిచ్చేది ఒక్కటే - నా మెదడు. దాని చిన్న మెదడులోకి నా ఊహల్ని, ఉద్దేశ్యాల్ని పంపుతాను ... ఇది నా వారసురాలు" అన్నాడు.

"నేనూ అదే ఆశ్చర్యపోతున్నాను. నా దగ్గిర పద్యాలు నేర్చుకుంటుంది, కబుర్లు చెపుతుంది గాని, నీతో మాట్లాడినట్లు ఎప్పుడూ మాట్లాడలేదు" అన్నారు ప్రసాద రావుగారు.

"అది నాలో భాగమే మామయ్యా! నన్ను చూసే సరికి నాలాగానే అదికూడా తననీడ చూసుకుంటున్నది" అన్నాడు వెంకటరత్నం.

ప్రసాదరావుగారు నవ్వుతూ "వెంకటరత్నం మామయ్య మంచివాడేమిటే?" అన్నారు.

పాప చప్పట్లుకొడుతూ "అలా అడక్కూడదు తాతయ్యా. వెంకటరత్నంమామయ్యసంగతి నేను పెళ్ళి చేసుకున్నతరువాత చెపుతాను" అన్నది.

వెంకటరత్నం ఒకసారి ప్రసాదరావుగారు తన పెళ్ళి సంగతి ఎత్తితే నవ్వులాటకి పాప పెద్దదయినతరువాత దాన్ని చేసుకుంటాను అన్నాడు.

ఆసంగతే ఇప్పుడు పాప అన్నది. అదివిని వెంకట రత్నం ఉలిక్కిపడ్డాడు. ఏమిటీ విచిత్రం? అనిపించిం దతి

నికి. ఆ సంభాషణ మార్చటానికి "బందరు కాపురం ఎత్తి వేయటానికి ఒదిన ఎందుకని ఇష్టపడటంలేదూ?" అన్నాడు.

ప్రసాదరావుగారు పాపని దింపి "లోపలికిపోయి అమ్మ నడిగి కాఫీ పట్రా అమ్మా" అని పంపించారు. పాప వెళ్ళి పోయింది.

"ఎందుకు వద్దంటున్నదో నాకు తెలియటంలేదు" అన్నారు. దగ్గిరఉన్న ప్రసాదరావుగారికంటే దూరంగాఉన్న వెంకటరత్నానికే కారణాలు బాగా తెలుసు. రేణుఅత్తవారిది బందరు.

"అయినా ఒకళ్ల ఇష్టాఇష్టాలతో నీకు సంబంధమేమిటి? కాపురంఎత్తివేయి" అన్నాడు అతను.

"నేనూ అలాగేచేద్దామనుకుంటున్నాను కాని, సనేమీ బందరునించి నే రాను అంటున్నది."

"రాకపోతే ఉంటుంది. మీరు వెళ్ళండి"

"ఆడపిల్లని ఒంటరిగావదలి మేము వెళ్ళటం బాగుం టుందా? ఇదంతా నా ఖర్మ. పూర్ణ ఇలా, రాజా అలా. పరాయి పిల్లయినా కోడలే నయం" అన్నారు ప్రసాదరావుగారు. ఆయనకంఠం గాద్గదికమయింది.

"నువ్వూరుకో మామయ్యా; నేను ఒదినతో మాట్లాడ తాను" అన్నాడు వెంకటరత్నం.

ఆ సాయంత్రం పూర్ణదగ్గిరికి వెళ్ళి కూర్చున్నాడు. ఇప్పు డామె మరో పూర్ణలా ఉంది. ఒక్క బొట్టులేకపోవటం తప్ప వైధవ్యచిహ్నాలేమీ లేవు. అదిచూసి మనసులోనే అస హ్యించుకున్నాడు అతను.

"నువ్వు మామయ్యతోపాటు ఉండటంలో అర్థంఉన్నది కాని, ఒంటరిగా బందరులోఉండటంలో ఏమాత్రం అర్థం లేదు" అని కటువుగా అన్నాడు. పూర్ణకి భయంతోపాటు కోపంకూడా వచ్చింది. అయినా సమాధానం ఇవ్వలేదు.

"నువ్వు ఎందుకుఉండాలనుకుంటున్నావో నాకు తెలుసు. చాంచల్యంఅనేది అతి నీచమైనగుణం. ప్రస్తుతం నువ్వు ఆ చాంచల్యంలోనేపడ్డావు. నీ సుఖంకోసం వృద్ధుడూ ఉన్నతుడూ అయిన తండ్రిని బాధపెడుతున్నావు".

పూర్ణ మాట్లాడలేదు.

"నీకు మళ్ళీ ఒకసారి చెబుతున్నాను. నీ మేనత్తకొడుకునిమాత్రమే కాదు, స్నేహితుడినికూడా అని... నా మాట వినటం నీకు చాలామంచిది"

"నీ మాటలువింటూనే ఇంతకాలంఉన్నాను. ప్రపంచాన్ని మనుష్యుల్నికూడా నీమాటలతోసంతృప్తిపడి జీవించమనటం నీకు ధర్మంకాదు... కేవలం మాటలవల్ల తృప్తిపడని నాలాంటివారుంటారు. ఆసంగతి నువ్వు గుర్తుపెట్టుకోవాలి"

"మాటలచేత తృప్తిపడవుకనుక ..."

"నా కిష్టమైనపద్ధతిలో నేను జీవితాన్ని గడుపుకుంటాను. నీదయవల్ల అమ్మ చనిపోతూ నాకు భుక్తికిలోటు లేకుండా చేసింది"

అదే పొరపాటయింది. పంజరంలోనే నిన్నుఉంచితే ఊచలుకొరుకుతూ కాలంగడిపేదానివి. ఇప్పుడు రెక్కలు విదిలించటానికి అవకాశంకల్పించిపోయింది అత్త. అంతమాత్రంచేత నువ్వు ఎగరాలని ఆవిడఅభిమతం కాదు"

"నువ్వు నన్నిలా మాటలనడం న్యాయంకాదు. నాబ్రతుకు నాది. ఆవిషయంలో ఇతర్లు జోక్యంకల్పించుకో నవసరంలేదు"

పూర్ణ అన్నమాటలతో వెంకటరత్నానికి చిర్రెత్తు కొచ్చింది. "నువ్వు ఇక్కడ ఒంటరిగా ఎలాఉంటావో చూస్తాను. పసివాడు అల్లరిచేస్తుంటె, చెంపలుగిల్లి బుద్ధిచెప్పినట్లు నీకూ చెప్పాలి" అని అక్కడినించి వెళ్ళిపోయినాడు వెంకటరత్నం.

ఆమరునాడు బందరులో ఇల్లు ఖాళీచేయించి ప్రసాద రావుగారిచేత పల్లెటూరికాపురంపెట్టించి మరీ మద్రాసువెళ్లాడు వెంకటరత్నం. పూర్ణకి పల్లెటూరువెళ్లక తప్పలేదు.

తెనాలిలో ఒక మారుమూలఇంటిలో రాజా బాధ పడుతున్నాడు. తాగుడుమైకంలో ఒక స్త్రీకోసం తా నక్క డికి వెళ్లాడు. అక్కడ తనకి ఒక కిల్లీ ఇచ్చారు. తరువాత ఏమి జరిగిందో తెలియదు.

రెండురోజులకు మైకంవిడిపోయిందికాని, కడుపులో విపరీతమైన బాధగాఉన్నది. అలాగే లేచి నిలబడి, జేబులో డబ్బు ఎంతఉందో లెక్కచూసుకున్నాడు. ఇంటికివెళ్ళటానికి సరిపడఉంది. అతను శక్తినంతా కూడదీసుకొని రైలుస్టేషనుకు వెళ్ళాడు.

ఆ స్థితిలో ఇంటికివచ్చిన కొడుకునిచూసి ప్రసాదరావు గారు చాలా భయపడ్డారు. బందరు తీసుకువెడితే ఏదో నాటు విషం తినటంవలన కడుపులో పుండుఅయిందని డాక్టరు చెప్పాడు. వెంటనే మద్రాసు తీసుకువెళ్ళటం మంచిదని

ఆయన సలహా ఇవ్వటంతో ప్రసాదరావుగారు రాజానితీసుకొని మద్రాసు వెళ్ళారు.

డాక్టరు శంకరనారాయణ రాజాని ఒంటరిగాచూసి, అతనిశరీరంలో యెంత విషంఉన్నదో వివరించి తాగుడూ, సిగరెట్లూ మానివేయమని సలహాఇచ్చాడు. ఆ సలహాకి సమాధానం ఏమీ ఇవ్వకుండా నవ్వి ఊరుకున్నాడు రాజా.

ఆ సాయంత్రం వరాలు వచ్చి రాజానుచూసి స్తంభించిపోయింది. ఆ కళ్ళల్లో కాంతులేవి? కంటిచుట్టూ ఆ గీతలేమిటి?

నిర్ఘాంతపోయి నిలుచున్న వరాల్ని చూడగానే రాజాకి నవ్వువచ్చింది. అదిచూసి మరీ భయపడిపోయింది ఆమె.

"రా కూర్చో"

"ఈ అవతారమేమిటి!"

"మనిషినికనుక జబ్బుపడ్డాను"

"రాజా!"

"ఏమిటి?"

"నీబ్రతుకుని నీ విలా నాశనంచేసుకుంటున్నసంగతి నీకు తెలుసునా? తాగుతున్నావుకదూ?"

"తాగటం తప్పని నేను అనుకోను"

"దేనికైనా ఒక హద్దుఉండాలి... ని న్నిలా చూస్తూ బ్రతికేకన్న భగవంతుడు నాకే ఎందుకు చావు తెచ్చిపెట్టడు?" వరాలు ఏడుపు ఆపుకోలేకపోయింది. రాజా ఆమెచేతిని తన చేతిలోకి తీసుకుని "నిన్ను పొందగలిగినందుకు నేను చాలా అదృష్టవంతుడిని వరాలూ" అన్నాడు. వరాలుదుఃఖం

మరింత ఎక్కువయింది. రాజా ఆమెవంక చూసి, చిలిపిగా నవ్వుతూ,

"నీ కో కథ చెప్పనా? బ్రహ్మదేవుడు స్త్రీని సృష్టించాలనుకున్నప్పుడు మట్టి మొదలైన సామాను అయిపోయిందిట. అప్పు డేంచేశాడో తెలుసునా?

"చందమామలోని సౌందర్యాన్ని, లతలలోని ఆశ్రయించేస్వభావాన్ని, పువ్వులోని వికాసాన్ని, ఎండలోని వేడినీ, మబ్బులో కటినీ, శిలలోని కాఠిన్యాన్ని, తేనెలో మాధుర్యాన్ని, మంచులోని సిగ్గునీ తీసి స్త్రీని తయారు చేశాడు. వరాలూ! నువ్వు ఆ స్త్రీజాతికి ప్రతినిధివి" అన్నాడు.

"ఈ మాటలతో నన్ను మరపించాలనిచూస్తున్నావా? నేను చిన్నపిల్లనేఅయితే, నీమాటలు నమ్మిఉండేదాన్ని. నాతో మా ఇంటికి రా. నా రక్తంతో నీ కళ్ళకి అరుణరాగాన్ని నింపుతాను. నా నెత్తురుతో నీ పెదవుల్ని రాగరంజితం చేస్తాను"

"మరయితే నా రక్తం ఊరికేపోతుంది. అది నీ కాళ్ళకి పారాణిపెడుతాను"అని నవ్వాడు రాజా.

సరిగ్గా అదేసమయంలో డాక్టరు శంకరనారాయణ రౌండ్స్‌కి వచ్చాడు. రాజాపక్కని కూర్చునిఉన్న వరాల్ని చూడగానే, అతని గుండెలు ఝల్లుమన్నాయి. "ఏమండోయ్, బహుకాలదర్శనం!" అన్నాడు. వరాలు లేచి నిలబడి నమస్కారంచేసి "ఏమండీ, డాక్టరుగారూ, రాజా తిరిగి మామూలు మనిషి కావటానికి యెంతకాలంపడుతుంది?" అన్నది.

ఆమె ఆ ప్రశ్నఅడగటంలోఉన్న ఆప్యాయతనీ అను రాగాన్నీ అర్థంచేసుకొన్నాడు డాక్టరు. అతను జవాబుచెప్పే లోపుగానే రాజుకి కడుపునొప్పివచ్చింది. ఆ బాధతగ్గటానికి గాను శంకరనారాయణ మార్ఫియా ఇచ్చాడు.

అదిచూసి, వరాలు గుండెలుపగిలేలా నిశ్శబ్దంగా దుఃఖించింది.

"చూడమ్మా, మనం నాగరికులం. నాగరికజీవితం అంటే ఉద్రేకాల్ని ఉద్వేగాల్ని అణచుకోటం. ఇది హాస్పిటల్. ఇక్కడ మీ రిలా దుఃఖించటం మంచిదికాదు" అన్నాడు శంకరనారాయణ.

రాజుభార్యకాని తను రాజుకోసం దుఃఖించటం హాస్యాస్పదం అని అప్పటికి గ్రహించిన వరాలు ఏడుపుఆపి వేసింది.

ఇంతలో ప్రసాదరావుగారు నచ్చి వరాల్ని చూశారు. ఆయననిచూడగానే తనకు తెలియకుండానే చేతులెత్తి నమస్కరించింది వరాలు.

ప్రసాదరావుగారి కళ్ళల్లో 20 ఏళ్ళనాటికథ సినిమాలా కనిపించింది. "ఏమ్మా! ఇప్పు డిక్కడే ఉంటున్నావా?" అని ఆప్యాయంగా పల్కరించారు.

"అవునండీ?"

"బందరులో అమ్మా తమ్ముళ్ళూకూడా లేరా?"

"లేరు. అందరూ ఇప్పు డిక్కడే ఉన్నారు."

ప్రసాదరావుగారు చలనంలేకుండా పడిఉన్న రాజుని చూశారు. ఆయనలో రేగుతున్న వేదన పైకి కనబడనీయ

కూడదని ఎంతప్రయత్నించినా స్పష్టంగా అదికనిపిస్తూనేఉంది.

శంకరనారాయణవంక చూసి "వీడు మళ్ళీ ఎప్పటికి మామూలుమనిషి అవుతాడు?"

"త్వరలోనే అవుతాడు కాని, ఇదివరకంతబలం ఉండదు. భోజనంమానివేసి. తేలికఆహారం తీసుకుంటూఉండాలి" అన్నాడు శంకరనారాయణ.

"ఎన్నాళ్ళు అలా తీసుకోవాలి?"

"జీవించినంతకాలమూను."

౧౮

సుఖమూ సంతోషంతోసహా దుఃఖమూ కష్టమూ కూడా జీవితంలో భాగాలే. మానవుడు వాటితోపాటు వీటినీ భరిస్తాడు. వాటితోపాటు వీటినీ తుడిచివేస్తాడు.

రాజా జబ్బువల్లపడ్డదుఃఖం మరపుకివచ్చి అలవాటు కావటానికి అయిదారు నెలలు పట్టింది. రాజా ఇప్పుడు రెండు పూటలా భోజనంచేయడు, కాఫీతాగి ఉంటాడు.

తనకి తనే మార్ఫియా ఇచ్చుకుంటాడు. ఒళ్ళుమరచి మత్తులో కాలంగడుపుతాడు. అతనికడుపునొప్పి ఎక్కువయింది. గాని, తగ్గటంఅంటూ కనిపించలేదు. అవి సహాయ నిరాకరణోద్యమం తీవ్రరూపందాల్చినరోజులు. హిందూ దేశం అంతా దేశభక్తిలో లీనమయింది. ప్రసాదరావుగారు కూడా కరిణీకాలు వదిలివేశారు.

బందరులో నేషనల్ కాలేజీ స్థాపించారు. జైలు కెళ్ళటం ఒక కాశీయాత్రగా భావిస్తున్నారు ఆరోజుల్లో. రాజా వెంకటరత్నానికి ఒకఉత్తరం వ్రాశాడు.

"చివరకి నాన్నగారుకూడా ఈ పిచ్చిలో పడ్డారు. నా మనసులో ఎందుకో దేశభక్తిఅంటే నమ్మకంకలగటం లేదు. ఆ నమ్మకమే ఉంటే నా బ్రతుకు మరోగాడిలో నడుస్తూఉండేది. కాని, ధనాన్ని, యవ్వనాన్ని ఈ జైళ్ళకి అర్పిస్తున్న వీళ్ళని చూస్తుంటే, ఆ చిన్న త్యాగంవల్లనే వీళ్ళు చాలా గొప్పవాళ్ళేమో అనిపిస్తున్నది. చిత్రం ఏమిటంటే, మతవిశ్వాసం రాజకీయవిశ్వాసం రంగులుమారినా, మనిషి తననమ్మకానికి రక్తంతో రంగువేస్తూఉంటాడు. అదే అతనిధ్యేయం, ఆత్మతృప్తికూడాను. అందరూ ఏదో ఒకటి చేస్తున్నారు. నేనే ఏమీచేయకుండా ఈ పల్లెటూళ్ళో కూర్చున్నాను.

కాని నా జీవితమూ వృధాపోలేదని తెలుసుకోడానికి చాలా ఆనందపడుతున్నాను. మనం అనుకునే చెడు దేనిలోనూ లేదు; బాహ్య భౌతికపరిస్థితులవల్లనే ఎవరికైనా మంచిచెడులు జరుగుతాయి.

తృప్తిగానే ఉన్నాను. తృప్తిఅనేది మార్ఫియాఅంత మత్తుగాఉంటుంది. మనిషికి తృప్తిప్రవేశిస్తే శక్తిలేని చవటగా మారతాడు బహుశా! ఇప్పుడు మార్ఫియా నా శరీరానికి మత్తునిస్తే తృప్తి నా మెదడుకి మత్తుఇచ్చింది. కొన్నాళ్ళు ఇలాగే ఉంటాను. ఇక్కడ అన్నిటికన్న నాకు ఆనందంకలిగించేవిషయం ఒక్కటే — అది పాప. దాన్ని చూస్తూంటే, నిన్నుచూస్తున్నట్లుగానే ఉన్నది. అది నీలాగానే మాట్లాడుతుంది. బహుశా నీలంతదీ అవుతుందేమో!

పాపతోపాటు నా కానందంకలిగించేవి మరిరెండు ఉన్నాయి — పుస్తకాలూ, వరాలుస్మృతీను.

అక్కయ్యనిగురించి నేను నీకు తెలియనిదేమీ వ్రాయ లేను. అన్నట్లు ఈమధ్య మా బావమరది రేణు మా ఆవిడని చూడటానికి వచ్చి నాలుగురోజులు ఉన్నాడు. అక్కయ్య గుంటూరుబాబాయిగారింటికి వెడతానని ఆయనతో వెళ్ళింది.

బహుశా, నే నిక ఆట్టేరోజులు బ్రతుకకపోవచ్చును. నేను నీమీద రెండుబాధ్యతలు వ్రాస్తున్నాను. అందులో ఒకటి : వరాలుబాధ్యత. రెండోది : నీ అమూల్యలేఖిని నుంచి నా కథ రావటం. ఈ రెండుకోరికలూ తీర్చు."

వెంకటరత్నం ఈ ఉత్తరాన్ని వరాలుకి చూపించాడు. అది చదివి వరాలు జీవంలేని నవ్వునవ్వి "అతను లేనప్పుడు నా బాధ్యతవహించాల్సినబరువు ఎవరికీ ఉండదు" అన్నది.

ఈ విశ్వరంగస్థలంలో నేను నటుడినీ, ప్రేక్షకుడిని కూడా అయినాను వరాలూ! ఇకిముందు వచ్చే భయంకరమైన దృశ్యాలు చూడటానికి నన్ను నేను తయారుచేసుకోవాలి" అని నిట్టూర్చాడు వెంకటరత్నం.

"ఆ ఆఖరిరంగంతో నా పాత్రకూడా అయిపోతుంది" అని నవ్వింది వరాలు.

## ౧౭

డాక్టరు రేణుతో పూర్ణ బయలుదేరివెళ్ళినప్పుడు ప్రసాదరావుగారు బందరు వెళ్ళారు. ఆయనకి ఏదోఒక వ్యావృత్తి

కావాలనిపించి దేశభక్తిని ఎన్నుకున్నారు. ఆయన తిరిగివచ్చే సరికి పూర్ణ వెళ్ళిపోయింది.

పూర్ణప్రవర్తనలో లోటుఉన్నదని తెలుసునుగాని, ఆ లోటు ఎక్కడఉన్నదో, ఎక్కడినుంచి ఆ మాలిన్యం దూసుకు వస్తున్నదో ప్రసాదరావుగారికి తెలియలేదు. ఈవిషయంలో కూతుర్ని ఏమనటానికీ ఆయనకి తోచడంలేదు.

ఎవరికైనా సలహాయిచ్చేటప్పుడు ఆత్మపరీక్ష అవసరం అనే తత్వం ఆయనది. అందుకే కూతుర్ని "నువ్వు తప్పుచేస్తు న్నావు" అని అనలేకపోయినారు. రెండో కారణం ఏమిటంటే, కూతురుమీదఉండే ప్రేమ. అయినా, దానికిష్టమైన పద్ధతిలో అది బ్రతుకుతున్నది. దానిని తప్పని మనం ఎలా అనగలం? మనం మంచి చెడు అంటాం. పైకికనబడేవిషయాల్ని అలా ఉంచి, కొంచెం లోతుగా తరచిచూస్తే, ఆ రెండూకూడా అసత్యాలే కావచ్చును. లేదా ఈ రెండిటినీమించినది ఏదో కావచ్చును. జీవనస్రవంతి నిరంతరం ప్రవహిస్తూఉన్నప్పుడు మనం స్థూలనేత్రంతో దానికదలికను చూడలేము.

ప్రవహించేగుణం నీటికీ, జ్వలించేగుణం మంటకీ సహ జం. కాని మంట ప్రతిక్షణం నూతనకాంతినిస్తుంది. ప్రవా హం ప్రతిక్షణం కొత్తతరంగాల్ని విడుదలచేస్తుంది. అలాగే జీవితంకూడా నిరంతరం నూత్నతరంగాలతో నిండిన ఒక విచిత్రప్రవాహం.

పుట్టుక ... తరువాత చావు, మళ్ళీ జన్మ, మళ్ళీ మృత్యువు- ఇదంతా ఒక స్రవంతి. కదలికతోనూ మార్పుతోనూ కూడిన ప్రాణప్రవాహం జీవితం, ఈ ప్రవాహంలో మంచిని మంచి

అనీ, చెడుని చెడుఅనీ మనం గుర్తుపట్టేసరికే ఆ తరంగం అదృశ్యమైపోయి ఆ స్థానంలో మరో కొత్తతరంగం ఉంటుంది.

ఈ ఊహలవలనే పూర్ణకి సలహాఇవ్వలేకపోయినారు ప్రసాదరావుగారు. పూర్ణని పదిరోజులుంచుకుని పంపమని నరహరికి వ్రాశారు. ఆ ఉత్తరానికి ఏమీ జవాబులేదు. రాజాని మళ్ళీ ఒకసారి చూపించటానికి ఆమరునాడే మద్రాసు వెళ్ళారు.

మద్రాసు వెళ్ళిన నాలుగురోజులకి ప్రసాదరావుగారికి మూత్రపిండాలలో బాధ ప్రారంభమయింది.

డాక్టరు శంకరనారాయణ ఏవో మందులు ఇస్తున్నాడు కాని, బాధ తగ్గటంలేదు. ఒకనాటిసాయంత్రం వెంకటరత్నాన్ని ఇవతలకు పిలిచి, "ప్రసాదరావుగారికి ఆపరేషను చేయాల్సివస్తుంది. బహుశా, అలాచేస్తే ఆయన బ్రతుకుతాడని గ్యారంటీలేదు. ఒంట్లో షుగర్ ఉంది" అన్నాడు డాక్టర్.

వెంకటరత్నంమొహం పాలిపోయింది. కొంచెంసేపు ఆలోచించి "ఆపరేషన్ చేసి ప్రాణంతీసేకన్న అలా ఉంచటమే మంచిది" అన్నాడు.

"నేనూ అదే అనుకుంటున్నాను. కనీసం రాజాకూతురు పెద్దదిఅయేవరకన్నా ఈయన బ్రతికిఉండటం చాలా అవసరం" అన్నాడు డాక్టర్.

వెంకటరత్నానికి గుండెని తన శరీరంలోనుండి బలవంతంగా ఎవరో ఊడతీస్తున్నట్లనిపించింది. ఎలాగో గొంతు పెగుల్చుకొని "మరి రాజాపరిస్థితి ఏమిటి?" అన్నాడు.

"అందుకే చెప్తున్నాను. రాజాకూడా మహా బ్రతి కితే రెండుమూడేళ్ళు. ఈ పరిస్థితిలో కనీసం ముసలాయనని అయినా బ్రతికించేఏర్పాటుచేయాలి. ఈ కిడ్నీట్రిబుల్ వల్ల బాధేగానీ, ప్రమాదంలేదు. ఆ బాధ తీసివేయటానికి ఆప రేషన్ చేస్తే ఆయన బ్రతుకడు"

వెంకటరత్నంకళ్ళల్లో శూన్యం మినహా మరోభావం ఏమీలేదు.

"రాజాకడుపులోకి పాషాణంలాటి నాటువిషం ఏదో వెళ్ళింది. అసలప్పుడే చనిపోవాల్సింది. కాని బలవంతుడవ టంమూలంగానే తట్టుకొని, ఈ మూడు నాలుగేళ్ళయినా జీవి స్తున్నాడు. క్రమక్రమంగా అతని 'ఆరోగ్యం క్షీణించిపోతు న్నది. దానికితోడు మార్ఫియా మానవయ్యా అంటే, నవ్వు తాడుగాని, మానడు. సరే...మీ రలా పాలిపోయినందువల్ల ప్రయోజనం ఏముంది? నే చెప్పకపోతే వాళ్ల పరిస్థితులు మీకు తెలియవు. చివరిదాకా సుఖంగాఉండి, ఆపద నెత్తిమీద పడ్డప్పుడు తట్టుకోగలుగుతారు ... నా సంగతి ఏమిటి? నాకు ముందునుంచీ వాళ్లస్థితి తెలుస్తుంది. డాక్టరుగా చేసేదేమీ లేని ఈ పరిస్థితిలో మనిషిగా దుఃఖించటంతప్ప నే చేయగలి గిందిలేదు. ధైర్యం తెచ్చుకోండి. పోయివస్తాను" అని వెళ్ళి పోయినాడు శంకరనారాయణ.

వెంకటరత్నం చుట్టూ మృత్యుదేవిసమిటకొంగు కప్పి నట్లు చీకటి మిగిలింది.

ప్రసాదరావుగారు బాత్ రూమ్‌కి వెళ్ళాలని వస్తూ, అనుకోకుండా శంకరనారాయణమాటలన్నీ విన్నారు. ఆ

రోజంతా ఆయనకి అపరిమితమైన బాధతోపాటు అవ్యక్తమైన వేదనకూడా ప్రారంభమయింది.

ఒకసారి రాజా అయిదేళ్లపిల్లాడప్పుడు దొడ్లోఉన్న కొబ్బరిచెట్టు ఎక్కాడు. ఎక్కడమయితే ఎక్కాడుగాని, అక్కడినుంచి దిగలేక పడిపోతాడేమోఅని అందరూ భయపడ్డారు. కోప్పడినా ప్రమాదమే. కాస్త పెరుగూఅన్నం కలిపి 'రా నాన్నా, తిందువుగాని' అంటే మెల్లిగా దిగివచ్చాడు.

ఇప్పుడా సంగతిజ్ఞాపకంవచ్చింది ప్రసాదరావుగారికి.

వాడికి ఉగ్గుపొయ్యాలంటే ముగ్గురుమనుషులు కావాలి. వాడుపుట్టిననాటి అసురసంధ్యలో "బాబుని గొప్పవాడిని చేస్తానురా" అని తను వెంకడితో అన్నాడు.

కనీసం రాజాకూతురు పెద్దదయ్యేవరకన్నా తను బ్రతికి ఉండటం అవసరం అన్నాడు శంకరనారాయణ. తనబిడ్డ తనకుకానప్పుడు వాడిబిడ్డకోసం బ్రతకటంలో అర్థంలేదు. ఇప్పుడు తనేంచేయాలి? తనగతి ఏమిటి?

బాధతో మెలికలుతిరిగిపోతున్న మేనమామదగ్గరకి వెంకటరత్నం వచ్చాడు. అతనిమనసుకూడా అలాగే మెలికలుతిరిగిపోతున్నది.

ఈ నాటకం ఇంత విషాదాంతంఅవుతుందని తెలిసికూడా దానికి ఎదురుచూడాల్సివచ్చింది. భగవంతుడా! నువ్వింత నిర్దయుడవేమిటి? అనుకుంటున్నాడు అతను.

"రాత్రి అంజయ్యనాయుడుతో పాప వచ్చింది. మామయ్యా! తాతయ్యనీ నాన్ననీ చూడాలని ఏడిస్తే వాళ్ళమ్మ పంపించింది" అన్నాడు.

"మరి ఏదీ?" అన్నారు ప్రసాదరావుగారు.

"కాసేపట్లో వాళ్ళనాన్న తీసుకొస్తాడు" అని జవాబిచ్చాడు వెంకటరత్నం. ఇందాక తనూ డాక్టరూ మాట్లాడిన సంగతులు మేనమామ విన్నాడని అతనికి తెలిస్తే ఒక్కతడవ ఆయనపాదాలమీదపడి దుఃఖిస్తే సగంబాధ తీరిఉండేది. వెంకటరత్నం చాలాసేపు నిశ్శబ్దంగా అలాగే కూర్చునిఉన్నాడు.

ఇంతలో పాప పరిగెత్తుకుంటూవచ్చి తాతయ్యపక్కన కూర్చుని "తాతయ్యా, ఏడుస్తున్నావేం తాతయ్యా?" అనేదాకా వెంకటరత్నానికి తన మేనమామ ఏడుస్తున్నసంగతి తెలియలేదు. ఇంతలో రాజా వచ్చి తనతండ్రిని చూసి, ఆశ్చర్యపోయినాడు. వింధ్యపర్వతంలా గంభీరంగాఉండే ప్రసాదరావుగారు శరీరంలోఉన్న బాధకి దుఃఖిస్తున్నారని పైవాళ్ళు అనుకుంటే అనుకోవచ్చునుగాని, రాజా, వెంకటరత్నం ఎప్పుడూ అనుకోరు.

తన గౌనుచివరతో తాతయ్యకళ్ళు తుడిచి "ఏడవకు తాతయ్యా! నాన్నమూలంగానేనా ఏడుస్తున్నావు? నాన్నా! తాతయ్యనివదిలి ఎక్కడకీ వెళ్ళకు" అన్నది పాప.

ఇదేమిటి? ఇది అన్నీ తెలిసినట్లు అంటున్నది! అని ప్రసాదరావుగారూ వెంకటరత్నం అనుకున్నారు. పాప మాటలకి రాజా సిగ్గుపడి,

"అలాగే వెళ్ళనులే పాపా" అన్నాడు.

ఆ మాట విని ప్రసాదరావుగారు బిగ్గరగా ఏడుపు ప్రారంభించారు. ఆయనతోపాటు వెంకటరత్నం నిశ్శబ్దంగా

కళ్ళుతుడుచుకుంటే పాప బిగ్గరగానే ఏడుస్తున్నది. సరిగ్గా అదేసమయంలో వరాలు వచ్చి ప్రశ్నార్థకంగా రాజావంక చూసింది.

"నాకు తెలియదు" అని ముక్తసరిగా సమాధానం ఇచ్చాడు రాజా.

ప్రసాదరావుగారి దుఃఖోద్వేగం కొంత తగ్గింది. అప్పుడు పాపని దగ్గరకితీసుకొని "ఎప్పుడొచ్చావమ్మా" అన్నారు.

పాప పెద్దఆరిందాలా చేతులుతిప్పుకుంటూ "అంజయ్యనాయుడుతో రాత్రి వచ్చాను తాతయ్యా! నువ్వు నన్ను నిద్రలేపకుండా వచ్చేస్తే నేను బెంగపెట్టుకోనూ?" అంది.

వరాలు పాపని ఇంతమటుకు చూడలేదు. ఇప్పుడు చూసి, చాలా ఆనందించింది.

"మీ అమ్మ ఎలాఉంది?" అని కూతుర్ని అడిగి వరాలువంక ఓరగాచూశాడు రాజా. ఆ చిలిపితనానికి తనలో తనే నవ్వుకుంది వరాలు.

"అమ్మ ఎలాఉందని చెప్పను? ఏమీ మాట్లాడదాయె. అమ్మ మంచిది నాన్నా" అన్నది.

"నిజమేనమ్మా, మీ అమ్మసంగతి ఎవరూ అర్థం చేసుకోలేరు" అని నిట్టూర్చారు ప్రసాదరావుగారు. ఆ తాతా మనుమరాళ్ళిద్దరూ ఇప్పటికి వరాల్ని చూశారు. పాప తాతయ్యమంచంమీదనుంచి దిగి గబగబా వెంకటరత్నందగ్గరికి వెళ్ళి రెండుచేతులూ అతనిమెడకి పెనవేసి,

"ఆవిడ ఎవరు మామయ్యా?" అని రహస్యంగా అడిగింది. "మీ నాన్న నడుగు?" అన్నాడు వెంకటరత్నం.

"నాన్న చెప్పరులే" అని వరాలుదగ్గిరికెళ్ళి "ఏమండీ, మీరెవరో చెప్పరూ?" అన్నది పాప.

పాపని ఎత్తి తనఒళ్ళో కూర్చోపెట్టుకుని "నేను పిన్నిని పాపా" అన్నది.

"ఈ పిన్నికూడా అమ్మంత మంచిదేనా నాన్నా?" అని తండ్రిని మరోప్రశ్న వేసింది పాప. రాజా నవ్వి ఊరుకున్నాడు.

"చాలా మంచిది. ఎంతమంచిదంటే..." అని మాటలకి తడుముకున్నాడు వెంకటరత్నం.

"పంచదారచిలుకంత మంచిది" అని పూర్తిచేసింది పాప. వరాలు ఆ పిల్లని గుండెలకు హత్తుకుని ముద్దుపెట్టుకుంది.

ఆ మాటలకి ప్రసాదరావుగారికి నవ్వువచ్చింది. వానలో కాస్తున్న యెండలా ఆ నవ్వు ఆయనముఖాన్ని వెలిగించింది. వెంకటరత్నం అదిచూసి మనసులోనే బాధపడ్డాడు.

భీష్మాచార్యులవంటి ప్రసాదరావుగారి అంతర్యంలో ఉన్న అగ్నిపర్వతాలవెలుగు అప్పుడప్పుడు చిరునవ్వు రూపంలో బయటికి కనిపిస్తుంది.

యవ్వనంలో ప్రియురాలు చనిపోయింది. వార్ధక్యంలో పుత్రశోకం అనుభవించబోతున్నాడు. ఆ ఊహ రాగానే తలఎత్తి రాజావంక చూశాడు వెంకటరత్నం.

పరమసుందరుడైన ఈ యువకుడిమీదకూడా మృత్యు దేవత తననీడ పరిచింది. కాలానికీ మృత్యువుకీకూడా సౌంద ర్యంఅంటే ప్రేమేనేమో! వృద్ధుడైన తండ్రికి పుత్రశోకం తప్పదు. ఆత్మార్పణచేసిన స్త్రీకి వియోగం తప్పదు. పాపకి ఇక నాన్న ఉండడు. మరి తను? తనసంగతి ఏమిటి?

"తెలియదు" అనుకున్నాడు వెంకటరత్నం. శంకర నారాయణ చెప్పిన ఈ భయంకరవార్త రాజాని ప్రాణ ప్రదంగా ప్రేమిస్తున్న వరాలుకీ, కన్నతండ్రి ప్రసాదరావు గారికీ తెలియదు. కేవలం తను ఒక్కడే ఈ మహాదుఃఖం భరించాలి.

ఈ వ్యధకంతటికీ కారణభూతుడైన ఈ సుందరమూర్తి శరీరంలో మహావిషం దాచుకుని తనని తను లయింపచేసు కుంటున్నాడు. అనివార్యమైన మృత్యువు తనఅడుగుల చప్పుడు వినిపించకుండా అతనిని సమీపిస్తోంది. ఆ సంగతి తనకి తెలుసుకాని, అతన్ని హెచ్చరించటానికి తనకి నోరులేదు.

ఆమె శీతలస్పర్శనుంచి, తన ప్రాణాన్ని దహించి, ఉష్ణంకలిగించి రాజాని రక్షించుకోటానికి తను సిద్ధం. కాని అదీ లాభంలేదు.

ఈ మృత్యువుకి కాలనియమంలేదు. స్వచ్ఛకౌము దుల శరన్నిశీధిని, తన రాకచేత కాళరాత్రిగా మారు స్తుంది. స్వర్ణసుందరమైన దివాసమయాన్ని, హిమానీ నిబిడ హేమంత నిశీథంగామారుస్తుంది. మోహనగీతంగా

ప్రవహించి పోతున్న జీవనప్రవాహాన్ని వైతరణీనదిగా మంత్రిస్తుంది. మృత్యువుకి జాలిలేదు.

తన చిన్నచేతులతో వెంటరత్నంముఖం తనవైపు త్రిప్పుకుని "మామయ్యా, ఏమిటి ఆలోచిస్తున్నావు?" అంది పాప.

"ఏమీ లేదమ్మా"

"కాదు. ఏమీలేకుండా ఎలాఉంటుంది? చెప్పు మామయ్యా, ఏమిటి ఆలోచిస్తున్నావు? కథా?"

"కాదు"

"మరి ఏమిటి?"

"కాలంకథ"

పాప బిగ్గరగా నవ్వి" కాలానికి కథఏమిటి మామయ్యా అంది.

"నీకు కాలంఅంటే తెలుసాఏమిటి నీమోహం" అన్నాడు వెంకటరత్నం.

"తెలియదు ... ఎప్పుడూ అదేమిటో కనిపించలేదు. కనిపించనిదాన్నిగురించి కథేమిటి?" అన్నది కాసేపు ఆలోచించినమీాదట పాప.

"కనిపించనిదానికే కథ ఎక్కువగాఉంటుంది, నేర్చుకో పాపా. పెద్దదానివయినాక కనిపించని కాలాన్నిగురించిన కథ నువ్వే రాయాలి" అన్నాడు వెంకటరత్నం. అతని కళ్ళల్లో నీరుతిరిగింది. "పాపనయినా చిరంజీవినిచేయి ప్రభూ!" అనుకున్నాడు తనలోతను.

"ఏమిటి ఇవ్వాళ మీరంతా అదోమాదిరిగా ఉన్నారు" అని చిరునవ్వుతో ప్రశ్నించాడు రాజా.

"ఈ ప్రశ్న మరీ ఘోరం. దీనికి సమాధానంఇచ్చే కన్న ..." అనుకుని తలవంచుకున్నాడు వెంకటరత్నం.

ప్రసాదరావుగారు గోడవేపు తిరిగి పడుకున్నారు. ఆయన గుండెల్లో ఏదో మహావేదన ప్రారంభమయింది.

వరాలుచెయ్యి ఒకచేత్తోనూ, రాజాచెయ్యి ఒకచేత్తోనూ పట్టుకుని "రా నాన్నా, అల్లరిచెయ్యకు. తాతయ్యా నిద్రపోతున్నాడు" అని లాక్కుపోయింది పాప. వెంకటరత్నం చాలాసేపు అలా ఒంటరిగా కూర్చుండిపోయాడు. ఆ వంటరితనంలోకూడా అతనికి శాంతి దొరకలేదు. బహుశా, ఈ ప్రపంచంలోంచి శాంతి పారిపోయిందేమో!

తండ్రినీ, వరాల్ని పాప బయటకి లాక్కువెళ్ళింది. ముగ్గురూ హాస్పిటల్ఆవరణదాటి రోడ్డుమీదకి వచ్చారు.

"ఏమిటి పాపా, ఎక్కడికి?" అన్నాడు రాజా.

"ఆకలేస్తోంది నాన్నా! ఏదన్నా తింటాను" అని ఎదురుగా ఉన్న హోటల్ వైపు దారితీసింది పాప.

ముగ్గురూ టేబులుచుట్టూ కూర్చున్నారు. పాపమాటలకు హోటల్ సర్వరుకి ముద్దువచ్చి పాపకి ఇడ్లీయిచ్చిన తరువాత "అమ్మగారికీ, నాన్నగారికీ ఏంకావాలి?" అన్నాడు.

పాప పకపక నవ్వి "ఇడ్లీతీసుకురా"అని ఆర్డరిచ్చేసింది.

తలవంచుకు కూర్చున్న వరాల్ని చూసి "ఏమిటి పాప మాటలకి కోపంవచ్చిందా?" అన్నాడు రాజా.

"భలే! నామాటలకి ఏవరూ కోప్పడరు. అందరికీ నువ్వంటేనే కోపం. కదూ పిన్నీ?" అన్నది పాప చేతులు తిప్పుకుంటూను.

"అవును, పాపమాటలకి నాకు కోపంఎందుకు? పాప తల్లినయ్యేగీత మొగానలేకపోయినా కనీసం ఈ హోటల్ సర్వరుఎదుటనయినా కొంచెంసేపు పాపతల్లిగాపిలచినందుకు ఆనందిస్తున్నాను" అన్నది వరాలు.

"ఒప్పుకున్నానుగాని,పాప యెదుట అలా మాట్లాడకు. అది దేవాంతకురాలు" అన్నాడు రాజా పాపకి వినబడ కుండా. అదిచూసి, పాప "ఆ ఆ, నాన్న నన్నే ఏదో అంటు న్నాడూ"అని కాసేపు గునిసింది.

సాయంత్రం రిహార్సలుఉందని వరాలు వెళ్ళిపోయింది. తండ్రీ కూతురూ తిరిగితిరిగి ఇంటికి చేరారు.

౧౮

ప్రసాదరావుగారూ రాజా పాపని తీసుకుని మద్రాసు నించివచ్చిననాలుగురోజులకి పూర్ణ వచ్చింది. తండ్రీ తమ్ము డూకూడా ఆమెతో ముభావంగానే ఉంటున్నారు. ఇది చూసి బహుశా మరదలు వాళ్ళకేవో పితూరీలు చెప్పి ఉంటుందని అపోహపడి, ఆమెమీద విరుచుకుపడింది పూర్ణ.

"మాట్లాడకుండా నంగనాచిలా కనిపిస్తూనే. వాళ్ళి ద్దరికి ఏదో కల్పించి చెప్పావు. నువ్వెంతకయినా తగుదువు" అన్నది, మరదలి నుద్దేశించి.

"ఏమీ కలాఅంటే, నే నేం చెప్పను. నేను ఎవరితోనూ ఏమీ చెప్పలేదు" అని సమాధానం చెప్పింది ఆమె.

"లేకపోతే నాన్నగారూ, రాజా అలా ఎందుకుంటారు?"

"ఆ సంగతి వారినే అడగండి"

"నువ్వా తక్కువదానివి కాదులే" అని ఏడవటం మొదలెట్టింది పూర్ణ.

"అసలే మామగారికీ వారికీ ఒంట్లో బాగా లేదు. నిండు ఇంట్లో అనవసరంగా ఇప్పుడీ ఏడుపు దేనికి?" అన్నది రాజా భార్య.

"ఈ ఇంట్లో పుట్టి ఈ ఇంట్లో పెరిగాను. ఇప్పుడు నీచేత చెప్పించుకునే గీతపట్టింది. ఇంతకూ అమ్మ ఎప్పుడు లేదో అప్పుడే ఈ ఇంటికి నేను పరాయిదాన్నయిపోయాను" అన్నది పూర్ణ,

ఆడబిడ్డ ఇదివరకెప్పుడూ ఇలా మాట్లాడలేదు. ఈ తడవ ఊరికి వెళ్ళివచ్చినదగ్గరనుంచీ కావాలని తగూ పెట్టుకుంటున్నట్లు తోచింది. ఇక ఇప్పుడు తను ఏంమాట్లాడీ ప్రయోజనంలేదని అవతలికి పోయింది రాజాభార్య.

జావతీసుకువచ్చిన కోడల్నిచూసి "ఏమిటమ్మా, ఏదో అనుకుంటున్నారు?" అన్నారు ప్రసాదరావుగారు.

రాజాభార్య కొంచెంసేపు మాట్లాడలేదు. 'ఫరవా లేదు, చెప్పవమ్మా, ఏంజరిగింది?' అని మళ్ళీప్రశ్నించిన మామగారినిచూసి "ఏం లేదు మామగారూ! మీరిద్దరూ వదినగారితో మాట్లాడటంలేదని ఆవిడ బాధపడుతున్నారు" అన్నది రాజాభార్య.

"అయితే?"

"నేను మీకు ఏవో చెప్పిఉంటానని ఆవిడ అనుకుంటు న్నారు" అన్నది కోడలు.

పూర్ణకి ఇంత అధికారం ఇవ్వటం పొరపాటయింది. ఆరోజున వెంకటరత్నం, రామమ్మగారు ఆస్తి ఇవ్వద్దనిచెప్పనే చెప్పారు. తండ్రికీ తమ్ముడికీ అప్రతిష్టకలిగించేపనులుచేస్తూ ఆ నింద పరాయిఇంటిపిల్లమీద వేయటమా? ప్రసాదరావు గారికి విపరీతమైన కోపంవచ్చింది. "అమ్మాయ్" అని బిగ్గ రగా పిల్చారు. ఆ కేకకి భయపడుతూ వచ్చిన పూర్ణ తండ్రి దగ్గర నిలబడ్డ మరదల్నిచూసి, ఏవో పితూరీలు చెప్పిఉంటుం దని అనుకొని, కొరకొరా మరదలివంక చూసింది. మామ గారు జావతాగినగ్లాసు తీసుకొని అవతలకి వెళ్ళిపోయింది కోడలు.

"అలా కూర్చో" అన్నారు గంభీరంగా ప్రసాదరావు గారు.

పూర్ణ మెదలకుండా కూర్చుంది.

"నీ ప్రవర్తననిగురించి నీకు రెండుముక్కలు చెప్పాలని పిలిచాను" అన్నా రాయన.

పూర్ణ తలఎత్తి తండ్రివంక చూసింది.

"అలా చూసినందువల్ల ప్రయోజనంఏమీలేదు. నీ మరదలు పరాయిపిల్ల అయినా, యెంత ఉత్తమురాలో నాకు తెలుసు. మొగుడు ఈ తిరుగుళ్ళూ ఆ తిరుగుళ్ళూ తిరుగు తుంటే, కిమ్మనకుండా బిడ్డనిచూసుకుంటూ నాకు చాకిరీచేస్తు న్నది. మొన్న రాజాబబ్బుకి డబ్బు తక్కువయితే, నీవు ఇవ్వ లేదు. ఆ పిల్ల తన వడ్డాణాం, చంద్రహారం ఇచ్చింది. దీన్ని

బట్టి చూస్తుంటే, నీలో యెంత అవినీతీ, స్వార్థం జాస్తీఅయి నాయో అర్థమవుతోంది. సరే, అదలాఉంచు... తండిస్రనయి కూడా నా నోటివెంబడి పాడుమాటలు చెప్పిస్తున్నావు. నైతి కంగాకూడా నీ ప్రవర్తన సమర్థనీయంగాలేదు" అన్నారు ప్రసాదరావుగారు

"నైతికంగా ఎవరి ప్రవర్తనమాత్రం సరిగాఉంది?" అని ఎదురుప్రశ్నించిన కూతుర్ని చూసి ఆశ్చర్యంతో కొయ్య బారిపోయినారు ప్రసాదరావుగారు. దీనికి ఇంతధైర్యం ఎలావచ్చిందో ఆయనకి అర్థంకాలేదు. దానివెంటనే విపరీత మైన కోపంవచ్చిందికాని, తమాయించుకొని "ఆగు, నన్ను చెప్పనీ. ఈ పరిస్థితుల్లో నువ్వు ఆ పిల్లమీద పోట్లాడటం నీకు న్యాయమూ కాదు, మంచీ కాదు. ఈ ఇల్లూ వాకిలీ ఆమెవి. నీవు ఆమెబిడ్డనే నీ బిడ్డగా చూసుకుంటూ, నీకు నే నిచ్చిన ఆస్తిని నీ తదనంతరం పాపకి ఇవ్వటం నీ కనీసధర్మం. తరువాత ఇంకోసంగతి ఏమిటంటే? ఇకనుంచి నువ్వు ఇల్లు వదిలి వెళ్ళటానికి వీల్లేదు... నువ్వు పెద్దదానివి. ఒకపూట వంటలో ఆ అమ్మాయికి సహాయపడు. నివు చాలా చెడ్డ పేరు తెచ్చుకున్నావు" అన్నారు ప్రసాదరావుగారు.

పూర్ణకి చాలా కోపంవచ్చింది. ఈయనకి కన్నకూ తురుమీదకన్న కోడలిమీద ప్రేమ ఎక్కువ. ఆ ప్రేమకి కారణం ఇంకోటి ఊహించుకుంది పూర్ణ.

"అవును నాన్నగారూ, లోకంలో అందరూ మిమ్మల్నీ అనుకుంటున్నారు" అన్నది.

"ఏమని?"

"ప్రవర్తనవిషయంలో అందరూ ఒకటే మీగురించీ మరదలుగురించీ..." పూర్ణమాట ఇంకా పూర్తికాలేదు. ప్రసాదరావుగారు నరసింహావతారంలాగా పడకకుర్చీలోంచి లేచి నిలబడ్డారు. విపరీతమైన కోపంతో పూర్ణని కొట్టటం ప్రారంభించారు. వంటింట్లోనుంచి రాజాభార్య, గదిలోంచి రాజా పరుగెత్తుకొచ్చి ఈ దృశ్యం చూసి, కొయ్యబారి పోయినారు.

అజాతశత్రువువంటి తనతండ్రి ఒకర్నికొట్టటంకూడా రాజా ఎన్నడూ చూడలేదు. కన్నకూతుర్ని ఇంత క్రూరముగా కొట్టటానికి కారణం ఏదోకూడా అతనికి తెలియలేదు. అడ్డంవెళ్ళటానికి ఎవరికీ ధైర్యంలేదు.

అలా కోపంఅణిగేదాకా కొట్టి "ఫో, దౌర్భాగ్యురాలా! ఇక నీ మొహం ఈ జీవితంలో చూడను" అని చెప్తూ పడకకుర్చీలో కూర్చున్నారు. అంతవరదాకా తలుపుచాటున బిక్కమొగంతో నుంచున్న పాప ఆయనదగ్గరికి వెళ్ళింది. మనుమరాల్ని గుండెలకదుముకుని గుండెలు పగిలేలా దుఃఖించారు ఆయన.

పూర్ణ పెట్టెసర్దుకుని వెళ్ళిపోతుంటే రాజా వద్దని వారించాడు. కాని ఆమె వెళ్ళిపోయింది. ప్రసాదరావుగారు తన మాటప్రకారమే తిరిగి ఆమెముఖం చూడలేదు.

మూడునెలలు గడిచినతరువాత ఉయ్యూరు హాస్పిటల్లో ప్రసాదరావుగారు కూర్చుని ఏదో వ్రాస్తున్నారు. రాత్రి పదిగంటలయింది. ఆ రాత అయినాక, వెంకటరత్నానికి ఒక ఉత్తరంవ్రాసి, ఆ రాత్రిపూటే వెళ్ళి పోష్టుడబ్బాలో

స్వయంగా పడవేసి, నిశ్చింతగా బరువుదిగిపోయినట్లు నిద్రపోయినారు ఆయన.

౧౯

రెండురోజుల తరువాత ఒణికేచేతులతో కవరు చించాడు వెంకటరత్నం.

“నాయనా,

ఈ ఉత్తరం నీకు చేరేసరికి బహుశా, నేను బ్రతికి ఉండను. ఇప్పుడు నాకు చాలా ఆనందంగాఉంది. ఎల్లుండి ఆపరేషన్ జరుగుతుంది. శంకరనారాయణమాటప్రకారం నేను చనిపోతాను. అందుకు నేను విచారించటంలేదు. ఆరోజు నువ్వూ, శంకరం మాట్లాడుకున్న మాటలన్నీ నేను విన్నాను. రాజాఉండగానే నేను పోతున్నాను. ఈ రహస్యం నీవు నాకు చెప్పకపోయినా, భగవంతుడిదయవల్ల విన్నాను. కనుక, దీన్ని పరిష్కరించుకోగలిగాను. జీవితం గాలిబుడగలాంటిదైతే, ఈ ప్రపంచం ఒక మహా సత్రం. ఈ సత్రంలోంచి తప్పుకుని నా స్వగృహానికి పోవటం నాకు ఆనందం. రాజా ఊళ్ళోలేదు. పూర్ణ వెళ్ళిపోయింది. ఒక్క కోడలే నాతో ఉన్నది.

మిగిలిన ఆస్తి పాపపేర వీలువ్రాసి, కోడల్ని గార్డియన్‌గా ఉంచాను. ముందుగా నీకు వ్రాస్తే నన్ను ఆపరేషన్ చేయించుకోనివ్వవని నీకు వ్రాయలేదు. అన్నిటికన్న ఆనందం ఏమిటంటే, భాషా మళ్ళీ రాత్రి కనిపించింది. తను నాకోసం ఎదురుచూస్తూఉంటానని చెప్పింది. ఆ కారణం

చేతకూడా నేను చనిపోతానని రూఢిచేసుకుని చాలా ఆనందంగా ఉన్నాను.

పాపని నీకు అప్పచెప్పి పోతున్నాను. త్వరలో పితృవిహీనురాలు కాబోతున్న ఆ పసిదాన్ని నీఅంతదాన్ని చేస్తావని ఆశిస్తున్నాను. నిన్ననే పాపని గుంటూరు పంపించాను. నాదగ్గర కొడుకుగాని కూతురుగాని ప్రాణప్రదమైన పాపగాని ఎవరూ లేరు.

వరాలుని అడిగానని చెప్పు. పాప జాగ్రత! రాజా సంగతి ఏమిచెప్పను? కాని బ్రతికిన కొంచెంకాలంకూడా వాడు మనిషిలా బ్రతికాడనే తృప్తి వాడికి కలిగేటట్లు చూడు. అసమర్థుని రచనలా సారవిహీనమైన నా బ్రతుకులో ఆఖరిపేజీ అయిపోయింది... నే నిలా చేస్తున్నందుకు నివ్వు నన్ను క్షమించు"

ప్రసాదరావు.

ఆ ఉత్తరం చదివిన వెంకటరత్నం చాలాసేపు తేరుకోలేదు. ఏదోఒకమూల ఆపరేషన్ వాయిదావెయ్యకూడదా అన్న ఆశ పీడించడంవలన వెంటనే ఉయ్యాలు బయలుదేరాడు.

అతను ఉయ్యూరుచేరేసరికి అంతా అయిపోయింది. అసలు మత్తుకొంచి స్పృహరాకుండానే ప్రాణంపోయింది. ఆరడుగులపొడుగున్న ఆయనశవాన్ని చూసేసరికి వెంకటరత్నానికి కొద్దిగా నవ్వువచ్చింది.

రామమ్మగారికడుపున పుట్టి పెరిగి, రహస్యప్రణయకథ ద్వారా వంచితుడై భార్యావియోగం అనుభవించి, కొడుకు

చావు ఎరిగిఉండాల్సినదుస్థితిపట్టి, కూతుర్ని సవ్యమార్గాన నడిపించలేక, చివరకి పాపమీద ఆశతో ఆస్తి దానికిచ్చి కావాలని చనిపోయినాడు తన మేనమామ. ప్రవహించిపో తున్న ఈ జీవితంలో ఆయన తనవెంట ఏం తీసుకుపోయాడో, ఏం తీసుకుపోవాలనుకున్నాడోకూడా ఎవరికీ చెప్పలేదు. పుత్రశోకంనుంచి తప్పించుకోటానికి ఆయన ఈ మార్గం గుండా పారిపోయాడు.

శవంపక్కన రాజాభార్య ఒంటరిగా కూర్చునిఉంది. వెంకటరత్నాన్ని చూసి గొల్లుమంది. వెంకటరత్నం ఆమెని ఓదార్చి, రాజాకీ, పూర్ణకీ వాళ్ళుఉంటారని తను ఊహించినచోటికి టెలిగ్రాములిచ్చి బెజవాడ వెళ్ళి టాక్సీఒకటి మాట్లాడి తెచ్చాడు.

శవాన్ని జాగ్రతగా తనచేతులతోనే టాక్సీలో పడుకో పెట్టి రాజాభార్య భయపడుతుందేమోనని, ఆమెను ముందు సీట్లో కూర్చోమని, తను శవంకాళ్ళపక్కన కూర్చున్నాడు. టాక్సీ వేగంగా పోతోంది.

తనలో తను భగవద్గీత చదువుతున్నాడు వెంకటరత్నం. అది ప్రసాదరావుగారికి చాలా ఇష్టం. టాక్సీ ఊరుచేరేసరికి తెల్లవారుఝామున నాలుగయింది. శవాన్ని దించి వాకిట్లో అరుగుమీద పడుకోపెట్టి తలవైపున దీపం వెలిగించారు... అప్పటికే కొద్దిగా వాసన ప్రారంభమయింది. తెల్లవారేసరికి ఈ వార్త తెలిసి, ఊళ్ళోవారందరూ వచ్చారు. కొంచెం పొద్దుఎక్కేసరికి రాజా, పూర్ణ వచ్చారు.

రాజా వస్తూనే వెంకటరత్నందగ్గరికి వచ్చి "నాన్న గారు ఎందు కింత ఘోరంచేశారో నీకు తెలిసిఉంటుంది" అన్నాడు.

"ఆ సంగతి తరువాత మాట్లాడదాం. ముందు కర్మ కానీ. నిన్నఉదయంపోయిన మనిషిని ఇంకా అట్టిపెట్టకూడదు" అన్నాడు వెంకటరత్నం.

రాజా ఒకసారి ముఖంమీది గుడ్డతీసి తండ్రిమొగాన్ని నిశ్చలంగా అయిదునిముషాలు చూశాడు. చిన్నప్పటినుంచీ ఆయనంటే తనకి భయమే. కాని ప్రేమ, గౌరవాల కెన్నడూ లోపంలేదు. మెదలకుండా బట్టకప్పి స్నానానికి వెళ్లాడు రాజా.

పూర్ణ కుమిలికుమిలి ఏడుస్తోంది. బ్రతికుండగా ఇక నీమొహం చూడను అన్నారు. ఆయనచావుకి తనువేసిన అభాండమే కారణమా? ఆమెదుఃఖానికి అడుగున కొద్దిగా ఆనందం లేకపోలేదు. ఆమెకి స్వేచ్ఛ లభించింది.

స్నానంచేయిస్తుండగా పాప నరహరిరావుగారూ వచ్చారు. గోడకానుకుని కూర్చునిఉన్న తాతగారికి తనతండ్రి విభూతిరేకలు దిద్దుతున్నాడు. తాతయ్య అసలు కదలటం మానివేశాడు. చచ్చిపోవటమంటే కదలకుండా ఉండటమన్న మాట అనుకున్నది పాప.

మెల్లిగా వెంకటరత్నందగ్గరికి వెళ్ళింది పాప. దాన్ని చూసేసరికి అంతవరకూ ఆపుకుంటూవచ్చిన దుఃఖం కట్టలు తెంచుకుంది. వెంకటరత్నం పాపని గాఢంగా కౌగలించు కుని ఏడవటం ప్రారంభించాడు. ఈ ప్రపంచంలో తనకు మిగిలే ఆత్మీయురాల్లు అది ఒక్కతే.

"ఏడవకు మామయ్యా. నే నేడుస్తున్నానా? చూడు నా కో సంగతి చెప్పు. చచ్చిపోవటమంటే కదలకుండా ఉండ టమేనా?" అన్నది.

వెంకటరత్నానికి ఏం సమాధానంచెప్పాలో తెలియ లేదు. చిత్రం ఏమిటంటే, పాప ఏడవటంలేదు. పాప వస్తే దాన్ని ఎలా ఓదార్చాలో నిన్నటినుంచీ తను ప్రాక్టీసు చేస్తున్నాడు.

"పోన్లేగాని, తాతయ్య ఇక మనకి కనిపించడా?" అన్నది పాప మళ్ళీ.

"కనిపించడు."

"కనిపించకపోయినా, సుఖంగా ఉంటాడు. అత్తయ్య లాగా అక్కడ పోట్లాడేవాళ్ళుండరు" అన్నది పాప. వెంకటరత్నం ఉలిక్కిపడి "అత్తయ్య పోట్లాడిందా?" అన్నాడు.

"అవును. తాతయ్య అత్తయ్యని కొట్టాడుకూడా"

ఏమిటీ పూర్ణని కొట్టాడా? ప్రసాదరావుగారు ఇత ర్లకి ఎప్పుడూ కష్టంకలిగించరు. అలాంటిది కన్న కూతుర్ని యెంతో బలవత్తరమైన కారణం ఉంటేనే గాని కొట్టరు.

"ఎందుకో నీకు తెలుసా పాపా?"

పాప కొంచెంసేపు ఆలోచించి "అత్తయ్య ఏమం దంటే — 'అవును నాన్నగారూ, ప్రవర్తన విషయంలో అందరూ అంటున్నారు మీ సంగతీ, మరదలు సంగతీ —' అంది. అంటే ఏమిటి మామయ్యా?" అన్నది.

వెంకటరత్నం దూరంగా కూర్చొని ఏడుస్తున్న పూర్ణ వంక చూశాడు. చెప్పరాని అసహ్యం కలిగింది ఆమె అంటే. ఈ నీచురాలినేనా తను ఒకనాడు ఉన్నతురాలనుకుంది ?

చివరకి ఎంతమాట అన్నది ?

పూర్ణ ఆదేసమయంలో తలఎత్తి వెంకటరత్నంవంక చూసింది. నిప్పులు కక్కుతూ తనవైపు చూస్తున్న అతని కళ్ళను చూసి, ఆశ్చర్యపోయింది. ఏమిటి అలా చూస్తున్నాడు ?

"ఏమిటి మామయ్యా మాట్లాడవు ?" అని అతని మొగం తనవైపు తిప్పుకుంది పాప.

"ఒకసంగతి చెప్పు పాపా. అత్తయ్య అలా అంటున్నప్పుడు మీ నాన్నా అమ్మా అక్కడ ఉన్నారా ?"

"లేరు. తాతయ్య అత్తయ్యని కొడుతుంటే వచ్చారు" అన్నది పాప.

"అయితే, ఈ సంగతి వాళ్ళకు తెలియదన్నమాట?"

"తెలియదు. అత్తయ్య అన్నమాటలు నేను ఒక్కదాన్నే తలుపుచాటునుంచి విన్నాను" అన్నది పాప.

శవానికి స్నానం చేయించి, పాడెమీద పడుకోబెట్టారు. వెంకటరత్నం దుఃఖంఆపుకోటానికి వ్యర్థప్రయత్నంచేస్తూ "పద పాపా, తాతయ్యకి దణ్ణంపెట్టి వద్దాం" అని పాపని ఎత్తుకుని. ముందుకు వెళ్ళి తన బంధువూ స్నేహితుడూ మహా సంస్కారవంతుడూఅయిన తన మేనమామకి ఆఖరిసారి హృదయపూర్వకంగా నమస్కరించాడు.

నారాయణ నామ స్మరణమధ్య పాడె పైకిలేచింది. వెనకాల రాజా నిప్పుపుచ్చుకుని నడుస్తున్నాడు. ఏ భాగ్యం కోసమైతే ఆయన ప్రాణంతీసుకున్నాడో ఆ భాగ్యం ఆయనకి లభించింది.

మామయ్య చాలా మంచిపనిచేశాడు అని ఇప్పు డని పించింది అతనికి.

పాపతోసహా చెరువులో స్నానానికివెళ్లి చాలసేపు ఆ నీళ్ళల్లో కూర్చుని మేనమామ ఆత్మశాంతికోసం భగవంతుడిని ప్రార్థించాడు. తన కీ మూడురోజులు మైల.

"తాతయ్య వెళ్ళిపోయినాడు సరే, బాగానేఉంది. మరి నా సంగతి?" అంది పాప.

అప్పటికి ఇద్దరిస్నానమూ పూర్తిఅయింది. పాప ఇంత వరకూ ఏడవనేలేదు "నీసంగతి కేం, బంగారుతల్లిలాఉంటావు" అని జవాబుచెప్పాడు వెంకటరత్నం.

ఇద్దరూ అమంగళకరమైన ఇంట్లోకి వెళ్ళారు. తాత గారు రోజూ కూర్చునే పడకకుర్చీ కనిపించగానే బావురుమని ఏడుపు ప్రారంభించింది పాప.

## ౨౦

కర్మ అయింది. పదమూడోరోజున ఎవరిదారినవారు వెళ్లిపోయారు. ఒంటరిగాకూర్చున్న రాజాదగ్గరికి వెంకట రత్నం వెళ్ళాడు. రాజా నిట్టూర్చి,

"నాన్నగారు ఇంతత్వరగా పోతారనుకోలేదురా" అన్నాడు.

"సరే, ఇకముందు జరగాల్సింది ఏమిటి?" అన్నాడు వెంకటరత్నం.

"నాన్నగారు ఆస్తిని పాపపేర వ్రాసిపోవటంలో ఏదో అర్థంఉన్నది. అదేమిటో నాకు బోధపడటంలేదు"

"ఆస్తి ఎవరిదయితేనేం? పాప నీ బిడ్డ కాదా?"

"నేను అందుకు అనటంలేదు. అసలుసంగతి ఏమిటో బోధపడటంలేదు."

"సరేలే, ఇప్పు డేం మునిగిపోయింది? పూర్ణసంగతేమిటి? నీదగ్గర ఉంటుందా?"

"ఏమో తెలియదు. ఆమధ్య ఎప్పుడూ ఎవరిమీదా చెయిచేసుకోని నాన్నగారు దాన్ని కొట్టారుకూడా. కారణం ఎవరికీ తెలియదు."

"ఆమెపద్ధతీ ప్రవర్తనా ఏమీ బాగాలేదు. అందుకని కొట్టిఉంటారు."

"వెంకటరత్నం!"

"ఏమిటిరా?"

"నేనుకూడా ఆట్టేరోజులు బ్రతుకుతానని తోచదు."

రాజాఅన్న ఆ మాటకి వెంకటరత్నం నిట్టూర్పువిడిచి ఊరుకున్నాడు గాని, జవాబుచెప్పలేదు.

"నువ్వు ఏంమాట్లాడకపోవటం చూస్తే, నాకేకాదు, నీకూ అలాగే అనిపించిఉంటుందన్నమాట" అన్నాడు రాజా.

"ఏమిటిరా పాడుమాటలు!"

"నిజంచెప్పరా, నే నేం భయపడనులే. చావు శరీ రాన్ని విడదీస్తుందిగాని, ఆత్మల్ని కలిపేఉంచుతుంది. నిజం చెప్పాలంటే చావుకి సంతోషించాలి" అన్నాడు రాజా.

"సరేలే, మరి నేను సాయంత్రం వెడతాను."

"అలా ఒల్లకాదు. మనిద్దరం కనీసం పదిహేనురోజు లైనా కలిసిఉందాం. శెలవు పంపించు... అసలీ ఉద్యోగం మానివేసి, బందరులో ఒక పత్రిక పెట్టరాదూ?" అన్నాడు రాజా.

వెంకటరత్నం వెంటనే పదిహేనురోజులకి సెలవు పంపించేశాడు. ఆ పదిహేనురోజులూ మళ్ళీ బందరులో చదు వుకునేరోజులు జ్ఞాపకంవచ్చినాయి.

ఒకరోజు సాయంత్రం భామా వరాలుతల్లి అని చెప్పి, ఆ కథంతా వినిపించాడు. కథవిన్నతరువాత అయిదునిముషాల సేపు రాజా మాట్లాడలేదు. తరువాత,

"నాన్నగారి మనసులో ఇంత హృదయవిదారకమైన కథ ఉన్నదని ఎవరూ అనుకోరు" అన్నాడు.

"నేను నా జీవితంలో విషాదగాథలు వినటానికీ చూడటానికీ పుట్టానులాగుంది" అన్నాడు వెంకటరత్నం.

"వ్రాయటానికికూడా... ఒరేయ్ బావా !"

"ఏమిటి ?"

"నా కథ వ్రాయటానికి బాగున్నదని నీకు తోస్తే, ఒక నవలగా వ్రాయి. నాకు అదొక్కటే కోరికఉంది."

"ప్రతివాడికథా వ్రాయొచ్చును... వ్రాయటం అనేది అసలువస్తే"

"నీవు గొప్ప రచయితవు. నీ రచనకి జీవనాన్నిచ్చింది నేనని నీ ఇదివరకు చాలాసార్లు అన్నావు. ... కాబట్టి నా కథ వ్రాయమని అడిగేహక్కు నాకు ఉన్నది."

"నీ కథ వ్రాయమని నేను అనటంలేదురా"

"నిజంగా మీ రచయితలకు నాకథలాంటి కథలకన్న నాన్నగారికథ బాగా నచ్చుతుంది."

"దానికి ఒక్కటే కారణం. ఆ కథ చాలా అందంగా ముగిసింది"

"ఏకథకయినా ముగింపుఎప్పుడూ బాగానే ఉంటుంది. అసలు ప్రతికథకీ ముగింపు ఒక్కటే. అది మృత్యువు. ప్రతి కథకీ ప్రారంభంకూడా ఒక్కటే. అది పుట్టుక. ఈ జీవన స్రవంతి ప్రతివాడి పుట్టుకలోనూ ఒక్కోబిందువుగా జన్మ నంది, చివరకి అనంతమైన జీవనప్రవాహంగా ప్రవహిస్తూ పోతున్నది. ఏ బిందువు ఎక్కడ ఇంకిపోతే, ఆ బిందువు కథ అక్కడికి ముగిసిందనుకోవాలి" అన్నాడు రాజా.

" ప్రతిపుట్టుకా ప్రతిచావూ మంచికథకి ప్రారం భమూ, ముగింపూ కావు.కథావస్తువులయ్యే జీవితాలు వేరు"

"అది నేను ఒప్పుకోను. ప్రతిమనిషిజీవితంలోనూ ఒకటిఅయినా వెన్నెలరాత్రి ఉంటుంది. ఒక్కటయినా కాళ రాత్రికూడా ఉంటుంది. ఉత్తమరచయిత ఈ వెలుగు చీక ట్లని పడుగుపేకలుగాచేసి, ఒక చక్కనికథ నేయగలడు. ఆ తరువాత అతని ప్రతిభనిబట్టి దానిమీద రంగులువేస్తాడు"

వెంకరత్నం మాట్లాడలేదు.

"మాట్లాడవేంరా?"

"నేను వ్రాయగలనన్నే నమ్మకం నాకు లేదు. ఎందుకంటే భూతకాలం తెరచాటున ఉంటే, వర్తమానం అగమ్యంగా ఉంది. భవిష్యత్ నిగురించి వ్రాయటానికి నేను ప్రవక్తనిఅసలే కాను. ఈ భవిష్యత్ నిగురించి నా ఇష్టమొచ్చినట్టు వ్రాయాలనే కోరిక నాకు అప్పుడప్పుడుకలుగుతూవచ్చినా, అనిశ్చితమూ అగోచరమూ అయినదానిని గురించి వ్రాయటానికి నాకు సాహసంలేదు" అన్నాడు వెంకటరత్నం.

"మరి నీ వేం వ్రాయాలని అనుకుంటున్నావు?" అని ప్రశ్నించాడు రాజా.

"నేను వ్రాయాలని అనుకుంటున్నది చాలాఉంది. నాకుఅనేకమైన వ్యక్తిగతసన్నిహితా లేర్పడ్డాయి. నా మనసు నిండా రకరకాల బొమ్మలుఉన్నాయి. కొన్ని తమ సజీవ నేత్రాలతో నాకేసి చూస్తుంటే, వాటిజీవతపరమావధిని నాకు జ్ఞాపకంచేస్తూ తమనుగురించి చెప్పమని ప్రార్థిస్తున్నాయా అనిపిస్తుంది.

"మరికొన్ని జరిగినకథను చెప్పుతూ, జరగబోయేది నా ఊహకు వదలివేస్తున్నాయి. ఇంకొన్ని బొమ్మలలో ఆశ నిరీక్షణ ఉన్నాయి. ఈ కథలన్నిటి అంచులు మాత్రమే నే నెరుగుదును. లోపలిచరిత్ర తెరిచిచూడాలంటే, కొంత సాహసం అవసరం. ఆ సాహసం నాకులేదు"

"బాగుంది చావు ప్రతివాడికీ జన్మతోపాటు లభించే వారసత్వంమాత్రమే కాకుండా, ప్రతివాడి కథకీ తప్పించుకోలేని ముగింపుకూడా. అందుకే రచయిత ఎవరైనా చావునే తన

కథకి ముగింపుగా తీసుకుంటాడు. ఆ పనే నువ్వూ చెయ్యి" అన్నాడు రాజా.

"ఆ వారసత్వాన్ని ఎవరూ కాదనలేరు కాని, సాధ్యం అయినంతవరకూ ఆ ముగింపునుంచి తప్పించుకోవాలనే మనిషి ప్రయత్నిస్తాడు. నిజం చెప్పాలంటే, జీవితంమీద అసహ్యం కలిగిన ప్రతివాడికీ, కావాలంటే ఒకటే తప్పించుకునే దారి ఉంది. ఆ దారి మన స్వాధీనంలోనే ఉందికూడా. ఇంకో ఏమిటంటే, జీవితాన్ని లొంగతీసుకోటం చేతకాక పోతే, చావునైనా సాధించవచ్చు. నిరాశ పోవటానికి ఇదొక చక్కని ఆలోచన" అన్నాడు వెంకటరత్నం.

"మరిప్పుడు కథకి అంతం ఏమిటి?"

"కథని అంతంచేసేభారం నామీద వేసుకోవాలని నేను అనుకోటంలేదు...ప్రపంచాన్ని చూసినకొద్దీ క్రమ క్రమంగా జీవితంమీద నాకున్నఅభిప్రాయం పూర్తిగా మారిపోతున్నది. నిన్నటి నా ఊహలూ, ఉద్దేశ్యాలూ అలాగే ఉన్నాయి కాని, వెనుకటిబలం వాటిల్లో ఇప్పుడు లేదు. తరచుగా నీచత్వమే జయిస్తున్నది. కాని అంతకంటే శోచనీయమైన మరోవిషయం ఏమిటంటే, ఔన్నత్యం వికృతంగా మారిపోవటం. కొన్నియుగాలుగా శ్రమించి అనేక కష్టనష్టాలకు ఓర్చి, ఈసుఖాల్ని నిర్మించుకున్న మానవుడు ఇంకా మోహ మోసాలకి అతీతుడై జీవించలేని నికృష్టస్థితి లోనే ఉన్నాడు. ఈ నికృష్టమైన అతని స్వభావాన్ని మార్చ టం సాధ్యమవుతుందా? కాదా? అన్నది ఆలోచన.

ఒకోక్కసారి లక్ష్యసాధనకి మనం చేస్తున్న ప్రియత్నమే త్రొవపాముకింద మారి, లక్ష్యాన్ని మననీకూడా విషపూరితం చేసివేస్తుంది. అప్పుడేంచేయాలి? అనేది మరో సమస్య. ఈ సమస్యలన్నిటినుంచీ తప్పించుకోవాలంటే ఒకటే దారి. అది ఆలోచనాగహితమైన మొద్దుతనాన్ని పెంచుకోటం'' అన్నాడు వెంకటరత్నం.

''సరే, మరినా కోరికసంగతి ఏమిటి?'' అన్నాడు రాజా.

''నీ కథలో నాదీ ఒక పాత్ర. పక్షపాతంలేకుండా ప్రతివిషయాన్ని పరిశీలించడానికి ఇది ఒక అడ్డు. అయినా నీ కథ వ్రాసేందుకు ఇంకా సమయంరాలేదు.

''సమయంవచ్చినప్పుడు వ్రాస్తానని మాటఇవ్వు.''

''తప్పకుండా నీ కథ ప్రపంచానికి తెలిసేట్లు చేస్తాను.''

''నా కథలో అట్టే ప్రత్యేకత లేదు. జీవితాన్ని లొంగతీసుకోగలననే ధీమాలో జీవితానికే లొంగిపోయినాను. ఆమాటకొస్తే, నా కథలో నాన్నగారికథ ఉన్నది. దానికి చాలా ప్రత్యేకతకూడా ఉన్నది.

''ఆ కథలో ప్రారంభంలోఉన్న అందం ముగింపులోనూ ఉంది. ఆ ముగింపు నీ కథకి ప్రారంభం'' అన్నాడు వెంకటరత్నం.

ఇద్దరూ లేచి నడవటం ప్రారంభించారు. భవిష్యత్ కి వేసిన తెరలాగా ప్రపంచాన్ని సన్నని వలిపపు వెన్నెల కప్పింది.

వాళ్ళిద్దరూ ఇంటికివచ్చేసరికి ఉత్తరపు వసారాలో ఘూర్ణ పక్కలువేస్తున్నది.

అది చూసిన వెంకటరత్నానికి కొన్ని సంవత్సరాల కిందట జరిగిన సంగతి జ్ఞాపకంవచ్చింది. రాజా కాంభోట్లు గారింట్లో షికారుచేయటానికి వెళ్ళాడు. ఆరాత్రి పూర్ణతో తను చాలాసేపు మాట్లాడాడు.

"మనని మనం భ్రమపెట్టుకోడంతో ప్రారంభమయిన ప్రేమ ఇతర్లని భ్రమపెట్టటంతో పూర్తిఅవుతుంది" అని తను అన్నాడు ఆనాడు. అది పూర్తిగా నమ్మి, అన్నమాట కాక పోయినా, ఈరోజు అదే ఒక మహాసత్యంకింద మారింది. ఆ రోజు పూర్ణతో మాట్లాడటం తనకి చాలా ఆనందంకలిగించేది.

ఇప్పుడా ఆనందం పోయి, అసహ్యం మిగిలింది. కొన్నాళ్ళకి ఈ అసహ్యంకూడా పోయి, ఏమీ మిగలదు. అప్పుడీ జీవితంలో మిగిలిందేమిటి?

ఏమీ లేదు.

ఆ ఉత్తరపువేపు వసారాలో తను చాలారోజులు నిద్రించాడు కాని, ఈరోజు నిద్రరావటంలేదు.

తన కిది మాతామహస్థానం. నాలుగేళ్ళ పిల్లాడప్పుడు ఈ ఇంటిదొడ్లోనే ఆవుదూడలతో ఆడాడు. ఒకసారి ఆవుదూడ పడతోస్తే మేనమామ వచ్చి ఎత్తుకున్నాడు.

ఈరోజు విధి తన్ను పడతోసినా ఆయన తనని లేవదీయటానికి రాడు.

ఈ ఇంట్లోనే తనబాల్యం గడిచింది. యౌవ్వనం ఎప్పుడొచ్చిందో ఎవరికీ తెలియదు... పూర్ణ—ఆమె తన బ్రతుకులో ఒక దుర్ముహూర్తంలో అడుగుపెట్టింది.

రెండో అడుగు తను వేయనీయలేదు... రాజా -వీడిని తను ప్రాణప్రదంగా ప్రేమించాడు. కాని వాడూ తనకి మిగలడు. తనంత ప్రాణప్రదంగానే వాడిని ప్రేమించిన మరో వ్యక్తి వరాలు. ఆ రోజుల్లో తన హృదయం ఆమెను అసహ్యించుకునేది. ఈరోజు అదే హృదయం ఆమెముందు అవనతమై పోతున్నది.

ఇక్కడే తను అనేకదినాలు గడిపాడు.

అతనికళ్ళముందు ఆ ఇంటిచరిత్ర కనిపిస్తున్నది. తన తాతగారు క్రిష్ణయ్యగారు, ఆయనభార్య రామమ్మగారు తన మాతామహి, వాళ్ళిద్దరూ ఇప్పుడు లేరు. వాళ్ళ జ్ఞాపకం కూడా విలుప్తమైపోతున్నది. ఈ రెండు పాత్రలమధ్యా మహో జ్వలంగా దర్శనంఇచ్చే మరో పాత్ర సభారంజనమ్మ.

తరువాత తన మేనమామ, మేనత్త. వీళ్ళూ ఇప్పుడు కనిపించటంలేదు. వీళ్ళిద్దరిమధ్యా కొంతకాలం మెరిసి, ఆరిపోయిన ఉజ్వలదీపశిఖలాటి వ్యక్తి భామా.

ఇక రాజా, రాజాభార్య- వీరిద్దరూ ఏమి అవబోతున్నారో తెలియదు వీరిద్దరిమధ్యాకూడా అంతర్వాహిని సరస్వతీనదిలాటిపాత్ర వరాలుది వున్నది.

మూడుతరాలు, మూడుకథలు, ముగింపు మృత్యువుతోనే అవుతున్న మూడుజతల జీవితాలు.

పాప గబగబా వచ్చి వెంకటరత్నంపక్కలో కూర్చుని "ఏమిటి ఆలోచిస్తున్నావు మామయ్యా; నాకు చెప్పవూ!" అన్నది.

"దీనిది నాలుగోతరం. ఇదికూడా నాకుమల్లేనే పేర్ర్చు కురాలు" అనుకున్నాడు వెంకటరత్నం.

౨౧

కాలం గడిచిపోయింది. రాయపేట హైరోడ్డులో ఒక గదిలో జ్వరంతో పడుకున్న వెంకటరత్నం ఒక పత్రికలో వ్యాసాన్ని చాలా జాగ్రతగా చదువుతున్నాడు.

మానవుడు తన వ్యక్తిగతమైన జీవితంలోకూడా శరీరానికీ, అనుభవానికీ, ఆత్మకీసంబంధించిన విషయాన్నిగురించి ఆలోచిస్తూ ముడిపెట్టుకుంటూనే బ్రతుకుతాడు.

పరిపూర్ణమైన మానవు డెప్పుడూ శారీరకంగా ఆటవికుడిలాగా మానసికంగా నాగరికుడుగా ఉంటాడు.

పరిపూర్ణతఅంటే మృత్యువేకనుక దాన్ని తెలుసుకోటం అసాధ్యం. ఎప్పటికప్పుడు పయనిస్తూనే వెనక్కి జరిగిపోతున్న ప్రతివిషయాన్నీపట్టి నిలిపిఉంచాలని ప్రయత్నిస్తూనేఉంటాం. మనలోప్రతిమనిషిలోనూ భిన్నమైనవ్యక్తిత్వాలు ఉన్నాయి. అవన్నీ ఒకేమార్గాన ఎప్పుడూ ప్రయాణించవు.

బ్రతుకుని అభిమానిస్తూనే అదంటే అసహ్యించుకుంటాం. అనుభవాల్ని ఆమోదిస్తూనే విసుక్కుంటూ ఉంటాం. ఆకలికి ఆహారంకావాలని కోరుతూనే అది ఇంద్రియ చాపల్యమని ఈసడిస్తాం.

ఈ విభిన్నధోరణులను సమన్వయపరచడంఅనేది ఒక ఉత్తమ కళ అని చెప్పవచ్చును.

జీవితపులోతుని దర్శించడానికి వ్యామోహాన్ని విసర్జిస్తాం. జీవితపుఫలితాన్ని చూడటానికి ఆ జీవితాన్నే ఒక వ్యసనంగా భావిస్తాం.

హేతువాదం అనుభవం మనకి అధికంగాఉన్నాకూడా అపారమైన జీవనస్రవంతినిగురించి మనకు తెలిసింది చాలా తక్కువ.

అయినా, మనమే దాన్ని చిత్రిస్తాంకూడా. బల హీనుడూ చాపల్యంగలవాడూ అల్పకాలమే జీవించేవాడూ అయిన ఈ మానవుడిలో భగవంతుడి అంశకూడా ఉన్నది. భగవంతుడు ఒక విచిత్రం, ఒక ఉత్తమభావం, చక్కని స్వప్నం. ఆ స్వప్నాన్ని జీవితంగా చేసుకున్నవాడే మహా యోగీ మహారచయితా...

వెంకటరత్నం ఆ వ్యాసం చదివి కళ్లుమూసుకున్నాడు. మూసిన అతని కనురెప్పలసందునించి కన్నీరు జారి తలగడాని తడిపివేస్తున్నది. జ్వరతీవ్రతకి హృదయవేదన తోడై, అతని కణతలు పగిలిపోతున్నయ్.

ఆ వ్యాసం వ్రాసింది పాప... తన తపస్సు ఆమెలో ధారకట్టింది. తనకంటే సాహసవంతురాలు పాప. బలంఅంతా కూడదీసుకుని వెంటనే రమ్మని పాపకి ఉత్తరంవ్రాశాడు వెంకటరత్నం.

వరాలు వచ్చింది లోపలికి. ఆమెలో ఇప్పుడు ఇదివర కటి సౌందర్యం లేదు. ఇదివరకున్న ఉత్సాహమూ లేదు. ఆమె నటించటం మానివేసి బాంకులోఉన్న పదివేలమీద

వచ్చే వడ్డీతో జీవితాన్ని గడిపేస్తున్నది. ఆమెతమ్ముళ్ళూ చెల్లెళ్ళూ పెద్దవాళ్ళైనారు. తల్లీ తనూ ఉంటున్నారు.

కాషాయరంగుచీర, నిరాభరణమైన ఆమెశరీరానికి ఒక విధమైన నిర్లిప్తతని కలిగిస్తున్నది. మద్రాసువిడిచి ఆమె ఎక్కడికీ పోలేదు, పోదుకూడా.

"ఎలాఉంది వెంకటరత్నంగారూ?" అని ఒక కుర్చీ లాక్కుని కూర్చుంది వరాలు.

"ఎలాఉందని చెప్పను? ఇప్పుడే. పాపకి ఉత్తరంవ్రాశాను"

"ఈరోజున నా మనసు చంచలమైపోతోంది వెంకటరత్నంగారూ! ఎంత నిగ్రహంగా ఉందామన్నా సాధ్యంకావటంలేదు"

"నిజం చెప్పాలంటే, నేనూ అలాగే ఉన్నాను. వాడి ఆఖరికోర్కె తీర్చాలనే బాధ్యతకూడా నామీద ఉన్నది" అన్నాడు వెంకటరత్నం.

ఇద్దరూ నిశ్శబ్దంగా కూర్చుండిపోయారు. వారి హృదయాల్లో దుఃఖతరంగాలు పైకికనిపించటంలేదు. ఈనాడు రాజాచనిపోయినదినం.

## ౨౨

మూడురోజులతరువాత ఒకనాటిఉదయాన్నే పాప కంఠస్వరం వినిపించింది వెంకటరత్నానికి.

పాప ఇప్పుడు యువతి. వివాహితురాలు. చిన్నప్పటిలాగానే గబగబా వచ్చి వెంకటరత్నంపక్కలో కూర్చుని,

"ఏమిటి ఆలోచిస్తున్నావు మామయ్యా, నాతో చెప్పవూ?" అన్నది.

బంగారుగాజులతో పరిపూర్ణ యవ్వనాన్ని సూచిస్తున్న ఆమె అరచేతితో అతనినుదుటిని స్పృశించి,

"జ్వరం మండిపోతున్నది మామయ్యా! నాకు ముందుగా ఎందుకు ఉత్తరంవ్రాయలేదూ?" అని గద్దించింది పాప.

"ఇప్పుడు వ్రాశానుగా. ముందుగా వ్రాస్తే నీ అల్లరి భరించద్దూ?"

"నిజంచెప్పు, నిజంగా నీకు కావాల్సింది నా అల్లరి; అవునా?"

"ఉత్తప్పుడు అంతే: ఇప్పుడు జ్వరంగాఉన్నానుగా" అని నవ్వాడు వెంకటరత్నం.

"నా చెయ్యితగిలితే, జ్వరం గిరం ఎగిరిపోతుంది" అని పక్కనున్న ఫ్లాస్కులో కాఫీ కప్పులోపోసి అతనికిచ్చింది.

"ఇంతకాఫీ తాగలేను పాపా."

"మా చక్కగా త్రాగగలవు. బుద్ధిమంతుడిలాగా త్రాగేసెయ్యి."

"ఏమిటీ నీ అధికారం?"

"అది నువ్వే ఇచ్చావు... చూడు, ఎలా చిక్కిపోయినావో! ఈ కొంచెం కాఫీ త్రాగేసెయ్యి"

కాఫీకప్పు తీసుకుని నవ్వుతూ వెళ్ళిన పాపనిచూసి, వెంకటరత్నం "నీ నీడలో కన్నుమూయటంకూడా అదృష్టమే" అనుకున్నాడు.

పాప స్నానంచేసి, బట్టలుమార్చుకుని వచ్చి వెంకటరత్నంపక్కలో కూర్చుని,

"ఇక చెప్పు మామయ్యా! ఎంత తొందరగా రమ్మని వ్రాశావు? హడలిపోయినాను దాన్నిచూసి - అసలు బ్రతికి ఉన్నావో లేవో అని భయంవేసింది'' అన్నది.

"మీ ఆయనా, అబ్బాయీ కులాసాగా ఉన్నారా?"

"నే నడిగిన ప్రశ్నకి అది సమాధానంకాదు."

"నువ్వు అడిగినప్రశ్నకి సమాధానం చెప్పేముందు, నేను అడిగే ప్రశ్నకి సమాధానం చెప్పు"

"ప్రశ్నకి జవాబుఅనేది అసలు లేదు మామయ్యా! అయినా అడుగు చెపుతాను."

"మొన్న నువ్వు వ్రాసిన వ్యాసం చదివాను"

" అది చాలామంది నువ్వు వ్రాసిందే అనుకుని ఉంటారు."

"చెప్పేది సాంతం విను. నా కిప్పుడున్న గర్వమూ నా జీవితంలో నాకు మిగిలిన తృప్తి ఒక్కటే. అది నిన్ను నేను నన్నుగా తయారుచేయటం. నా క్కావల్సినవిధంగా నువ్వు తయారయినావు"

"భేష్! మామయ్యా! శరత్ నవలలో హీరోలాగ మాట్లాడావు"

"వేళాకోళం మానేసి నోరుమూసుకుని విను. ఇప్పుడు నీకు, నే నో పని చెప్పబోతున్నాను"

"ఏమిటది ?"

"మీ నాన్న నన్ను ఒక కోరిక కోరాడు. ఆ కోరిక పూర్తిచేసేభారాన్ని నీమీద పెడుతున్నాను"

తండ్రిపేరు ఎత్తేసరికి పాపలో చలిపితనం అంతరిం

చింది. పరమగంభీరురాలైన ఆ యువతి వెంకటరత్నం చెప్పు తున్నది వింటున్నది.

"జీవితాన్ని లొంగతీసుకోవాలనే ప్రయత్నంలో జీవి తానికే లొంగిపోయినానని వాడు చివరిరోజుల్లో బాధ పడ్డాడు. 'నా కథవ్రాయటానికి బాగున్నదని తోస్తే నవలగా వ్రాయి. అదొక్కటే నిన్ను కోరేది' అని అడిగాడు". వెంకట రత్నం కంఠం గాద్గద్యమయినది. కొంచెంసేపు ఏమీ మాట్లాడలేదు.

"నిజానికి ఈ జీవననాటకంలో నాకు తెలిసిందెంత అనిపిస్తోంది. అంతా మసకగాఉంది. యథార్థాన్ని, కల్పననీ, కాంతినీ, అంధకారాన్ని కలిపి నేను ఊహించిన ఈ ఊహాలలో ఏదిసత్యమో ఏది అసత్యమో నాకు అంతుదొరకటంలేదు. అంతా అసత్యమైనా కావచ్చును; ఇలాంటి పరిస్థితుల్లో, నామీద నాకే నమ్మకంలేని ఈ స్థితిలో, మీ నాన్నకోరిక తీర్చలేకపోయాను. అది నువ్వు తీర్చాలి" అన్నాడు వెంకట రత్నం.

పాప కొంచెంసేపు మాట్లాడలేదు. తరువాత "నేను అందుకు అర్హురాలనని నీకునమ్మకం ఉన్నదా మామయ్యా?" అన్నది.

"తప్పకుండా ఉంది. నువ్వే నేను"

"మరి గడిచినకథలు నాకెలా తెలుస్తాయి ?"

"నేను చెపుతాను"

ఇంతలో వరాలు వచ్చింది. పాప సాదరంగా నిలబడి 'రండి' అని ఆహ్వానించింది. కొంచెంసేపు కూర్చుని వరాలు వెళ్ళిపోయింది.

"ఆమె ఎవరు మామయ్యా ?"

"నీకు గుర్తు లేదా ?"

"లేదు"

"ఆమెనుచూస్తే నీ కేమనిపిస్తున్నది ?"

"నమస్కరించా లనిపిస్తున్నది"

"నీ నమస్కారానికి ఆమె అర్హురాలు"

"ఇంతకూ ఎవరో చెప్పలేదు"

వెంకటరత్నం కథ అంతా చెప్పాడు. అంతా విన్న తరువాత పాప నిట్టూర్చి,

"జీవితం చాలా చిత్రమైనది మామయ్యా ! అది ఒక విషాదసంఘటనలగుత్తి. అందులో అప్పుడప్పుడు కళాత్మకమైన రంగురంగుల పుష్పాలు వికసిస్తాయి. నువ్వు చెప్పిన ఈ వ్యక్తులు అలాంటి పుష్పాలు" అన్నది.

"సరిగ్గా ఇవే మాటలు భాషాకథ విన్న తరువాత మామ్యయ్యతో నేనూ అన్నాను"

"సరే, మామయ్యా, ఈ పూలతో మనోహరమైన మాల అలటానికి ప్రయత్నిస్తాను. నన్ను ఆశీర్వదించు" అని వెంకటరత్నానికి నమస్కరించింది పాప.

పాప చేతిని తనచేతులోకి తీసుకొని,

"ఇప్పుడు నేను నిశ్చింతగాఉంటాను. నా రాజాకి ఇచ్చిన వాగ్దానం నెరవేర్చుకున్నాను."

పాప నిట్టూర్చి "నువ్వు గొప్పవాడివి మామయ్యా!" అన్నది.

"ఎందుకని?"

"ఎందుకనో తరువాత చెప్తాను. నువ్విక్కడ జ్వరంతో ఒంటరిగా పడిఉండటం నా కిష్టంలేదు. నాతో రాకూడదూ?"

"మీ ఆయన ఊరుకుంటాడూ?"

"తప్పకుండా ఊరుకుంటారు. అంతగా ఊరుకోకపోతే మనిద్దరం వేరే ఉందాం."

" నువ్వింకా చిన్నపిల్లవనే అనుకుంటున్నావా?"

పాప చిలిపిగా నవ్వుతూ, వెంకటరత్నం రెండు చెంపలూ తనచేతులతో పట్టుకుని, "నేను చిన్నపిల్లను కాదా?" అని కొంటెగా అడిగింది.

"ఒప్పుకొన్నానులే. ఇక చెంపలు వదులు."

"వదులుతానుకాని, వదిలేముందు ఒక్క చెంపకాయ వేసి వదలాలనిఉంది. వేయమంటావా?"

"పాపా!"

"ఏం మామయ్యా?"

"నన్ను కొట్టాలని ఎందుకే అనిపిస్తున్నది నీకు?"

"అది నా మనసుకిసంబంధించినవిషయం. మామయ్యా! అది నీకు చెప్పకుండా దాచుకోవటానికి నాకు హక్కుఉంది."

వెంకటరత్నం కళ్ళముందునుంచి తెరలు ఒకొక్కటే దిగజారిపోతున్నాయి.

వెంకటరత్నంచెంపలు వదలివేసి, పాప ఇలా అన్నది, "జీవనస్రవంతిలో ఒక రక్తబిందువు కలిస్తే, మరో నీటిబిందువు ఇంకిపోతుంది, మామయ్యా! ఇదే సృష్టిలో రహస్యం!"

సమాప్తం.